ఓమ్

ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

# శ్రీ శంకరానందగిరి గురువర చరిత్ర

## ప్రథమ భాగము




లేఖకుడు

తత్త్వానందబ్రహ్మచారి

పరిష్కర్త

S. రాజగుప్తగారు



[శ్రీమన్మథ ఆషాఢ] ౧౯౫౫ [శుద్ధ ఏకాదశి

# గ్రంథము వలయువారు

ఈ క్రింది చిరునామాలకు వ్రాసి వివరములతో తెప్పించుకొన వచ్చును.

౧. చైతన్యగ్రంథమండలి,
"చైతన్యవిహారము,"
135, వీరపిళ్ళెవీథి, బెంగళూరు-1.

౨. శ్రీతత్త్వానందబ్రహ్మచారిగారు,
శ్రీ శివలింగాశ్రమము,
కుందనగుర్తి, చిప్పగిరి పోస్టు,
వయా గుంతకల్లు.



బెంగళూరు దండు
అబ్బేమసీదు వీథియందుగల
అశోకా ప్రింటర్సువారిచే
ముద్రింపబడియె

ఓం

శ్రీ ఉమామహేశ్వరాయ నమః

దానం ప్రియవాక్సహితం జ్ఞానమగర్వం క్షమాన్వితం శౌర్యం।
విత్తం త్యాగసమేతం దుర్లభమేతచ్చతుర్విధం భద్రం॥
దానప్రష్ట్వైః శివం ప్రార్చ్య నరో యాతి శివం పదం।
దానేన పూజయే ద్దేవం విశ్వమూర్తిం పరేశ్వరం॥

అనునట్లు గురుభక్తితో ఈ గ్రంథముద్రణకై సాత్వికదానం
బొసంగిన వదాన్యులు

**శ్రీయుత కందుకూరు వెంకటరెడ్డిగారు** రూ.
(కుందనగుర్తి) **200/-**

శ్రీమతి పగిడి శాయమ్మగారు (నంద్యాల్) .... 50/-
శ్రీమతి బుశెట్టి భజన సుబ్బమ్మగారు నంద్యాల .... ,,
శ్రీయుత మాఘం సుబ్రమ్మాణ్యం శ్రేష్ఠిగారు, నంద్యాల ,,
,, గుండా పద్మనాభయ్యశ్రేష్ఠిగారు, నంద్యాల ,,
,, బొగ్గరపు రోసెయ్యశ్రేష్ఠిగారు, నంద్యాల .... ,,
,, పుణ్యమూర్తి వెంకటసత్యనారాయణశ్రేష్ఠిగారు ,,
,, మేడిశెట్టి చిన్నసుబ్బయ్యశ్రేష్ఠిగారు, నంద్యాల ,,
,, దుద్యాల అప్పయ్యశ్రేష్ఠిగారు, నంద్యాల ,,
,, సంకల వెంగన్నగారు, నంద్యాల .... ,,
,, D. నీలకంఠప్పగారు (బెలడోణ) .... ,,
,, A. రామప్పగారి ధర్మపత్ని గౌరమ్మగారు, గుంతకల్లు ,,
,, ఓ. బసయ్యగారు (కదిరి) .... ,,
,, కరణం కృష్ణరావుగారి ధర్మపత్ని జానమ్మగారు ,,

| | | |
|---|---|---|
| | | రూ. |
| శ్రీమతి మెట్టుపల్లి మల్లమ్మగారు (గుంతకల్లు) | | 50/– |
| శ్రీయుత | పి. వీరయ్యగారి ధర్మపత్ని పంపమ్మగారు, నేమకల్లు | ,, |
| ,, | గోవిందరెడ్డిగారి ధర్మపత్ని లక్ష్మమ్మగారు కుందనగుర్తి | ,, |
| ,, | యం. పంపయ్యస్వామిగారు (కుందనగుర్తి) | ,, |
| ,, | చాబాల హనుమప్ప అండ్ సన్స్‌వారు కుందనగుర్తి | ,, |
| ,, | K. గాదిలింగప్పగారు (కుందనగుర్తి) | ,, |
| ,, | గుంటపల్లి తిప్పయ్యగారు, శ్రీ శివలింగాశ్రమ ధర్మకర్త (కుందనగుర్తి) | ,, |



శ్రీ మదుమామహేశ్వరపీఠాధిపతులు



పూజ్యపాద

**శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారు**

చరిత్రనాయకులు

శ్రీవారి సద్గురుమూర్తి



పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ సదానందస్వాములవారు

శ్రీవారి పరమగురువు



శ్రీ మత్పరమహంస ౧౦౮ శ్రీ ప్రణవానందస్వాములవారు

# విషయ సూచిక

నెం. 2540/20-5-55.

॥ శ్రీ జగద్గురు విశ్వారాధ్య ప్రసీదతు ॥

శ్రీ మద్వేదాగమోపనిషత్పురాణేతిహాస ప్రసిద్ధవిమల వీరశైవ మహామతస్థాపనాచార్యవర్య సమస్తపవిత్రక్షేత్రమస్తకమణీభూత శ్రీమద్వారణాసీమహాక్షేత్ర మధ్యవిద్యోతమాన శ్రీమద్విశ్వేశ్వర లింగగర్భావిర్భూత శ్రీమజ్జగద్గురు విశ్వారాధ్యగురుపరంపరాగత హరికేశనందనవన విరాజమాన జంగమవాటికామహామఠాధిష్ఠిత జ్ఞానసింహాసనాధీశ్వర శ్రీ ౧౦౦౮ జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహాస్వామినాం దివ్యసన్నిధానేన—

శ్రీ గురువరచరణనఖచంద్రసాంద్రరుచిరచంద్రచంద్రికాచంచచ్చకోరాయమాణులగు కుందనకర్తి శివలింగాశ్రమభక్తులకు అనేక శుభాశీర్వాదపూర్వకముగా సెలవిచ్చునదేమనగా:—

మీరందఱు ఆత్మోద్ధారమునకై పరశివతత్త్వచింతనజేయుచు శ్రీశంకరానందగిరిస్వాములవారి సదాచారసత్యనిష్ఠ జీవనచరిత్రమునను ప్రకటించు విషయము విదితమై మహదానందమయ్యెను. శ్రీ శంకరానందగిరిస్వాములవారు నైష్ఠికబ్రహ్మచారులై బాల్యకాలమునుండియు శివజీవైక్యరూపమగు ఆధ్యాత్మికజీవనమునంగీకరించినవారు.

అశాంతమయవాతావరణముతోకూడిన భౌతికమార్గమున జిక్కి కింకర్తవ్యతామూఢులైన సాధారణజనులకు "ధర్మో రక్షతి రక్షితః" "సర్వం ఖల్విదం బ్రహ్మ", "తపస్తప్త్వా బ్రహ్మవిజిజ్ఞాసస్వ", మున్నగు ధార్మికము మరియు వేదాంతోపనిషద్వాక్యములతో శాంతిసందేశమునందజేయుచు శ్రీ శంకరానందగిరిస్వాములవారు

అధ్యాత్మికతత్త్వమునుపదేశించుచుండుట సుప్రసిద్ధమైయున్నది. ఇట్టి సదసద్వివేకసంపన్నుల జీవనచరిత్రము జనులకు సన్మార్గదర్శకముగుగాక! శ్రీ శంకరానందగిరిస్వాములవారి ఆధ్యాత్మిక కార్యక్షేత్రము విశాలాంధ్రమున వ్యాపించుగాక!! సత్యసనాతనతత్త్వ చింతనతో స్వతంత్రభారతజనాంగము నిత్యసుఖియగుగాక!!!

ఇతి శివం భూయాత్

మకాం:—జంగమవాడి మఠము
శ్రీక్షేత్రకాశి

ఇత్యాశిషః

---

శ్రీ జగద్గురు పండితారాధ్యో విజయతే
శ్రీ గిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర
శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య శివాచార్యమహాస్వాములవారు
శ్రీ జగద్గురు శ్రీశైల సూర్యసింహాసనమఠము

నెం. 7190 మకాం....గుంతకల్లు తే. 4-5-55

"........మీ బాబు చేరి సంతసమయ్యెను.

సదయులు, స్వార్థత్యాగులు, తత్త్వజ్ఞానులునైన మానవకల్యాణమును గోరుచున్న మహాత్ముల జీవనచరిత్రలు ప్రకాశములగుట సత్కార్యములలో ముఖ్యమైనది.

గురుకులసంజాతులు, ఆత్మీయులు, విశాలాంతఃకరణులు వయస్సుచే చిన్నవారైనను శుకమునివలె హేయసంసారమునుండి, వెలువడి తీవ్రవైరాగ్యముతో సకలమానవహితమును గోరుచున్న వారునునగు శ్రీశంకరానందగిరిస్వాములవారి జీవనచరిత్రము

ప్రకాశితమగుచుండుట మాకు మిక్కిలి ఆనందము గల్గించినది.

శ్రీశైలమల్లినాథుడు, జగద్గురు పండితారాధ్యులును వారికి శివోపాసనాసిద్ధిని, దీర్ఘాయురారోగ్యముల నొసంగి రక్షించుగాక యని కోరుచున్నాము.

ఇత్యాశిషః

---

పూజ్యపాద
శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు,

మకాం : తెనాలి
తే. 21—5—'55

"మిత్రులు శ్రీశంకరానందగిరిస్వాములవారు శ్రోత్రియబ్రహ్మనిష్ఠులు; విద్యావినయవివేకాదిదివ్యగుణసంపన్నులు; మేలిమి బంగారమువంటి స్వచ్ఛజీవితము గలవారు. దర్శింపదగిన, స్పృశింపదగిన, పూజింపదగిన మహావ్యక్తి; అల్పులయందును మహత్వమును దర్శించెడి సమ్యగ్దృష్టిగలవారు. వీరి యీ జీవిత చరిత్ర కంటెను సాక్షాత్తు అపరోక్షముగా దర్శనమిచ్చుచున్న వీరి జీవితమే ఒక మహోపదేశము చేయగలదు. దర్శించినవారు నిజముగు ముముక్షువులైనచో ఆ ప్రయోజనమును పొందగలరు. సాక్షాత్తుగా వీరి పరిచయము లేనివారికి వీరి యీ జీవితచరిత్రము పఠనపాఠనాదులద్వారా మేలు గూర్పగలదు. శ్రేయోమార్గమున బ్రవర్తింపజేయుసాధనము కాగలదు. వీరినిగూర్చి పఠింపవలెను. వీరినిగూర్చి శ్రవణమననముల జేయువలెను. వీరిని దర్శింపవలెను. అభేదానుభూతిని పొందవలెను.

పరివ్రాజకసంస్కారము అంతర్గతముగా విరాజిల్లుచున్న రాజగుప్తగారు ఈ మహనీయుని జీవితచరిత్రను యథామతి పరిష్క-

రించి పాఠకలోకమున కందజేయ దొడ్డదినారు. దీని నుపయో
గించుకొని పాఠకులు పరమలాభమును బడసెదరుగాక!''

ఓం తత్ సత్

(సం.) స్వామి శుద్ధచైతన్య

---

శ్రీ స్వామి శంకరానందజి
అధ్యక్షులు
శ్రీ శంకరానందాశ్రమము

ఆళ్ళగడ్డ
మకాం: సదము.
తే. 14-5-'55

సాధారణముగా మహాపురుషుల జీవనచరిత్రము సాధకుల కాదర్శప్రాయముగా నుండవలెను. అట్లు లేనిచో దానిని జీవనచరిత్రమని యనరాదు. మరియు నది యితరులకుపయోగము కాజాలదు. ఇట్టి యొరిపిడిఱాతిలో రుద్ది శ్రీ శంకరానందస్వామివారను సువర్ణమును పరీక్షింపవచ్చును. ఈ మహాపురుషులు మాకు చిరపరిచితులు. మాకు సంబంధించిన మైసూరు ప్రాంతము వెంగరేఖాగిరి శ్రీ శివానందసేవాశ్రమమందు వీరు కొంతకాలము నివసించి తపోనిష్ఠులై సిద్ధిని బొందిరి. అచ్చటివారి కాదర్శప్రాయులై వారి యాదరణను బొందియున్నారు. మఱియు పవిత్రవారణాశి క్షేత్రమునందుండి శాస్త్రముల నధ్యయనము చేసి పారంగతులైరి. అక్కడి సత్సంగముచే పెక్కు ఆధ్యాత్మిక విషయముల నెఱింగియున్నారు.

ప్రపంచమున మహాపురుషులెందరో గలరు. కాని వారిలో కొందఱు భక్తమాత్రులైయుందురు; మఱికొందఱు కేవల వైరాగ్యసంపన్నులైయుందురు; వేఱుకొందఱు కేవలజ్ఞానులైయుందురు. తక్కినకొందఱు తపోనిష్ఠులైయుందురు. కాని ఈ మహా

పురుషులు భక్తివైరాగ్యజ్ఞాన తపస్సులన్నింటియందును పారంగ తులైయున్నారు. సారాంశముగా చెప్పినచో వీరు ఆశ్రయించి యున్నశ్రీ ఉమామహేశ్వరసంప్రదాయమునకొక మహత్తరమైన కళగల్గినదన్నచో నతిశయోక్తి కానేరదు. వీరిలోగల మఱొక లక్షణ మేమనగా వీరి బోధనాపద్ధతి విశేషమైనది. వీరు అధికృత ప్రబో ధకులైయున్నారు. వీరివలన పండితులకు పామరులకుకూడ ప్రయోజనమగును. వీరికి సర్వాంతర్యామియగు భగవంతుడు చిరాయురారోగ్యముల నొసంగి వీరి యుపాధినుండి పెక్కు జనసు లకు తమ జీవనము సార్థకపఱచుకొను నవకాశముగుంగాక యని కోరుచున్నాను.

ఇతి

(సం.) శంకరానంద

---

ఓం తత్ సత్ తే. 2-3-55

శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి స్వాములవారు కుందనకుర్తి శివలిం గాశ్రమనివాసులు. ఈ మహాపురుషులు నాకు చిరపరిచితులు. వీరియొక్క జన్మపరంపరాచార్యత్వముకూడ కొంతవరకు తెలి యును. శ్రీ స్వాములవారు చిన్నవయస్సన అనగా 12-13 సం. లోపుగనే పూర్ణవిరక్తితో స్వగ్రామమును విడచి అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గంజిగుంట గ్రామమున శ్రీ ప్రణవానందాశ్రమ మున బ్ర|| ని|| శ్రీ వీరప్ప (సదానంద) స్వాములవారి సన్నిధిని బ్రహ్మ జిజ్ఞాసచేయుచుండగా నేను ఆ ఆశ్రమమునకు వెళ్ళిచూడగా ఈ మహాదేదీప్యమానమైన వ్యక్తి నా దృక్పథమున పడెను. అప్పుడు నా హృత్పటలమున ఈ వ్యక్తి అవతారీకుడను భావనగల్గెను.

వెంటనే నా విశ్వాసపాత్రులైన శ్రీ సదానందస్వాములవారితో, ఈయనకు తగిన బోధ చేయవలసినదని మనవిజేసితిని. మరియు అక్కడనున్న సద్భక్తశిఖామణి గురుసేవానిరతులైన వెలనాటి వెంకటప్పగారితోకూడ పై విషయమును సూచించి, "వీరికి తగిన సర్వసౌకర్యముల నొసంగుము. నీ జన్మధన్య"మని జెప్పితిని.

వీరినుండి లోకోపకారమగుననియు దెల్పితిని. నిజముగా ఆ జన్మ బ్రహ్మచర్య విరక్తి మైత్ర్యాది సద్గుణయుక్తులగుటవలన వీరి ప్రారబ్ధము శుకులవంటిదను భావము గల్గెను. ఇట్టి మహా పురుషులయొక్క జీవనచరిత్రము ప్రకటమగునదిచూడ నాకు మహదానందమయ్యెను. దీనిలో అతిశయోక్తి యేమియు లేక ఉన్న విషయము యథార్థముగా వ్రాయబడినది. ఇట్టి జీవనచరిత్ర విషయములు సాధకులకు విశేషమైన సహాయము కల్గించునని నా భావన. శివం—శివం—శివం

తే. 2–3–'55 భవదీయ

మకాం : బ్రహ్మవిద్యాశ్రమము బ్ర॥ శ్రీ॥ శంకరానందస్వామి

బెంగళూరు సురపురం

---

స్వామి కేశవతీర్థ శ్రీరామతీర్థ సేవాశ్రమము

సంపాదకులు పిడుగురాల

"రామదర్శన్" తే. 17-2-'55

## మహాత్ముల చరిత్రలు

మహాత్ముల చరిత్రలు అవశ్యం అధ్యయనీయాలు. మానవుడు తన సంకుచితావరణాలను అతిక్రమించి, విశ్వాత్మతో, మహాత్మతో

శ్రుతికలపడానికి మహాత్ముల జీవనచరిత్రల అధ్యయనం అత్యంతోప యోగకరం. ఎవరు మహాత్ములు? ఆకాశంమీద నడచేవాండ్లా? కాదు. నిత్యబ్రహ్మాకాశంలో విహరించేవాండ్లు. విషయభూవాసన లకు అంటక, సంతతాత్మాకాశంలో విహరించేవాండ్లు మహాత్ములు. మట్టిని బంగారంగాచేసేవాండ్లా? కాదు. ప్రపంచాన్ని పరమా త్మగా దర్శించేవాండ్లు మహాత్ములు. ఎవరిలో పశువాసనలు నిర్జి తమ్మైనవో, ఎవరిలో ఆత్మతేజం ప్రబుద్ధమై ప్రదీపించిందో, ఎవరి ఆత్మ విశ్వాత్మతో, భగవంతునితో మిళితమైందో, వాండ్లే మహాత్ములు. అట్టి మహాపురుషుల అడుగుజాడల్లో నడవడంవల్ల మానవులు శాంతిస్థానాన్ని చేరుకుంటారు. జీవితాన్ని నిజమైన జీవితంగా, ఈశ్వరారాధనారూపకంగా, గడవగలగడమే సత్యమైన జీవితకళ. ఇట్టి కళావేత్తలే ఋషులు. సంఘర్షణాతీతమైన, ఈ జీవితకళను, ఈ ఋషిత్వాన్ని పొందడమే జీవితకృతార్థత. జీవన సంకులమంతా, జీవితకళను, ఉత్కృష్ట సంస్కృతిని పొందకపోవడమే.

శ్రీరామతీర్థస్వామివారన్నట్లు, వివేకంతో పఠిస్తే ఒకఋషి జీవితం ఎంత మేలుచేస్తుందో, ఒక పామరుని జీవితము అదే మేలుచేస్తుంది. ఋషిజీవితంలో—సత్యాభిముఖత్వంచేత పొందే శ్రేయస్సును మనం పఠిస్తాము. దుర్జనుని జీవితంలో—సత్య విముఖత్వంచేత కలిగే అనర్థాన్ని మనం పఠిస్తాము, ఒకే విషయ మును, రెండు రూపాలలో గ్రహిస్తాము. ఋషిజీవితం—సత్యత త్వమును, సక్రమంగా, తప్పుడులేకుండా, మనకు బోధిస్తుంది.

అనాదికాలాలనుండి నేటివరకు భారతవర్షం ఋషిభూమి! ఆర్యావర్తము! ఈ పఠించబోతున్న ఈ ఒకానొక ఆధునిక ఋషి

జీవితం, మానవజీవన సంస్కృతికి, దివ్యశాంతికి, అవసరమైన సందేశంతో ఆవిర్భవించింది. సర్వులూ పఠింప ప్రార్థన—

శ్రీ కేశవతీర్థ స్వామి.

---

ప్రేమకుసుమం

[గీతావాణి సంపాదకులు శ్రీరామకృష్ణానంద స్వామివారొసగిన అభిప్రాయం]

సత్పురుషులు జనాంగంలో విటమిన్లవంటివారు. వారి జీవిత కథలు సాధకలోకానికి కరదీపికల్లాంటివి. వారి బోధాచరణప్రచారాలు మానవసమాజానికి చైతన్యాన్ని చేదిపోస్తాయి.

వైరాగ్యంలోత్యాగంలోనే కాదు; ప్రేమలో సౌజన్యంలోకూడ శ్రీ శంకరానందగిరిస్వామివారు కొండంతటివారు. వారి ఆదర్శ జీవితం గ్రంథరూపంగా మూర్తీభవించుట యెంతైనా సంతసింపదగినవిషయం. ఈ గ్రంథం ముముక్షువులకు చక్కని పాథేయమై వైరాగ్యబలాన్ని చేకూర్చుగాక. ఓం

మకాం—ఆగరం శ్రీ రామకృష్ణ

కోలారు జిల్లా 9-3-'55

---

ఓమ్

సాధు లక్ష్మీనరసింహ శర్మ, కృష్ణమాచారి కాంపౌండ్ బళ్ళారి

"......గ్రంథరచనకు ప్రచురణమునకు ఈనాడున్న స్వాతంత్ర్యసౌకర్యములు మున్నెన్నడును లేవు.......

"నావిరతో దుశ్చరితాత్, నాశాంతో నాసమాహితః।
నాశాంత మానసో వాపి ప్రజ్ఞా నైనైనమాప్నుయాత్ ॥"

అనునట్లు ఆచారహీనుడైనవాడెంత పండితుడైనను పరతత్త్వమును పడయజాలడు. నేడు బుద్ధిని బలమును నమ్మిన పాశ్చాత్యసంస్కృతి మానవజాతినే ముంచివేయుచున్నది. ఇట్టి తరుణమున రజస్తమోమయమగు నాగరికతా ప్రవాహమునుండి బయటబడి తాముత్తీర్ణులై తోడిసోదరుల నుద్ధరింపగల ప్రశాంతసుందర గంభీరపవిత్రవాతావరణముగల మహర్షులు, సాధువులు, యోగులు నేటికిని అచ్చటచ్చట వెలయుచున్నారు. అట్టి మహనీయుల కోటికి జెందిన శ్రీశ్రీశ్రీ శంకరానందగిరిస్వాములవారు మనోవాక్కాయకర్మలందు చిరంతన సత్యసౌందర్యమును అనుభవించి అనుభవింపజేయుచున్నారు. ఇట్టి శ్రీవారి ఆదర్శ చరిత్రము ముముక్షువులకు ముకురమువంటిది. అద్దానికి వాగ్రూపము నొసగి సాధకుల ముందుంచుచున్నవారి ప్రయత్నము పరమశ్లాఘనీయమైనది. ఇక్కార్యము భగవత్కైంకర్యమేయగును. ఇట్టి భగవదారాధనకు పవిత్రసామగ్రులుగా సంసిద్ధులైన సత్పురుషులకు నా ధన్యవాదములు భగవదాశీరనుగ్రహములు.

"శంకరానందగిరిగురు సచ్చరిత్ర,
శంకరానందగిరి నెక్కు శక్తియుక్తి।
నొసగి శంకరభక్తుల కూతయగుచు,
వెలయుగావుత సజ్జనవినుతమగుచు."

మన్మథ వైశాఖ
బ॥ ఏకాదశి

సాధు........శర్మ

# తొలిపలుకు

"త్రిజగతి సజ్జనసంగతిరేకా" అనునట్లు సజ్జనుల సహవాసము ముల్లోకంబులయందును కడు దుర్లభంబు. అనేక జన్మార్జిత పుణ్యధన క్రేయంబు. రూపలావణ్యవయోవర్ణధనవిద్యాయౌవనాది మదంబులచే నలభ్యంబు, పరమశ్రేయఃప్రాప్తికేకైక సాధనంబు. అవ్వారి సావాసంబున నందని శ్రేయంబొకండుగలదే!

ఇక నట్టి పరమసజ్జనుల జీవితంబులు లోకంబునకాదర్శంబులు. వారి ప్రతివాక్కును నమృతప్రాయంబు. హృదంతరాళ నిగూఢానాద్యవిద్యోన్మూలన పాటవంబు. వారి ప్రతిక్రియయు జగద్ధితకారియై యొప్పు. వారి ప్రతిసంకల్పమును లోక కల్యాణ దాయకంబు. వారి చరిత్రయన్ననో పరమప్రమాణంబగు శాస్త్రంబు. స్వస్వహృదయంబనెడి సువర్ణంబు బరీక్షింపఁదగు నికషోపలంబు. నానావాసనాయుతంబగు మనంబుల్ శుద్ధిగావింప పవిత్రభాగీరథి. అజ్ఞానాంధకారమునఁబడి దరిగానక పరితపించుచున్న జీవులకేకైక జ్యోతి. అసన్మార్గంబునఁజిక్కి శాంతినందలేక వంతంబొగులుచున్న జ్ఞాన బుభుక్షువుల కేకైక పాథేయంబు.

అట్టి మహనీయ గుణగణ సంపద్విశిష్టులును, పరమ కరుణాస్వరూపులును, వివేకోపేతభావవిరక్తిసంపన్నులును, విద్యావినయాది సల్లక్షణ లక్షితులును, యతివరేణ్యులును, సర్వభూత మైత్రులును, అస్మదీయచిర సన్మిత్రులును, శ్రీమదుమామహేశ్వరపీఠాధిపతులును పరమహంసపరివ్రాజకాచార్యవర్యులునునగు పూజ్యపాద ౧౦౮ శ్రీ శంకరానందగిరిస్వాములవారి యీ చరిత్రంబు నాలోకింపనే కడుంగడు ధన్యుండ.

మొట్టమొదట నీ గ్రంథంబుఁ బరిష్కరింప నన్నడిగిరి. ప్రస్తుతము సాధ్యంబుగాదని కొన్నికారణంబులఁ జేర్కొనుచు, నా యశక్తతనుఁ విన్నవించితిని. కాని నాయందలి వాత్సల్యంబుననో నా పుణ్యంబుననో పరిష్కరించియే తీరవలెనని పెద్దల ముదలయయ్యెను. దానిం దిరస్కరింప నశక్తుండనై యంగీకరించితిని. అన్నివిధముల నా తోచినంతవఱకు సంస్కరింపబడియె. అందరికి నందుబాటులో నుండుటకొఱకై భాషాశైలి సాధ్యమైనంతవఱకు సరళము గావింపబడెను. చాలవఱకు సంధులు విడదీయబడెను. తగిన భాగములుగా విభజింపబడెను. శ్రీ సద్గురుకటాక్ష రూప జ్యోతిలో గన్గొన్న యిందలి యొప్పులన్నియు నతనివే. ఈ పరిష్కరణవ్యాజంబున నెన్నియో విషయంబులెఱుంగఁగల్గితి. ఇట్టి సదవకాశమును గల్గించిన పూజ్యులకు నా జోహార్లు. చరిత్రనాయకులగు శ్రీవారికనంత నమోవాకంబులర్పించువాఁడ.

ఈ గ్రంథరచయితలగు మదీయమిత్రవర్యులు శ్రీ తత్త్వానంద బ్రహ్మచారిగారు గురుభక్తి పరాయణులగు సాధుపుంగవులని వేఱుగా నుగ్గడింపఁబనిలేదు. స్వధర్మదీక్షాబద్ధులగు సద్బుద్ధులు గురుసేవానిరతులు. శమదమాది సుగుణోపేతులు. పరమపవిత్రంబగు స్వీయగురుచరిత్రంబు రచియించి శ్రీమదుమామహేశ్వరపీఠ భక్తలోకకరకమలంబుల కందఁజేసి, యానందింపఁజేసిన ధన్యులు. ఇట్టి వీరి కృషి సార్థకంబై జగద్ధితకారియగు గాక. పవిత్రచరిత్ర మాచంద్రతారార్కము నమరమై యుమరుఁగాక.

పెక్కాటంకంబులు గల్గుచున్నను ముద్రణకార్యమును మిక్కిలి యోపికతో నిర్వహించి గ్రంథంబులం ద్వరలో నందించిన అశోకా ప్రింటర్స్ యజమానులును, శ్రద్ధావంతులును, శాంతస్వరూపు

లును, ఆస్తికులును నగు శ్రీ యం. నారాయణస్వామి మరియు సోదరులను దయామయుడగు శ్రీశైలేశుండు కరుణం బ్రోచుగాత.

కరుణామయుడగు నుమానాథుడు భక్తజగతిని క్రీగంటి చూపులతో వీక్షించుగాక.

ఇట్లు
సుజన పాదధూళి
S. రాజగుప్త,
18—5—1955

చైతన్య విహారము
135, వీరపిళ్ళెవీధి
బెంగళూరు-1.

---

## "పీఠిక"

"తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మిసాగరమ్"—అనునట్లు మహాగుణగణ సంపన్నులగు పూజ్యపాద ౧౦౮ శ్రీ శంకరానందగిరి గురువర స్వాములవారి యపూర్వజీవితచరిత్రను వ్రాయనుంకించిన నా ప్రయత్నము అపారమగు సముద్రమును అల్పమగు తెప్ప ద్వారా దాటయత్నించుటవంటిది. కాని ఆ గురుడే కర్ణధారుడై నా యండనుండ భయమేలయని తలంచి ప్రారంభించితిని.

మహనీయులగు పుణ్యపురుషుల జీవితచరిత్రముల నవలోకించుటవలన మానవహృదయపరివర్తనమొందును. వివేక వైరాగ్యములలవడును. భక్తిప్రపత్తులుప్పతిల్లును. అహము బాసి ఆత్మసాక్షాత్కారమునొందుటకు సాధనముగును. మహాత్ములు తమ జీవితమును సంపూర్ణముగా భగవదంకితము జేసి తురీయమగు పరమపురుషార్థమునకై లోకమున చరించిరి. ఆ సత్యమును తీవ్ర నిష్ఠచే గనుగొని ఆదర్శపురుషులై లోకమునకు చాటిరి. ఇట్టి

పావనుల జీవితచరిత్రలను చదువుటచే పాఠకుల చిత్తములకు నూతనశక్తిగల్గి ఆధ్యాత్మికాభ్యుదయమునొందుననుటకు సందియమంు లేదు.

ఈ చరిత్రనాయకులగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ స్వాములవారు ఇట్టి దైవీసంపద్విభూషితులు. మేలిమిబంగారమనదగు నైష్ఠిక బ్రహ్మచారులు, ధీరవిరక్తులు, ఆదర్శాచారవంతులు సదాత్మైకరతులు, సద్విద్యావంతులు, శమదమాది గుణనిలయులు. ఇట్టి మహనీయుల జీవితచరిత్రను చిత్రించి పాఠకులకందించు మహాభాగ్యము నాకబ్బినందులకు నే ధన్యుడను. శ్రీ స్వామివారి చెంతనపుడపుడధికకాలము వసించుచు వారిని సేవించుచున్నందున చరిత్రను సంగ్రహించు సుయోగము నాకబ్బెను. ఇది ప్రథమభాగము.

ఇందలి విషయములన్నియు ప్రత్యక్షముగా శ్రీవారి శ్రీముఖము నుండి విన్నవియు, వారి దినచర్యలో నున్నవియు నున్నట్టు సంగ్రహించి బెట్టితిని. చరిత్రకు దగినట్లు అచ్చటచ్చట ఉపమానములను దృష్టాంతములను చేర్చితిని. ఇందు కొన్ని హిందీకన్నడ సంస్కృతభాషలయందు జరిగిన సంవాదములను, శ్రీవారినుండియే అనువదింపబడి తమ దినచర్యయందు వ్రాసిబెట్టిన విధముగానే చేర్చితిని.

చిరకాలమునుండియు పూజ్యశ్రీస్వామివారి చరిత్రను వ్రాయవలెననెడి సదిచ్ఛగల నన్ను పెక్కుమంది ఉత్తమభక్తులు ప్రేరేపించి ప్రోత్సహించిరి. చివఱకు శ్రీగురుకృపచే నా సంకల్పము పూర్ణమయ్యెను. అక్షమ్యములగు విషయములేవైన ఉన్నచో క్షమాశీలురగు పాఠకులు అల్పమతినగు ఈ సేవకునియందు కృపగల్గి తెల్పినచో వానిని సాదరముగా సవరించుకొందును.

మఱియు ఈ చరిత్రను పరిష్కరించుటకై, పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్యస్వాములవారి ఉత్తమశిష్యులును, శ్రీవారి సన్మిత్రులును, సర్వసద్గుణసంపన్నులును, ఆదర్శగృహస్థులును, సదాచార విచార నిష్ఠావరులును, ఆధ్యాత్మిక ప్రచారకులును, బెంగళూరులో గౌర్నమెంటు ఉన్నతపాఠశాలలో ఆంధ్రపండితులునునగు కవికోకిల విద్వాన్ శ్రీ S. రాజగుప్త మహాశయులకు పంపగా, తమకెన్నియో అనివార్యకార్యములున్నను సాదరముగా ౖగైకొని నిండు మనంబుతో కూలంకషముగా సంస్కరించి మెఱుగుబెట్టుటయే గాక స్వార్థత్యాగులై తీవ్రపరిశ్రమవహించి మొత్తముగ్రంథమును శుద్ధముగా వ్రాసిరి. మా ప్రార్థనలమన్నించి గొప్ప బాధ్యతతో కూడిన గ్రంథ ముద్రణమహాకార్యభారమును కూడ వహించి స్వయముగా ప్రూఫులు దిద్దుట మున్నగు పనులెల్ల చూచుకొనుచు అతిశీఘ్రకాలమున గ్రంథమునింత సుసంపన్నమొనర్చి భక్తుల కరారవిందముల కందజేసి హృదయానందమందించిన ఈ సుధీమణులు చిరస్మరణీయులు. వీరికి నా హృత్పూర్వక కృతజ్ఞతావందనములర్పించువాడను. కరుణామయుడగు శ్రీమదుమామహేశ్వరుడు వీరిం గరుణంబ్రోచుగాక.

ఉదారమనముతో ఈ గ్రంథముద్రణకు వలసినంత ధనసహాయంబొనర్చిన, పట్టిలో గనపఱచిన వదాన్యులకును, ఈ గ్రంథమును గుఱించియు, పూజ్యశ్రీ స్వాములవారిని గుఱించియు విశాల భావములతోను సత్యదృష్టితోను తమ శుభ సందేశములను, అభిప్రాయములను అనుగ్రహించి పంపిన శ్రీ జగద్గురు స్వాములవారలకు, తక్కిన పెక్కు మహాత్ములకును, నానావిధముల సహాయమొనర్చిన అందరికిని నా హృత్పూర్వక ప్రణుతిశతంబు లర్పిం

చుకొనుచున్నాను. అందముగా సకాలమున కందజేసిన ముద్రణా లయమువారికిని నా ధన్యవాదములర్పించి, వారికి సర్వతోముఖాభి వృద్ధి గలుగునట్లు రక్షించుగాకయుని శ్రీశైలేశుని ప్రార్థించుట నా కర్తవ్యంబు.

శ్రీ సద్గురుకృపచే నియ్యది లోక హితకారియై వెల్గుగాకయుని కోరువాడ,

ఇట్లు
బుధజన వినమితుడు
తత్త్వానంద బ్రహ్మచారి

## అంకితము

సర్వాంతర్యామియై శ్రీమదుమామహేశ్వర స్వరూపియై శ్రీమదుమామహేశ్వర పీఠాధిపతియైయున్న ఏ సద్గురుపర మాత్మయొక్క కృపాలేశవిశేషముచేతను, అమోఘాశీర్బలం బుతోను ఈ గ్రంథము ప్రకాశము కాగల్గెనో అట్టి సద్గురు చరణారవిందములయందు, తత్పదకమలసంజాత పరాగమగు ఈ సేవకుని అల్పసేవారూపమగు ఈ గ్రంథమును సద్భక్తి పూర్వకముగా ఈ సుమంగళ ముహూర్తమున అంకితమొన ర్చుచున్నాను.

# శ్రీ ఉమామహేశ్వర పీఠస్థగురుపరంపరా స్తోత్రము

రచన: విద్వాన్ S. రాజగుప్తగారు, బెంగళూరు

కైలాసేశముమానాథం తథా నందీశ్వరం గురుం।
సనత్కుమారం సూతర్షిం సర్వదా తం నమామ్యహం॥ ౧
నమామి భగవన్నాథం కరూర్ సిద్ధమరుళ్ మునిం।
తచ్ఛిష్యం చ కళూర్ మౌనిం పరమౌనిం భజామ్యహం॥ ౨
తిరుప్పనందాళగురుం తథామధురపుంజకం।
యోగీశ్వరం తిరునటరాజం భక్త్యా స్మరామ్యహం॥ ౩
శివప్రకాశం యోగీశం స్వరూపానంద ముత్తమం।
తత్త్వరాజస్వామినం తం శాంతలింగార్యకం తథా॥ ౪
కుమారదేవం తచ్ఛిష్యం చిదంబరగురుం విభుం।
నారాయణాచార్యగురుం భూమాతాండవరాయకం॥ ౫
తాతార్యం తిల్లినాథంచ తథా వేంకటరంగకం।
ప్రణవానంద మౌనీశం జ్ఞానినం తత్సుశిష్యకౌ॥ ౬
ఆత్మానందసదానందయోగినౌ పరమౌగురూ।
తచ్ఛిష్యంచ తపోనిష్ఠం శ్రోత్రియం శాన్తరూపిణం॥ ౭
శ్రీశంకరానందగిరిం ప్రణమామి ముహుర్ముహుః।
అన్యానస్మద్గురూన్ వన్దే సత్త్వశుద్ధ్యై నతోస్మ్యహం॥ ౮
శ్రేయోస్త్వామా మహేశాఖ్య పీఠస్థేభ్యో సదా వరం।
తచ్ఛిష్యేభ్యః ప్రశిష్యేభ్యః సర్వేభ్యశ్చాస్తు మంగళం॥ ౯
ముముక్షుభ్యః సాధకేభ్యః సర్వదాస్తు సుమంగళం।
సచ్చిదానందరూపస్య ప్రసాదాత్సర్వమంగళం॥ ౧౦

ఓమ్—తత్—సత్



శ్రీ ఉమామహేశ్వరాయనమః

# శ్రీ శంకరానందగిరి గురువర చరిత్ర

## ౧. జననము

పుణ్యపురుషులవతరించిన పవిత్రక్షేత్రము మన భారతభూమి. వేయేల? భగవానుడగు శ్రీ కృష్ణ పరమాత్మ తన బాలలీలలందొక ప్పుడు భారతభూమి మట్టిని మహాప్రసాదమని యెంచి భుజించిన పవిత్రభూమి. కాన ఇట్టి పావనభారతావనియం దెందరో మహా పురుషులవతరించిరి. అట్టివారిలో మన కథానాయకులగు పూజ్య శ్రీ శంకరానందగిరిస్వాముల వారునొకరు.

వీరు ఆంధ్రరాష్ట్రమున అనంతపురం జిల్లా లత్తవరం—అను గ్రామమున కాశీజ్ఞాన సింహాసన విశ్వారాధ్యగురు పరంపరము నకుఁ జెందిన వీరశైవ మాహేశ్వరసదాచారసంపద్విశిష్టులగు వేదమూర్తి శివయస్వామి గంగమాంబలను పుణ్యదంపతులకు శ్రీ రౌద్రినామ సంవత్సరం జ్యేష్ఠబహుళ త్రయోదశి సోమవారం సూర్యోదయానంతరం ౫౨-౩౦ గడియలకు లేదా తె. 3-37 గంట లకు శుభ మేషలగ్నమందు (త్ర ౪౬-౦, భ. ౩-౨౮, కృ. ౫౬-౨౮

సుకర్మ ౨౯-౪౮, గరజి ౧౮-౪౩, అహస్సు ౩౧-౨౧) చంద్రహో రలో గురుసూక్ష్మహోరలో ధనుర్గురు నవాంశములో

| | | | |
|---|---|---|---|
| | కేతుః లగ్నం | శుక్రః చంద్రః | రవిః బుధః |
| | రాశికుండలి | | గురుః |
| మాంది | | | శనిః |
| | | కుజః రాహుః | |

14-6-1920వ తేదిని కుమారుడై జన్మించిరి. తండ్రి వీరికి "చెన్న బసవస్వామి'' అని నామకరణము గావించిరి.

## ౨. బాల్యము—విద్యాభ్యాసము

ఏకపుత్రుడగు నీ బాలుడు కన్న తలిదండ్రులకమితానందము నొందించుచు దినదినాభివృద్ధిగాంచుచు విద్యాభ్యాసమునకుఁ దగు వయస్సుగలవాఁడై స్వగ్రామముననే 4-5 తరుగతులవఱకు తెనుగు జదివెను. ఆ పిమ్మట అచ్చటికి సమీపమునసుండు ఉరవకొండ లోని "కరిబసవస్వామి బోర్డు హైస్కూలు''లో జేరెను.

ఈయనకు బాల్యమునుండియు భగవద్భక్తి మిక్కుటము. ప్రతిదినము శివపూజ రెండుమూడు ఘంటలసేపు జేయుచు తన్మయులగుచుండెడివారు. వీరికి విష్ణువిగ్రహమన్న అత్యంత

బాల్యమున శ్రీవారు



శ్రీ చెన్నబసవస్వామి

ప్రీతి. చేతియందు విగ్రహమునిడుకొని యాడుచు పాడుచుండెడి వారు. భావిజీవితమున శివకేశవాభేదరూపమగు అద్వైతదర్శనమునొందసూచకమై యుండెనేమో!

శ్రీవారి బాలలీలలు అద్భుతములు. పండ్రెండు పదుమూడేండ్ల వయసుననే "నేను భగవంతుని కన్నులారా చూచి రావలెను"—అనునిచ్ఛ తీవ్రముగ పొడముచుండెడిదట. అందుచే నొకదినమున "నేను దేవుని చూచుటకై యడవులకు వెళ్ళినాను. నన్ను గురించి మీరు చింతింపరాదు" అని ఒక కాగితముపై వ్రాసి ఇంటిలో తమ పుస్తకములపెట్టెపై బెట్టి తోడిమిత్రుడగు బి. ఆంజనేయులు అను నబ్బాయితో సహ బయలువెడలి పెన్నానదీ తీరమున పెన్నహోబిళపుటడవుల బ్రవేశించిరి. అంత మరుసటిదినం ఇంటిలోనివారీ కాగితమును చూచుకొని దుఃఖాక్రాంతులైరి. అడవులకు బయలదేరిన వీరిద్దఱును తమతమ తలిదండ్రులకు ఏకైకపుత్రులు కాబట్టి వారిం గన్న కడుపులలో ఎంతటి దుఃఖాగ్ని బయల్వెడలెనో చెప్పతీఱునా? ఎక్కడివారక్కడ వెతకుటకై వెళ్ళిరి. వారిలో నొకరు పెన్నహోబిళ ప్రాంతమున వెతకుచు వచ్చి శ్రమదీర్చుకొనుటకై నదీతీరస్థమగు నొక అశ్వత్థవృక్షచ్ఛాయలో గూర్చుండియుండిరి.

ఇంతలో నడవియందున్న ఈ బాలురు ఒక విచిత్ర సంఘటనం గాంచిరి. ఎవరో ఒక వ్యక్తి ఈ బాలురను చూచి,

"ఓ నాయనలారా! ఇటురండు. మీరెటకేగుచున్నారు? అది మార్గము గాదే!"—అని యడిగెను.

బా:—అయ్యా, మేము దేవుని చూచుటకై కొండలెక్కుచున్నాము.

వ్య:—(మహాసంతోషముతో) "నాయనా! మిముం గన్న తలిదండ్రులెంతటి పుణ్యాత్ములో గదా! చిన్నతనముననే ఈ

దొడ్డబుద్ధి మీకెట్లు బుట్టె ? నిజముగా మీరు ప్రత్యాత్ములే! రా రండి'' అని చేరంబిలిచి, అయ్యలారా! మీ యిచ్చ చాలమంచిదే గాని మీరింకను కొంతకాల మింటియొద్ద నుండుచు చక్కగా విద్యనభ్యసించి బుద్ధిమంతులై దైవ భక్తిగలిగి మెలగుచుండండి. ఆ దేవుడే మీయొద్దకు వచ్చును నాయనా! ఇపుడడవులకు పోరాదన్నా!'' అని లాలించి వెనుకకు మరల్చెను.

దైవయోగమునెవరెఱుఁగుదురు? ఆ వ్యక్తి రూపమున భగవంతుడే బాలురను మార్గమును పట్టించె. లేకున్న కొండలలో కండ్లు మూసి కండ్లకు బంక నంటించుకొని భగవన్నామస్మరణము జేయుచుఁ గూర్చుండవలెననియు, తమయొద్దకు భగవంతుడే వచ్చి కండ్లు విప్పవలెననియు, అంతవఱకు కూర్చున్నవారు లేవరాదనియు నిశ్చయించుకొనియుండిరట. పాపమా పట్టుపట్టిన యా పావలేమగుచుండెడివారో గదా! భగవంతుడే వారికట్లు త్రోవ చూపగా బాలురు మెల్లగా రోడ్డుపైకి వచ్చిరి.

అంతకు ముందే తమకై వెదకుచు వచ్చి విశ్రాంతికై రావి చెట్టుక్రింద కూర్చుండియుండినవారి కంటికిఁ గనబడగానే వారు పరుగెత్తుకొని వచ్చి కలసికొని కోల్పోయిన పెన్నిధినిఁ గన్నవారివలె మిక్కిలి సంతసించుచు, వారి స్థితినిఁజూచి కొంతవంతచే "ఎందరికి దుఃఖపెట్టితిరి నాయనా? ఇట్లు పోవుట మీకు తగునా?'' అని మందలించుచుఁ దోడ్కొని వచ్చుచుండగా, దారిలో మునుస్పారు గ్రామం రెడ్డిగారిచే వీరిని వెదకుటకై పంపబడిన మనుష్యులను కలసికొని అందఱును రెడ్డిగారి ఇంటికి వచ్చి చేరిరి. అచ్చట స్నానభోజనాదులు చేసిరి. ఈ బాలుర గొప్ప భావము

లకు అచటివారందఱు మిక్కిలి సంతసించిరి. అచ్చెరువునందిరి. నేటికిని ఈ రెడ్డిగారు మన శ్రీవారిని చూడగా పరమప్రీతిచే "అడవిస్వామి, అడవిస్వామి'' అని పిలుచుట గలదు. మరుదినం స్వస్థానం చేరిరి.

ఈ విధమగు భవిష్యజ్జీవిత శుభసూచకక్రియలు స్వామివారి యందు చిన్నతనముననే కాన్పించుచుండెను. అయితే మామూలుగా తమ యున్నతపాఠశాలావిద్యావిధానమున పరమశ్రద్ధతో వర్తించుచు ప్రథమశ్రేణియందుత్తీర్ణులగుచు బహుమానగ్రంథములు వడసిరి. ఇటు భగవద్భక్తి దినాదినాభివృద్ధియగుచుండ భూమిలోదాగియున్న విత్తు అదను వచ్చినప్పుడంకురించునట్లు, వీరి యాధ్యాత్మికసంస్కారబీజములంకురించుటకును సమయము వచ్చెను. అంత గొంతకాలముననే శ్రీ ఆత్మానంద సద్గురువరేణ్యుల సచ్ఛిష్యులును, ఆధ్యాత్మికతత్త్వవేత్తలును నగు డోణెకల్లు వీరయ్యస్వామి యనువారు లత్తవరమున కధ్యాపక వృత్తితో వచ్చి చేరిరి. మన చెన్నబసవస్వామికి వీరియెడ మిక్కిలి పూజ్యబుద్ధి గలిగెను. ప్రతిదినము బడినుండి వచ్చినపిదప వీరియొద్దకు వెళ్ళి భక్తివినయములతో మెలగుచుండిరి. వీరి సంస్కారమును గనుగొని వీరయ్యస్వామివారు పెక్కు ధార్మికాధ్యాత్మికాది విషయంబులను తెలుపుచు క్రమముగా వేదాంత పంచదశి, నైష్కర్మ్య సిద్ధి, ఈ గ్రంథములందలి తత్త్వములను బోధింపనారంభించి వారి చిత్తవృత్తిని ఆధ్యాత్మిక తత్త్వాభిముఖమొనర్చిరి. వీరే మన కథానాయకులకు ప్రప్రథమ మార్గదర్శకులు.

ఇట్లుండ కొద్ది రోజులలోనే రాగులపాడులోని శ్రీ ప్రణవాత్మానందాశ్రమమున శ్రీ ఆత్మానంద సద్గురు స్వాములవారి పుణ్యా

రాధన మహోత్సవమునకు ఈ వీరయ్యస్వామివారు మన చెన్న బసవస్వామినికూడ తోడ్కొని ఆశ్రమమునకు వెళ్లిరి. ఆ సంవత్సర మా సమావేశమునకు అధ్యాత్మవిద్యావాచస్పతి, వేదాంతకేసరి, పౌరాణిక గజ సింహ, కలియుగవ్యాస ఇత్యాది బిరుదాంకితులగు సదాచారసంపన్నులు శ్రీ సంగమేశ్వర శాస్త్రులవారు వచ్చియుండిరి. ఇంకను పెక్కు సాధు సత్పురుషులు వచ్చియుండిరి. నిండు సభలో శ్రీ శాస్త్రిగారు ఉపన్యసింప మొదలిడిరి. సభలోనే గూర్చుండియున్న మన చెన్నబసవస్వామి ఆ సభనుచూచి పరమా నందమందిరి. తామును ఉపన్యసింపవలెనను కుతూహలముతో నువ్విళ్ళూరుచుండిరి. ఉపన్యాసకులగు శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు వేదికపైనుండియే ఈ చెన్నబసవస్వామియొక్క ఉత్సాహచిహ్నములను కనుగొని వెంటనే "అయ్యా! ఆ అబ్బాయి ఎవరో? ఆయనయందున్న తేజస్సు ఉపన్యసింపనుప్పొంగి వచ్చుచున్నదే! ఇట్లు రానిండు. ఏ పుట్టలో ఏ పాముండునో!" యనుచు తమ ప్రవచనమునాపి ప్రియముగా పిలిచి తమ చెంత నిలబెట్టు కొని "హుఁ, ఆరంభించు నాయనా!" . అని చెప్పిరి. అపుడా బాలభానువు ముద్దులొలుకు పలుకులను కిరణములతో భక్తి పరముగా గొంతతడవుపన్యసించి సభను వెల్గింపఁజేసెను. సభికుల ముగ్ధులఁజేసెను. ఏమైననేమి? ఆ చిఱుతప్రాయమున నిండు సభయందు ధైర్యముతో స్వాములవారి చెంత నిలబడి ముద్దు మాటలాడినందున అందఱు అమందానందమందిరి. ఈ నాడే మన కథానాయకులు అచట జేరిన మహాత్ముల మనోవీధులలో స్థిరప్రతిష్ఠనందఁగల్గిరి. ఇది వీరి భావిజీవితగురుకులవాసమునకు మఱివరాని గుఱుతయ్యెను. ఆ నాటి సభలో శ్రీవారి గురుమహో

శయులగు పూజ్యపాద శ్రీ సదానందస్వాములవారును ఉత్తమాసనమునందు గూర్చుండి భావిశిష్యుఁడౌ మన చెన్నబసవస్వామి పలుకులను ముదమలర వినుచుండిరి. కార్యము పూర్ణమైన పిమ్మట ఇద్దఱును లత్తవరం వచ్చిరి.

ఇట్లు చెన్నబసవస్వామికి మోక్షేచ్ఛ అధికమగుచుండ తమ హైస్కూలు విద్యావిధానమున 9వ తరగతినుండి 10వ తరగతికి వచ్చిరి. శ్రద్ధతోనే చదువ నారంభించిరి. కాని యా సమయమున కొన్ని యిడుముల బడవలసివచ్చె. వీరికి ఆస్తిపాస్తి లేవియను లేకగాదు. కావలసినంత ధనముండియు కష్టపడవలసివచ్చెను. ఏలనన పుత్రుడు చదువుకొనుట తల్లికిష్టములేదు. చదువు చాలించి ఉన్న ఆస్తిపాస్తుల జూచుకొనుచు ఇంటియొద్దనే యుండవలెనని యామె కోరిక. అట్లు లేకున్న దబ్బీయనని యామె పట్టుపట్టెను. ఇతని తండ్రియో దైవయోగమున పిచ్చివారైరి. ఈయనకో చదువు మానుట ఇష్టము లేదు. ఇక చదువు జరుగు టెట్లు? ఏమైననగుగాక. "క్షమా వీరస్య భూషణం". అన్నట్లు ఎన్ని కష్టములకైన నోర్చి చదివియే తీరవలెనని పట్టుపట్టి భిక్షావృత్తినవలంబించి సంచరించుచు ఎట్టకేలకు గంజిగుంట శ్రీ ప్రణవానందాశ్రమమునకు వచ్చిరి. ఇచ్చట ధనికులును ధార్మికులునునగు శ్రీమాన్ వెలనాటి వెంకటప్పగారినర్థింప వచ్చియుండిరి.

ఆ సమయమునందాశ్రమమున శ్రీ సదానంద సద్గురుస్వాములవారును, ఆత్మానందస్వామివారి శిష్యులగు శ్రీ సహజానంద సాధువు మున్నగు భక్తాదులతోఁగూడి పరమగురు విరచితంబగు

కైవల్యనవనీతసారసంగ్రహ గ్రంథ ప్రసంగము జరుపుచుండిరి. ఆనాడుశ్రీ ప్రణవాత్మానందాశ్రమమునఁజూచిన ఈ బాలుని స్మృతి గురువుల హృత్ఫలకమునందు ముద్రితమైయుండెను. ఈ బాలుడు వచ్చినవెంటనే భక్తితో నమస్కరించెను. వారును సాదరమున గూర్చుండఁబెట్టి ప్రియవచనములతో "వచ్చినపని యేమి నాయనా?'' అని విచారించుచుండగానే శ్రీ వెంకటప్ప గారును అటకు వచ్చిరి. మన చెన్నబసవస్వామి తమ రాకను గూర్చి ఉన్నసంగతిని విప్పఁజెప్పిరి. అంతయు నాలకించి శ్రీ వెంకటప్పగారు "స్వామీ! ఈ కుక్షింభరమగు విద్య మీకెందు లకు? మీరు జన్మతః మహేశ్వరులు. మీరు మా స్వామి యొద్దనుండుచు బ్రహ్మవిద్యనభ్యసించండి. మీకు కావలసిన మొత్తం ఖర్చులను నేను భరింతు'' నని మిక్కిలి ప్రేమాదరణల తోఁజెప్పెను. ఈ మాటలు వినిన అక్కడివారందరు పరమ సంతుష్టులైరి. అంత శ్రీ గురుస్వామివారు కడు గారాబముతో ''స్వామీ, మీరు మంచి ముహూర్తమున వచ్చినారు. ఇది చాల మంచి యవకాశము. దీనిని బోఁగొట్టుకొనక మీ జన్మ సాఫల్యమునకు హేతువైన బ్రహ్మవిద్యను సంపాదించండి. ఇచ్చ టనే ఆశ్రమవాసముఁజేయ నిశ్చయించండి.'' అని పలికిరి. ఈ పలుకులను విన్న మన చెన్నబసవస్వామిచిత్తము పరివర్తిత మయ్యెను. ఇనుమునయస్కాంతము లాగివేయునట్లు శ్రీ గురుమహాసన్నిధి హృదయమును లాగివేసెను. అతిముదంబున వెంటనే గురుసన్నిధికి వందనములాచరించి వచ్చెదనని చెప్పి లత్తవరం వెళ్లిరి.

ఆ పరమపావనపుణ్యమూర్తియగు వెంకటప్పగారి సంకల్ప మెంత మంచిదోకదా! ఈ చెన్నబసవస్వామి జన్మధన్యతకది పునాదియయ్యెను. మరుదినం సోమవారంనాడు వైస్కూలు వెళ్ళి తమ పుస్తకములన్నియు మరొక బీద విద్యార్థికుచితముగా నిచ్చి తమకు వచ్చుచున్న విద్యార్థి వేతనమును వేఱొక బీద విద్యార్థికిండని ప్రధానోపాధ్యాయులతో సవినయముగ విన్నవించు కొనుచు "మహాశయా! నేనిక బడికిరాను. గురుకులమున తప మాచరింప వెళ్లెద" నని ధైర్యముగాబల్కిరి. అందులకా దయానిధులు, సదాచారసంపన్నులుననగు ప్రధానోపాధ్యాయులు, "ఆ, ఏమి? ఇంత చిన్నవయస్సులోనే నీకీగొప్పకోరికా! నీకి దెట్లు బొడమెనయ్యా? ఈ నీ మాటలు విన్నచో పూర్వఋషులు తలంపునకు వచ్చుచున్నారే! ఆకాలమున బ్రహ్మచారులు గురు కులమునకు వెళ్ళి వేదవిద్యనధ్యయనము జేయుచు తపస్సుచేసికొను చుండిరని పురాణములందు వినబడుచున్నది. ఇంత మంచి మాట ఈనాడు నీ నోటినుండి వెలువడుచున్నదే! శబాస్! చాల మంచిదే! కాని ఇంకను ఒక్క సంవత్సరముపాటు మెట్రిక్కు వఱకు ఇచ్చటనే చదివియుండిన నీకన్నివిధముల అవకాశముండె డిది కదా" అని చెప్పిరి. అందులకి బ్రహ్మవిద్యార్థి వారితో "అదియును చదువేగదా! ఆ బ్రహ్మవిద్య నాకు బాగుగ వచ్చు నట్లు ఆశీర్వదించండి" అను నిత్యాది వినయ సంపన్నముగు వాక్కులతో అధ్యాపకులందరికి వందనంబులాచరించి స్వగ్రామ మునకు వచ్చెను.

ఇక్కడను ఈ విషయమెల్లరికిఁ దెలియజేయగా నింటివారు సమ్మతించలేదు. తోడి మిత్రులు అడ్డుపఱచిరి, కాని యా

తీవ్రమగు గురుసన్నిధియనెడి అయస్కాంతము వీరి సంసంస్కృత చిత్తమనెడి యినుము నాకర్షించుచున్నది. ఎవరేమి చేయగలరు! వెంటనే ప్రయాణమును నిశ్చయించిరి. ఇదే శ్రీవారు తమ ఇల్లు విడచి వెడలిన సుముహూర్తము. ఆనాడు శ్రీ ప్రమాదినామ సం|| ఆషాఢ శుద్ధ ౬ స్కందషష్ఠి గురువారం, శా|| ౧౮౬౧. (తే. 22—6—1939). సాయంత్రం 4 గంటలకు శ్రీ గురుసన్నిధి గంజిగుంట శ్రీ ప్రణవానందాశ్రమము చేరుకొనిరి. ఇక నాటి మొదలు శ్రీవారి గృహనిర్వహణ భారము అనగా వృద్ధులగు అవ్వ, తాత, తల్లి, తండ్రి, మేనత్త మున్నగు వారిని పోషించు భారము సంపూర్ణముగ మామయగు బాపురమఠం కరిబసవయ్యస్వామి మెడకు బడెను. అయినను సద్గుణసంపన్నులు కాబట్టి యా వేదమూర్తులు తన కుటుంబముగానెంచి వీరినందరినిఁ జూచుకొనుచుండెను. కరుణామయుడగు భగవంతుడాయన యండనుండి మన చెన్నబసవస్వామియొక్క ఆధ్యాత్మిక చింతనకావంతయు నాటంకము కలిగించక చిరస్మరణీయమగు మహోపకారమొనర్చెను.

## ౩. గురుసాన్నిధ్యము

శ్రీ గురు సన్నిధిం జేరిన యా సాయంకాలం శ్రీ గురుస్వాములు పీఠస్థులై విచారసాగరప్రవచనము జరుపుచుండిరి. బ్రహ్మవిద్యార్థియై వచ్చుచున్న ఈ నూతన వటువును గాంచిరి. "ఓ, స్వామి వచ్చివేసెనే!" అని గురుపీఠమునుండి శబ్దము వెడలెను. అటనున్నవారందరు మిక్కిలి సంతసిల్లిరి. అంత నీ వటువు గురుసన్నిధికి తక్కినవారికి మ్రొక్కి గురునాజ్ఞతో

గూర్చుండిరి. వీరెట్లు చదువగలరో చూతమని తాము చదువుచున్న గ్రంథమును వీరిచేతికిచ్చిరి. భక్తితో గ్రంథమునందుకొని సుస్పష్టముగా శాంతముగా చదువుటను గాంచి సంతసిల్లుచు "పరవాలేదు బాగున్నది భయములేదు" అని శ్రీ గురుస్వాములవారు సాదరముగ పలికి ప్రవచనమును ముగించిరి.

ఇక నా గురుసాన్నిధ్యసుఖమునేమని వర్ణించగలను! అనేక జన్మార్జిత పుణ్యపరిపాకముచే మన చెన్నబసవస్వామికి అట్టి సుఖమబ్బె. మొట్టమొదట ఈయనకు వివేకచూడామణి శ్లోకముల పాఠము చేయించి యెత్తివ్రాయించిరి. అనుదినము నాశ్రమమున రెండుపూటల శాస్త్రశ్రవణము జరుగుచుండెను. ప్రత్యేకముగా వీరికొఱకై రాత్రి 7 గం. నుండి 8 గం. వరకు యోగవాసిష్ఠసారమగు జ్ఞానవాసిష్ఠమును చదివించుచు అనేకాధ్యాత్మిక రహస్యములను దెలుపుచుండిరి. ఇట్లీ నూతన శిష్యుడు దినదినాభివృద్ధినొందుచు ఒక్కొక్కప్పుడు హృదయముప్పొంగి భావావేశపూరితులై గురువులనడగి అనేక విషయములఁ దెలిసికొనెడివారు. ఒక రోజు ఇట్లడిగిరి.

"స్వామీ, బ్రహ్మనిష్ఠయన నంతర్ముఖులై సర్వదా యచటనే స్వాత్మానంద స్వరూప స్థితినందుటయేగదా! అట్లైన ఆ స్థితి యందే ఉండక మరల వచ్చుటెందులకు? ఈ బాహ్యాడంబర వ్యాపారములయందేల మునుగవలె? దుఃఖమెందులకనుభవించవలె?"—అని యడిగిరి.

అందులకు పరమేశ్వరస్వరూపుడగు నా గురువు మందస్మితులై యిట్లుఁబలికిరి,

"అయ్యా, నీ చిత్తము పరమపవిత్రమై లౌకిక విషయ దూర మైనదిగాన నట్టి స్వరూపనిష్ఠనే గోరుచున్నది. ఎంతెంత నీ చిత్తము బ్రహ్మ విచారణచే తదాకారమగుచుండునో అంతంతగా నాస్థితియందు అనిర్వచనీయమైన . యొక సంతృప్తిగలిగి యట నుండి మరలని స్థితి యేర్పడును. ఇది నివృత్తిసుఖమును గూర్చిన ప్రశ్న. ఇక తత్త్వజ్ఞానులన్ననో సహజస్థితి నొందియుండుటచే వారికి లౌకికపారమార్థికములనెడి భిన్నదృష్టియే లేదు. ప్రారబ్ధానుసారము వ్యవహారదశయందుండినను వారి జ్ఞానమునకు బాధలేదు. ఉన్నదొకటే పారమార్థిక సత్త. అది వారి సహజ స్థితియైయుండును. వారియందు ఒక వ్యవహారమున్నట్లు గోచరించినను అది కేవలం లోకానుగ్రహముకొఱకేయని నిశ్చయించవలెను. వారికై యేమియునుండదు. అట్లు మేమును ఆచోటనే నిలిచిపోయినచో నిపుడు నీకు తత్త్వమును తెలుపువారెవరప్పా? గాన మీబోటి ముముక్షువుల జన్మధన్యార్థమై బ్రహ్మవేత్తలు బహిర్ముఖులైయున్నను తమ బ్రహ్మదృష్టికి భయము లేదు. రెండు వస్తువులులేవు. చూపరుల చూపులే. ఈ సత్యములనెల్ల నీవు మున్ముందు నీలోనే గాంచగలవు. దానిని గాంచగల శక్తిని గురుపరమాత్మయే నీకు ప్రసాదించుగాక."—అని యిట్లు మిక్కిలి వాత్సల్యముతో బోధించిరి. మఱొకరోజు పూజ్య గురువులిట్లు గురునిష్ఠను గుఱించి చెప్పిరి,

*"స్వామీ! ఏనిష్ఠయు గురునిష్ఠకు సాటిగాదు. ఎన్ని మంత్రములున్నను గురుమంత్రమునకెద్దియు సాటిగాదు. ఎవ్వని

* ఇట శిష్యుడగు చెన్నబసవస్వామి స్వామిత్వ వంశమువారు గాన గురువుకూడ ప్రేమతో శిష్యునన్లే పిలుచుచుండిరి.

సద్గురు సన్నిధానమున



శ్రీవారు

స్మరణమాత్రమున అధికారులు సర్వానర్థములనుండి విముక్తులై పరమశుభమగు బ్రహ్మప్రాప్తిని బొంద సమర్థులగుదురో, అట్టి గురువునందు దృఢమైన భక్తిశ్రద్ధలను చక్కగా పోషించుకొన వలెను. శ్రీమన్నిజగుణ శివయోగులు కన్నడమున, "శ్రీ గురు వచనుపదేశవ నాలసిదాగళహొదు నరరిగె ముకుతి"—అని ఇట్టి ఉత్తమాధికారిని గుఱించిరే; "ఆలిసిదాగళ" అనగా విన్నతోడనే, సకృచ్ఛ్రవణమాత్రముననే జ్ఞానము గలిగి ముక్తుడగునని చెప్పె. కాన తక్కిన అన్ని పదార్థములను చూచిన దృష్టితో గురువను మహా పదార్థమును చూడరాదు. దానిని సర్వవిలక్షణమగు పరమపూజ్యదృష్టితో మెలగుచు సదా వారు చెప్పిన చొప్పున ప్రవ ర్తించుచుండవలెను. సేవచేయుచుండవలెను. అపుడు హృద యమున జ్ఞాననేత్రము పూర్ణముగా వికసించి యెల్లెడల గురు తత్త్వమునీ యాత్మ గనుగొన సమర్థమగును. అదియే భక్తి."— అని యమృతంపుఁబలుకులఁబలికిరి.

మరొకనాడు శ్రీ గురుమహాశయులనిట్లడిగిరి, "పూజ్యా, జ్ఞేయ బ్రహ్మము, ధ్యేయబ్రహ్మము అని చెప్పెదరే! అట్లయిన బ్రహ్మలు రెండుఁగానున్నవా? దీని యభిప్రాయమేమి?

గురువు:—"నాయనా! వస్తుతః బ్రహ్మలు రెండు లేవు. గుణరహితమగు ఆత్మానుభవమునకు జ్ఞేయబ్రహ్మమనియు, సగుణమునకు ధ్యేయబ్రహ్మమనియు ఒక వస్తువునకే అధికారుల తారతమ్యతనుబట్టి ఆయా ప్రసంగములందు బోధను గల్పించిరి. కాని నిజముగా వస్తువు సగుణమనియు చెప్పబడదు. నిర్గుణ మనియు చెప్పబడదు. ఈ రెండును సాపేక్షికపదములు. సర్వము

అదియే. ఒక్కప్పుడు సర్వము అనునదియు ఉపచారమే. "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అను శ్రుతివాక్యమునిదియే స్థిర పఱచుచున్నది."—అని బల్కిరి.

ఒకనాడు గురుదేవుడిట్లు భోజనము చేయు సమయమున చెప్పెను :—

"స్వామీ! మీరింకేమీ అనుకోవద్దు. బాగుగా విమర్శించి చూడండి. ఉన్నవి రెండే పదార్థములు. "దృగ్దృశ్యౌ ద్వౌపదార్థౌ తః పరస్పరవిలక్షణా। దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి సర్వవేదాంత డిండిమః।" అన్నట్లు దృశ్యమంతయు ననాత్మ మూలకి, ఆత్మ దృగ్రూపము, అదియే బ్రహ్మము. అనగా నితరాలంబనములేక అన్యకల్పనలులేక దృఢముగా సంభావించిన నిక నన్యముగపడదు. బ్రహ్మమన వేరొక వస్తువుగా నెక్కడనో లేదు. అదియే నీవు. అట్టి నిన్ను నీలోనే నీవే చూచుకొనుము"

ఇట్లు గురుసాన్నిధ్యమున వ్యాక్యార్థశ్రవణమననాదులచేతను, తపోధ్యానాదులవలనను, శ్రీ గురుసేవ, ఆశ్రమసేవచేతను, మనోవాక్కాయములు పుటపాకశోధితసువర్ణంబు పగిది పరిశుద్ధములు కాగా గురుసన్నిధియందు ఉపదేశసాహస్రి, జ్ఞానవాసిష్ఠము, విచారసాగరము, నైష్కర్మ్యసిద్ధి, పంచదశి ఈ గ్రంథముల మనసార శ్రవణంబుజేసిరి. అంతియేగాదు. తాము బడి చదువు బడయునపుడే వైదికానుష్ఠానమునకై కొంత సంస్కృత మున పరిచయము నొందియుండుటచే నత్యాదరణతో గీత ఉపనిషత్తుల పఠించుచు అర్థములనన్వయించుచు భాషాభివృద్ధి జేసికొనుచుండిరి. అఖండముగా నిట్లు మూడు సంవత్సరములు

గురుకులవాసము చేయుచు రాగా స్వామివారికి కొన్నియిడుములు వచ్చిపడెె. ఒకటి ఇంటివారిపోరు, రెండవది మలేరియా జ్వర దేవత, మూడవది "అచ్చుబాటుకాలేదు (కుదురలేదు), చాలించి యింటికి పొ" మ్మనెడి కొందఱు లౌకికుల ఛాందసపు గోడు.

ఈ రోజులలోనే ఒకనాడు శ్రీవారి జన్మస్థానమునుండి వృద్ధులగు రెడ్డిగారొకరు వచ్చి మన స్వామితో,

ఏమి స్వామీ! ఇంత వయస్సులోనే మీకప్పుడే వేదాంతమా? ఎందుకంటా? పెద్ద ఆస్తిపెట్టుకొని మీరిట్లుండుట తగదు. ఇంటికి వెళ్ళి, నాలుగెడ్లపెట్టుకొని బంగారువంటి పొలం వనీ–పాట్లూ చేయించుకొనుచు దిమ్మరంగాయుని హాయిగా ఉండకుండ ఈ వేదాంతం ఆశ్రమం ఎందులకు? మరేమంత వయస్సయి పోయిందా?" యని యన్నారు. అందులకు స్వామి,

"అయితే తాత! మరి వేదాంతం ఏవయస్సులో అలవఱచుకోవాలి?" అని యడుగగా,

"60-70 సంవత్సరాలైన పిమ్మట వేదాంతమేగాని యిదియా వయస్సు?" అని సమాధానం చెప్పారు. అది విని మనస్వామి,

"ఆలాగైతే ఆ వయస్సు మీకు వచ్చేయున్నది కదా! మీరిక్కడనే యుండండి; నేనింటికి పోయెద" నని చెప్పగానే ఆ రెడ్డిగారు

"ఇట్లా చెప్పితే అట్లాచెప్పతావ! నీతో మాటలాడలేను స్వామి!" యనుచు వెళ్ళిపోయినారు.

అయిననేమి! గురుపు గొప్పవాడు గాన అన్ని యిడుములం బాపదలచి యేకాంతవాసమగు కుందనకుర్తిలోగల శ్రీ శివలింగాశ్రమ తపోభూమికంపిరి.

# ౪. శ్రీశివలింగాశ్రమనివాసము

కుందనకుర్తిలోగల ఈ పవిత్రమగు నాశ్రమము శ్రీ శివలింగారూఢస్వామియొక్క పవిత్రపదరజోవ్యాప్తసుక్షేత్రము. తపస్సంపన్నమగుస్థానము. ఇది పెద్దగిరియు కాదు. గిరి కాకపోలేదు. పెద్ద యడవియుకాదు. అడవి కాకను పోలేదు. ఊరికి దూరముగను లేదు. దగ్గఱగనులేదు. ఇందు తపస్సునకనుకూలమగు మంచి గుహయొకటి కలదు. ఇట్లు సర్వగుణాన్వితమై సర్వవిధముల సాధకుల సాధనానుష్ఠానములకనుకూలమై పవిత్రవాతావరణముతో కూడియున్నది ఈ యాశ్రమము. ఇచ్చట శివలింగారూఢస్వాములవారి శిష్యులగు శ్రీ శివానందస్వామివారనువారుండురు. ఈ గ్రామమున శ్రీ సదానంద సద్గురుస్వాములవారి శిష్యులనేకులు గలరు. వీరి ప్రార్థనల మన్నించియే శ్రీ గురుస్వాములవారు మన చెన్నబసవస్వామిని కుందనకుర్తికి పంపిరి. అయితే పంపునపుడు ఈ కొన్ని హితవములఁ బల్కిరి :—

"స్వామీ! ఇక మీదట గురుసేవయననెట్టిదో చెప్పినట్లు నడచుకొనుచు సదాచారపరాయణులై యనుష్ఠించుచు నియమముగా శాస్త్రశ్రవణముల జరుపుచుండవలెను. ఎవరేని మహాత్ములు వచ్చినచో వారిని సాదరముగా నాహ్వానించి పూజ్యబుద్ధితో వారిద్వారా విషయములను గ్రహించవలెను. జీవితపరమలక్ష్యమగు ఆత్మశాంతిని పడయవలెను. హంసోపాసనను విడువకూడదు. అదియే మోక్షయసుఖమొసంగును" అని ప్రబోధఁజేసి ఆశీర్వదించి వచ్చిన భక్తులతోడ కుందనకుర్తికి పంపించిరి.

ఈ ఏకాంతస్థానమున స్వామి యథేచ్ఛగా తపోధ్యానాదులు సలుపుకొనుచు రెండు పూటలు వేదాంతవిచారణ గావించుచు

జ్ఞానవాసిష్మము, విచారసాగరము, గీతాభాష్యములను ఇటనున్న రెండు సంవత్సరములలో ప్రవచించిరి. అపుడపుడు అఖండభగవన్నామ స్మరణ, భజనలు చేయించుచు ఉత్తమ భక్తబృందముతో సన్నియమవ్రతంబులనేకములనాచరించిరి. ఆ యానందదినములు మరువరానివి. అప్పటి ఒక ప్రసంగసారమునిట తెల్పుచున్నాను:—

"పరాత్పరా! ప్రభో! గురుదేవా! నీ వొకప్పుడుత్తమపండితునివలెను మరొకప్పుడు జడునివలెను, ఒక్కతఱి సమాధినిష్ఠాగరిష్ఠుడవయ్యు మహావ్యవహారిగను, మహారాజుకంటె గొప్ప సుఖముననుభవించుచుండియు భిక్షుకుడుగను, పరమసాత్వికుడవయ్యు మహారాజసిగను, చివఱకు మహాతమమున సర్వరూపముల నీవై తాండవించువేళ ఆ ఈ నీ ప్రచండప్రకృతి బాహ్యరూపముల గని తత్సత్యమును గనుగొనలేక మోసపోయి అహంకారకామాదిశత్రువర్గమునఁ జిక్కి యనర్థముల పాలు గాకుండ కుదృష్టిని బాపి యాత్మారాముడవగు నిన్ను నీ స్వరూపమును జూచి సమాధానము నొంది శాంతించు పవిత్రదృష్టిని, లోఁజూపును మాకు ప్రసాదించు తండ్రీ! అన్ని రూపములు నీవేకదా! నీకన్యము వేఱొండు లేనపుడు మమ్ము నీకంటె నన్యులఁగా నెందుకు జేసెదవు? అట్లుగాక నిన్ను జూచు కన్నొనసగి నన్ను నిన్నుగాఁ జేసికొనుటకై నీయందవిచ్యుత భక్తిప్రవత్తులు గలిగి ప్రవర్తించునట్లు జేయుము.

"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ॥
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥
తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

(గీత. అ-10, శ్లో. 10-11)

అనగా నిన్నేనమ్మి సతతము నిన్నే భజించు భక్తులకు దయ దలచి నిన్ను బొందదగిన బుద్ధియోగమునననుగ్రహించి యజ్ఞాన జన్యమైన చీకటిని జ్ఞానమనెడి దీపముచే నశింపఁజేయుచు నీయందు ప్రబోధమొందఁజేసికొందు''నని నీ శ్రీముఖమునుండియే బయల్వెడలెను గదా! మమ్ము గాచుమయ్యా! మా భక్తి విశ్వాసములలో నెట్టి లోపమున్నను సంస్కరింపుము, శిక్షింపుము, చేయూత నొసంగుము. ఓం''

ఈ రూపమగు ప్రార్థనను శ్రీవారప్పుడప్పుడు శ్రవణసమయమున భావావేశముతోఁ జెప్పుచుండెడివారు.

ప్ర:—పూజ్యస్వామీ! "క్షురస్య ధారా నిశితా దురత్యయా। దుర్గం పథస్తత్కవయో వదన్తి"—అని శ్రుతి చెప్పుచున్నదే! అట్లయిన మోక్షమార్గమంతకష్టమైనదా?

ఉ:—అట్లేమియు లేదు. శ్రుతిమాత వస్తువుయొక్క యపూర్వతను దెల్పుటకై యట్లు భయానకముగా శ్రద్ధోత్పాదనకై పల్కినది. వస్తుతః అట్లు లేదు. నిజముగు నుత్తమశ్రద్ధచే తత్త్వమును గనుగొన్నచో మీద జెప్పినంత కష్టములేకయే ముక్తి లభించును. అది దూరమును గాదు. సమీపమును గాదు. నీవే అయియున్నావు. నోటియందు మృదువైన హల్వానుంచినచో మ్రింగుటెంతసులభమో ఇయ్యదంతకంటెను సులభము. స్వసంవేద్యము, పరమశాంతము, జ్ఞానస్వరూపము. ఓం.

ఈ గ్రామమున శ్రీ సదానంద సద్గురుస్వాములవారి శిష్యులలో నిద్దఱు బ్రహ్మచారులు పేర్కొనదగినవారు. ఒకరు శివలింగప్ప బ్రహ్మచారిగారు. వీరి విషయమై శ్రీవారి ముఖారవిందమునుండియే వినవలెను. వీరిని ఆంజనేయులు ఆదర్శభక్తుడు అని

పిల్చుచుండిరి. ఈ మాట అతిశయోక్తి కానేరదు. సర్వథా యోగ్యము. ఆంజనేయుఁడు శ్రీరామకార్యము నెట్లు భక్తిప్రపత్తులతోఁ జేయు చుండెనో యట్లే త్రికరణశుద్ధితో గురుకార్యమును జేయుచున్న యాజన్మబ్రహ్మచారులు వీరు. ఇక రెండవవారు నల్లనయ్యబ్రహ్మ చారిగారు. వీరినామముచేతనే నామిలక్షణము లక్షితమగుచున్నది. అమాయకమగు పరమపవిత్రసాత్వికవృత్తి. "బొల్లివెట్టమీదుండే ఓ నల్లనయ్యా ! నీ దోశిళ్ళంబలి నీవు దీసుకపో" యన్న భారతీయ ముగ్ధ భక్తుని వాక్కుభంగి భగవదాయత్తవృత్తిగల బాలబ్రహ్మ చారి. స్వామివారి సేవల గావించుచు అధిక కాలమాశ్రమమున వసించువారు. వీరిద్దరే కాక యిట్టి సహృదయులగు గృహస్థశిష్యు లెందరోగలరు గాని యెక్కువ అవకాశముగలవారు వీరిద్దఱే. తక్కినవారు ఆయా నియమిత కాలములయందు వచ్చుట పోవుట గలదు.

ఇక శ్రీవారికి ప్రతిదినము శుచిర్భూతులై భక్తిపూర్వకముగ వే॥ పంపయ్యస్వామి, శ్రీ చాబాల హనుమప్ప వీరి పుత్రులు భిక్షవెట్టి పోవుచుండిరి. నేటికిని స్వామివారికి వీరి గృహములనుండియే ప్రసాదమంపబడుచుండును.

"తస్మాద్బ్రహ్మవిదే దేయం......" "కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం బ్రహ్మజ్ఞానేన జీర్యతే। స నిస్తరతి దాతారం దశపూర్వాన్ దశాపరాన్"

అన్నట్లు ఏ పుణ్యాత్ములకిచ్చిన యన్నోదకములు వేరు శక్తులుగ పరిణమింపక, లౌకికాగ్నిచే జీర్ణమై బ్రహ్మతత్త్వము నెఱుంగఁదగిన పరమసాత్వికబుద్ధిగ పరిణమించునో అట్టి తపోవంతులైన సత్పాత్ర యందు భిక్షయొసంగిన యా వంశీయులెంతటి పుణ్యాత్ములో కదా ! వారి తరతరములవారును ధన్యులని ప్రమాణములున్నవి.

"యతిర్యస్య గృహే భుంక్తే తస్య భుంక్తే హరిఃస్వయం ।
హరిర్యస్య గృహే భుంక్తే తస్యభుంక్తే జగత్త్రయం ॥
శివయోగిన సంతృప్తో తృప్తోభవతి శంకర॥
తత్తృప్త్వా తన్మయం విశ్వాం తృప్తమేవ చరాచరం ॥"

అనునట్లు మా ఈ స్వామికి భిక్షపెట్టిన యా సద్గృహస్థులేమి నోము నోచియుండిరోగదా! వీరి జన్మ ధన్యము. ఉత్తమపుణ్యావంతము. ఇట్లు అన్నివిధముల యోగ్యమైన ఈ స్థలమందున నుత్తమభక్తులమధ్య పరమసుఖంబుండిరి.

## ౫. అరుణాచలరమణ దర్శనము

శ్రీవారికి చాలకాలముగ భగవాన్ శ్రీ రమణమహర్షులను దర్శించి వారితో సంభాషించి సేవాభాగ్యము నందుచు శ్రీవారి కృపకు పాత్రులు కావలెననెడి తీవ్రేచ్ఛయుండెను. దానికి తోడుగా నాశ్రమ ధర్మకర్తలగు శ్రీమాన్ జి. శివప్పయ్య, సుబ్బయ్య, తిమ్మరాయప్ప గార్లకును నిట్టి సత్సంకల్పమే యుదయింప వారందరితో శ్రీవారు ప్రయాణమై ఎప్పుడెప్పుడు భగవానుల దర్శనస్పర్శనలు చేయుదునా యను తీవ్రేచ్ఛతో వెళ్ళి నేరుగా మహర్షుల పాదములను తాకి నమస్కరించిరి. మామూలుగా మహర్షుల పాదముల నెవరి చేతను తాకనీయరు. కాని మన చెన్నబసవస్వామివారి కట్టి యాటంకములు లేకపోయెను. మరునాడుదయమున మహర్షి సన్నిధిని మౌనసభాసాగరమున వినమ్రులై తామొక బిందువుగా నందుగూర్చుండి రమణుల వీక్షించుచు కొంతసేపటికి పైకిలేచి దండవత్ప్రణామములాచరించి సమీపించి యిట్లు ప్రశ్నించిరి.

"భగవాన్! ఆత్మ సచ్చిదానంద స్వరూపుడందురే! అందులో

సత్తుచిత్తులుమాత్రము గోచరించుచున్నవి గాని యానందమెల్ల కాలము భానము గాదుగదా! ఇందులకు కారణమేమి? అనుగ్ర హింపఁబ్రార్థన." యని యడుగగా చల్లనిచూపులుగల యా మహర్షి పుంగవులిట్లుఁబల్కిరి :—

"ఆఁ! సత్తుచిత్తులకు వేరుగా ఆనందమొకటున్నదా? లేదే! సర్వసంకల్పముల సంపూర్ణనాశనమే సర్వదా ఆనందానుభవము. అది సత్తుచిత్తులకు వేరుగా లేదు. ఆ చోట నిలిచి చూడుము. నీ స్వరూపము సదానందమే"—అను నమృతంపుఁబలుకుల నుప దేశించిరి. ఆ పరావాణిని విని భృంగము తామరపూవు నాశ్ర యించి యందలి మధువును గ్రోలుచు మైమఱచునట్లు మన చెన్నబసవస్వామి చిత్తభృంగము రమణ ముఖారవిందమునుండి బయలుదేరిన యుపదేశ మకరందమును గ్రోలుచు అనుసంధానము జేయుచు తదాకారమయ్యెను. మరల సాష్టాంగ వందనములాచ రించి మహర్షులతో భాషణ భాగ్యమునబ్బెననియు, ధన్యుడ ధన్యుడ ననుకొనుచు స్వస్థానమున గూర్చుండిరి.

ఆనాడచ్చటనేయుండి మరుదినం ప్రయాణమై శ్రీ అరుణాచలే శ్వరదేవాలయము మున్నగు చూడవలసిన స్థలముల జూచి యట నుండి తిరుపతి వ్యాసాశ్రమం కాళహస్తి క్షేత్రములను సందర్శించి స్వర్ణముఖియందు స్నానమొనర్చి బయలుదేరి నేరుగా గుడివాడ శ్రీ ప్రణవాశ్రమమునకు వచ్చిరి. అచ్చట శ్రీ శంకరజయంతి మహోత్సవము జరుగుచుండెను. ఆశ్రమాధిపతులును, బ్రహ్మ జ్ఞానసంపన్నులును, అద్వైతమతస్థాపనయం దగ్రగణ్యులును, త్యాగవీరులును, దయాస్వరూపులునునగు సాధు శ్రీశ్రీశ్రీ ప్రణవా నంద స్వాములవారిని దర్శించి యేడురోజులు నచ్చటనేయుండుచు,

సప్తాహమునకు విచ్చేసియున్న సాధువులు పండితులు మున్నగు వారి బోధలవిని శ్రీ శంకరప్రసాదమును స్వీకరించి నేరుగా శివ లింగాశ్రమము జేరిరి.

భగవాన్ శ్రీ రమణమహర్షి దర్శనానంతరం మనస్వామివారి జీవితవిధానము బొత్తిగా మారిపోయెను. తీవ్రవైరాగ్యప్రపూర్ణ మాయెను. ఆహారము పరమసాత్వికమయ్యెను, ఆ దినమునుం డియే సంపూర్ణముగా కారము పులుసు మానివేసిరి. రాతియు ప్పునుమాత్రము కొద్దిగా వాడుచుందురు. చప్పని పప్పుకట్టు అన్నము వీరి యనుదినాహారము. నాటి యా యలవాటు నేడు సహజమైయున్నది. ఇక దేహబలమన్ననో "బలంబలవతాం చాహం కామరాగవివర్జితం" అన్నట్టు కామరాగములచ్చట వసిం చుటకు తావులేక యెటకో పరుగెత్తుకొనిపోయెను. కాన కేవలం ఆధ్యాత్మిక విషయావలంబనమునకు మాత్రము వలసిన పవిత్ర సాత్వికమగు నోజశ్శక్తి యుటనున్నది. ఇట్టి శరీరేంద్రియసంపత్తి మన స్వామిది.

## ౬. నంద్యాల–త్యాగకుటీరస్థాపనము

శ్రీ శివలింగాశ్రమమున నీప్రకారము సాత్వికానుష్ఠానాధ్యయన శ్రవణమననాదులతో బ్రహ్మానందముగ దాదాపు రెండు సంవత్సర ములు ముగిసిపోయెను. పిమ్మట శ్రీ గురునానతిచొప్పున గంజి గుంటకు వచ్చి శ్రీ గురుసన్నిధిలో వాక్యార్థశ్రవణము జేయుచు కొన్ని దినములచ్చటనే వసించుచు శ్రీ సద్గురునాజ్ఞచొప్పున శ్రీ నిర్వాణాశ్రమమునకు బయలుదేరిరి. అట్లు బయలుదేరు సమయ మున గురుమూర్తి మనస్వామితో నిట్లుచెప్పిరి, "స్వామీ,

ఆత్మానుభవమున నఖండసుఖమందుటకు అతి సులభమైన యుపాయము ప్రాణమునం (అంతఃకరణమునను) సదా చూచు చుండుటయే. అట్లు చూచుచుండినచో మనస్సు ఆత్మను తెలియుటకర్హమై (సాధనమై) తత్త్వమును దెలిపి తానశించును. అపుడు నీవాత్మస్వరూపమాత్రుడవై యఖండసుఖమనుభవింతువు. ఈ నిష్మనః మరువరాదు. మరియు నంద్యాలకపుడపుడు వచ్చుచు మనసంఘమువారితో గలయుచుండుము. ఎఱ్ఱగుంట్ల శ్రీ సాధు శివారెడ్డిగారిని నంద్యాలకు పిలిపించుకొనుము. ఓం'' అని యిట్లు ఆదేశించి హితబోధలసల్పి యాశీర్వదించి పంపగా మన స్వామివారు నేరుగా శ్రీ నిర్వాణాశ్రమమునకు విచ్చేసిరి.

ఈ యాశ్రమము నంద్యాల—మహానందులకు మధ్య శ్రీశైల పర్వతప్రాంతమై యలరారు రమ్యమగు నేకాంతప్రదేశము. శ్రీ ఉమామహేశ్వర గురుపీఠపరంపరాచార్యులు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు, బ్రహ్మవిద్వరిష్ఠులునగు ౧౦౮ శ్రీశ్రీశ్రీ ప్రణవానంద సద్గురుస్వాములవారిచే స్థాపింపబడినది. ఇచటనే ఈ మహనీయుల సమాధియున్నది. వీరే మన శ్రీవారికి పరమగురువులు. తపోధనులు. ఇట్టి పరమపూజ్యంబగు స్థానమును జేరుటచే పరమసంతోషమున తాపసారణ్యమగు నయ్యాశ్రమమున బ్రహ్మనిష్ఠతోను సద్గ్రంథవ్యాసంగములతోను చిరసుఖంబుండిరి. అప్పుడచ్చట శ్రీశాంతానందస్వామియనువారు ఆశ్రమధర్మకర్తలై యుండిరి. స్వామివారిని సర్వవిధముల ప్రేమతోఁజూచుచు సర్వవ్యవస్థలగావించి స్వామితాపసవృత్తికి తోడ్పడెరి.

కొంతకాలమునకు నంద్యాలభక్తులు మన శ్రీవారి సోదరశిష్యులును ఆప్తమిత్రులును తత్త్వవిదులును సర్వకార్యదక్షులునునగు

సాధు శ్రీ శివారెడ్డిగారు మన స్వామిని ప్రేమతో నంద్యాలకు దోడ్కొని వచ్చి కీ|| శే|| పగిడి నారాయణశ్రేష్ఠిగారి ధర్మపత్ని గుణవతియగు శ్రీమతి పగిడి శాయమ్మగారి మేడలో దింపిరి. ఆదినుండియు నేటివఱకు నీయింటియందు ఎందఱో మహాత్ములు ప్రసంగములు జరుపుచుండుట యలవాటు. శ్రీ ఉమామహేశ్వర గురుపీఠస్థులగు శ్రీ ఆత్మానందస్వాములవారి శిష్యులు ఈ దంపతులు. గాన నీ పవిత్రగృహస్థుల యింటియందు సదా వేదాంతకాలక్షేపములు జరుగుచుండును. ఇక వీరి స్వీకార పుత్రుడగు చి|| సుబ్బారావును నిట్టి సద్భావమే కలవాడై పెద్దల త్రోవనే నడచుచు నేడు బుధజనప్రీతుడైయున్నాడు.

మఱియు నింతలో శ్రీ సదానందసద్గురుస్వాములవారి శిష్యురాలగు శ్రీమతి యోగిని సుబ్బమ్మగారు శ్రీత్యాగరాజకుటీరమునొకటి తారణసంవత్సరం శ్రావణబహుళ ఏకాదశి శుభముహూర్తమున (తే. 14—8—1944 సోమవారం) మన శ్రీ స్వామివారి అమృతహస్తములతో స్థాపింపజేసిరి. ఇయ్యది శ్రీమతి యోగిని సుబ్బమ్మగారి ధ్యానానుష్ఠానములకనుకూలముగానుండునట్లు నిర్మింపబడెను. (నేడిది దివ్యభవనమై అమృత శిలావిగ్రహప్రతిష్ఠతో నలరారుచున్నది. ఆ వివరములు తరువాతి పేజీలలో చూడనగును.)

పిమ్మట మన శ్రీవారు నేరుగా గంజిగుంటకు వచ్చి సద్గురు దర్శనంబంది శ్రవణమననాదులొనర్చుచు సేవచేయుచునుండగా, గుడివాడనుండి పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ ప్రణవానందస్వాములవారిచటికి దయచేసిరి. ఈ మహనీయులు అపూర్వమగు నాధ్యాత్మిక విషయములను శ్రీ శంకరసిద్ధాంతానుసారము అద్భుతముగా హృదయంగమమగునట్లు బోధించు మహాప్రవక్తలు. తత్త్వమసి

నంద్యాలలో త్యాగకుటీరమును స్థాపించునపుడు



శ్రీవారు

త్యాదిమహావాక్యార్థమును వినవలెనన్నచో వీరి శ్రీముఖమునుం డియే వినవలెను. బోధ అఖండాద్వితీయదార్శనికదృష్టి యుతము. ఇట్టి మహాత్ములీ యాశ్రమమున 7–8 రోజులుండి మహోపన్యాస ముల గావించిరి. ఆ ప్రసంగములలోని కొన్ని మంచి మాటలను మనస్వామివారు దినచర్యయందు వ్రాసియుంచిరి. వానిలో కొన్నింటి నిట సంగ్రహముగా దెల్పుచున్నాను.

"అనేకమును ఏకముగాఁజూచుట సమదృష్టియే గాని యద్వితీయ దృష్టిగాదు. విడిచివిడువని దృష్టిచే ననుభవింపబడునది అద్వితీయదృష్టి."

"ఆత్మయందనాత్మధర్మము లారోపింపబడుటకు కారణమేదియో దానిని నివారించుటయందే వేదాంతము ప్రమాణము."

"అనుభవం అవస్థలుగానుండుటకు కారణము అనుభవము ఏకమని దెలియకపోవుటయును నజ్ఞానమే."

"ప్రత్యగాత్మదృష్టియందు జ్ఞానానుభవము. దేహాత్మదృష్టియందు కర్మాచరణము."

"సందేహము కల్గించునది వేదముకాదు. సందేహమును నివృత్తి చేయునది వేదము. దేహమును గురించిగాని లోకమును గురించి గాని సందేహమెవరికిని లేదు. వేదము కర్మజ్ఞానములని రెండు విధములుగానున్నదిగాన అందేది యాచరణీయమో యని మాత్రమే సందేహము."

"తనకంటె చిన్నవారియందు ప్రేమ, తోడివారియందు స్నేహము, పెద్దవారియెడ భక్తియు నెవరి హృదయములో స్ఫురింపదో వారు మానవులుగారు."

"ఫలన్యాసముగలవాని నుద్దేశించి కర్మయోగం, ప్రత్యగాత్మదృష్టి

గలవాని నుద్దేశించి సర్వకర్మసంన్యాసముద్వారా శాస్త్రశ్రవణమున నాదిరూపమైన జ్ఞానయోగము చెప్పబడినది.''

''వస్తులక్షణను బోధించునది తత్త్వమసి మహావాక్యము, దాటించునది ప్రణవానుసంధానము.''

"సంన్యాసమనగా రాగద్వేషజయమే. తపస్సన దేహాత్మబుద్ధి దహనమే.''

''అహంపదశోధనయనగా అహంకారమునకివ్వలయుండు దేహాదులనుండి విడివడుట, త్వంపదశోధనయనగా నహంకారమునకును సాక్షికిని గల గ్రంథివిమర్శనము.''

''చచ్చిపోదుననను దయయు (శోకము), చంపుదుననను కర్తృత్వమును (మోహము), ఈ రెండును దేహాహంబుద్ధిచేతనే కల్గినవి గాన అర్జునుని ప్రవర్తన కృష్ణునకధర్మముగాఁదోచినది.''

''ఆశ్చర్యవత్పశ్యతి—పూర్వము పరిచయము లేనిదానిని గూర్చి ఆశ్చర్యముగలుగవచ్చును. అనుభవము ఆత్మస్వభావము గనుక ఈ శ్రుతిలోఁజెప్పిన ఆశ్చర్యముగలవారెవరును ఆత్మను తెలియువారు కారు. ఆత్మనుగుఱించి చెప్పుటయే చాల అరుదు. వినుట విచారించుట అంతకంటె అరుదు. ఏల? ఆత్మ, వేదం, దైవం, గురువుల అనుగ్రహములేనిది వినిపించుట గాని వినుటగాని బహుకష్టము, దుర్లభము. ఈ యనుగ్రహములేని శాస్త్రపాఠకులకు ఆశ్చర్యము తోచవచ్చును.''

"ప్రమాతకు ప్రమేయమునను భవింపజేయునది ప్రమాణము. ప్రమేయానుభవమునందు ప్రమాణమెక్కడ నిలుచును? అట్లే వేదము ధర్మరూపమగు పరమాత్మను దెలుప ప్రమాణమైనను పరమప్రమాణమాత్మయని దెలిపి తన ప్రామాణ్యము వదలును.''

(శ్రీవారి దినచర్యనుండి కొన్నిమాత్రము గ్రహింపబడినవి)

# ౭. తపస్సుకై కాశీయాత్ర

ఇట్లు గురుసన్నిధియందు మన శ్రీవారు కొన్నిదినములుండిరి. కాని యీ సమయమున కొంతమంది గృహస్థులు చేరి ఇల్లు-వాకిలి, ఆస్తి-పాస్తి మున్నగు లౌకికవిషయములంగూర్చి చర్చించుచు శ్రీవారి చిత్తమును విషయాభిముఖమొనర్ప యత్నించుచుండిరి. ఇది చూచి యిక నిట నిలుచుట తగదని దలంచి యెవరికైనను తెలియఁజేసినచో నాటంక పఱతురని తలంచి పూజ్య సద్గురువును శ్రీప్రణవానందస్వాములవారును పరుండి విశ్రమించుచుండగా మధ్యాహ్నమున వారికి వెలుపలనుండియే వందనములాచరించి, శైవసాహిత్యమున సుప్రసిద్ధురాలై చిదాకాశస్వరూపమునందిన వీరవిరాగిణి అక్కమహాదేవివలె తీవ్రవైరాగ్యముతో కాశీయాత్రవెడలిరి. పావనగంగా తోయముల గ్రుంకులిడి తనివితీర త్రాగి విష్ణ్వాది సకల సురాసురేశ్వరార్చిత పాదారవిందు విశ్వేశు సందర్శించి, పరముముక్షులు, ఆచార్యులు తపమాచరించి ధన్యులైన యీ పుణ్యక్షేత్రమున గూర్చుండి కొంతకాలము తపమొనర్చవలెనని మనశ్రీవారికి బహుకాలముగానున్న తీవ్రేచ్ఛ నేడు కార్యరూపమైమై వైరాగ్యభానుప్రభలు విరజిమ్మ పాదచారులై పరువిడి దగ్గరనున్న బంటనహాళ్ స్టేషన్‌కు వచ్చిరి.

ఆనాడడవులయందు పాండవులు పాంచాలితోసహ భుజించి కడిగిపెట్టిన పాత్రయందు అంటుకొనియున్న యొక యాకే అక్షయ్యమై, భిక్షకై తమయొద్దకు వచ్చిన దుర్వాసును తృప్తిపఱచినట్లు మన స్వామివారి చేతిలోనున్న గీతాపొత్తపుటట్టలో నణగియున్న

అణన్నరమాత్రమే కాశి చేరువఅకును అక్షయ్యమై రక్షించెను. పావమా పావనమూర్తి యింతవఱకెప్పుడును స్వతంత్రముగా టిక్కెట్టులేక బండియెక్కినవారుగారు. అయిననేమి? వైరాగ్యాస్త్రము గలవారికి భయమెందులకు? భగవదాయత్తచిత్తులై శివ పంచాక్షరస్మరణ జేయుచు హంసనిష్ఠతో స్టేషన్‌లోగూర్చుండిరి. అంతలో రాత్రి 7 గం.కు గుంతకల్లునుండి బండివచ్చెను. వెంటనే హృత్పూర్వకముగా "ఓ కాశీ విశ్వేశ్వరా! నన్నెలీల నీ సన్నిధి జేర్చు కొందువో? నాకేమియు తెలియదు. అనాథనాథ! నీవే శరణ్య" మనుచు నానందబాష్పావృతనేత్రులై "శివాయనమః" అనుచు బండినెక్కిరి.

సత్యసంశోభితమగు పవిత్రసంకల్పము వజ్రసన్నిభముగదా! అదెట్లు రిత్తయగును? స్వామి హుబ్బళ్ళిలో దిగి పూనాబండినెక్కిరి. అటనుండి కల్యాణ్, పిమ్మట (అలహాబాద్) ప్రయాగక్షేత్రమును నాలుగు రోజులకు జేరిరి. బండ్లన్నియు స్వామివారివేనా యన్నట్లు ఎవరును టిక్కెట్టడుగలేదు.

ప్రయాగనుండి కాశీక్షేత్రము రమారమి 40 మైళ్ళదూర ముండనోపు ఆ రాత్రి బండియెక్కినచో నుదయం సోమవారం కాశీ క్షేత్రము చేరి విశ్వేశ్వరుని సందర్శించగలననియు గంగాజలముల తనివిదీర త్రాగవచ్చుననియు ఆనందతరంగములు పొంగి పొరలు చుండెను. ఇంతలో చీకటిబడెను. చివరి ప్లాట్‌ఫారంపై నిలబడిరి. బండి వచ్చెను. కాని నిలువలేదు. తటాలున కమ్మీ పట్టుకొని బండినెక్కబోయిరి. బండి పోవుచునేయున్నందున తొట్రుపాటున కమ్మీ పట్టుకొన్న చేయిజారి గుభాలన క్రిందపడిపోయిరి. బండి ముందువెళ్ళెను. వెంటనే లేచి "శివశివా! రేపు నీ సన్నిధి

జేరు యోగము లేదేమో!" యని క్రింద దృష్టి సారించి చూడ నా స్థలము వెక్కు రాళ్ళురప్పలతో నిండి ప్రమాదకరమైయుం డెను. శరణాగతభక్తరక్షాచింతామణియగు భగవంతుడా నాడు ప్రహ్లాదుని రక్షించినట్లే మన స్వామికెట్టి దెబ్బయు తగలకుండు నట్లు అఘటనఘటనాసమర్థుడగు విశ్వేశ్వరుడు రక్షించెను. బండి రెండుమూడు ఫర్లాంగుల దూరమున నిలిచిపోయెను. అర గంటవఱకు కదలలేదు. పడిపోయినందున తన్ను పట్టుకొనుటకై వచ్చుచున్నారేమోయని తలంచి ప్రక్కదాగుకొనిరి. బండి కదల కుండుటనుగని విచారింపగా బండి చెడిపోయినదని తెలిసి ధైర్య ముగా పోయి బండిలో గూర్చుండిరి. అదేమి చిత్రమో! శ్రీవారు కూర్చున్న కొంతసేపటికే బండి కదలెను. తమ సంకల్పానుసారము సోమవారమే కాశీక్షేత్రము జేరిరి. పరమపావనమగు గంగాతీర మును సమీపించుచు దూరమునుండియే దర్శించి పులకాంకితులై,

"శైలేంద్రాదవతారిణీ నిజజలే మజ్జజ్జనోత్తారిణీ ।
పారావారవిహారిణీ భవభయశ్రేణీ సముత్సారిణీ ॥
శేషాహేరనుకారిణీ హరశిరోవల్లీదలాకారిణీ ।
కాశీప్రాంతవిహారిణీ విజయతే గంగా మనోహారిణీ ॥

అను శ్రీ శంకరాచార్యవిరచిత స్తోత్రమును ముక్తకంఠమున పాడుకొనుచు తీరమును సమీపింప నది దశాశ్వమేధఘాట్ అని తెలిసె. (పూర్వము బ్రహ్మదేవుడు పది అశ్వమేధములను చేసినందున ఆ పేరు వచ్చినదందురు) గంగామాతసన్నిధికి వెళ్ళి చేతులు మోడ్చి ప్రదక్షిణమాచరించి భక్తితో పావనగంగను అనామికచే స్పృశించి కండ్లకద్దుకొని, శిరమున ప్రోక్షించుకొని తల్లి యొడిలో బిడ్డదాగుకొనునట్లు గంగామాతయొడిలో దాగిరి. అనగా గంగలో మునిగిరి, తనివిదీర జలకమాడి "తల్లీ!

నీ బిడ్డను పునీతునిగా జేసి అవిచ్యుతమగు భక్తిజ్ఞానవైరాగ్యము లిచ్చి రక్షించుమమ్మా! నినుజూడ నింతదూర మరుదెంచితిని. నిరాయాసముగా నీయొడిలోఁజేర్చుకొంటివిగదమ్మా! నా తప్పు లెన్నున్నను క్షమింపుము. "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి" అన్నట్లు "చెడ్డబిడ్డయైనా నుండవచ్చుగాని చెడ్డతల్లి మాత్ర ముండనేరదు. కాన రక్షించుము" అని యిట్లు పెక్కు దేవీస్తోత్ర ములను జెప్పుకొనుచు సంకల్పించి ఆచమించి ప్రణవముచ్చరించి గట్టెక్కిరి.

అటనుండి నేరుగా విశ్వేశ్వరుని దర్శింపగోరి "పత్రం పుష్పం ఫలం తోయం" అన్నట్టు చివరకు జలమును గొంపోవుదమన్నను పాత్రలేదాయె. అక్షయపాత్రలో మిగిలియున్న కాలణాలో చిన్న మట్టిపాత్ర నొకటి కొని గంగాతీర్థమును దెచ్చి విశ్వంభరుడగు విశ్వ నాథునకు తమ చేతులార అభిషేకముజేసి కన్నులపండువుగా స్వామిని ఘంటలకొలది చూచుచు భావావేశమున మైమరచి కొంతసేపటికి గర్భాలయమునుండి వెలుపలవచ్చిరి. ఆకలి తోచె. ఐదు రోజులుగా కడుపార ఆహారము లేదాయె. విశ్వేశ్వరుడు తప్ప మరెవరును పరిచయము లేదుగాన అతనినేనమ్మి ప్రదక్షిణ మొనర్చుచుండ గర్భాలయమునుండి సోమసూత్రముద్వారా శుద్ధ మగు అభిషేకక్షీరము వచ్చుచుండెను. మహానందమున తనివిదీర నా క్షీరమును త్రాగి కొంతక్షుద్బాధ యుపశమించగా సచేతనులై యొక మూల మహామంత్రము జపించుచు గూర్చుండిరి. కొందఱు భక్తులు కొంతసేపటికే కొన్నిపండ్లు మిఠాయీలు భక్తితో సమ ర్పించిరి. ఈ విధముగనే ఆలయమున మూడు రోజులు గడపిరి.

నాలుగవరోజు సాయంకాలము ఆత్మానందస్వాములవారననొకరు వచ్చి స్వామిని యోగక్షేమాదుల నాంగ్లభాషలో విచారించిరి. ఆంగ్లభాషలోనే ఆంధ్రదేశమనియు ఆంధ్రకర్ణాటకములు తెలుసుననియు చెప్పిరి. (హిందీభాష చక్కగా రాదు గాన కాశీ యాత్రలో ఇంగ్లీషే తోడైనది) వెంటనే కర్ణాటకభాషగల శ్రీ జంగమవాడీ మఠమునకు తెచ్చి విడిచిరి.

ఆ మఠమును జూడగా నయ్యది మనస్వామి పూర్వాశ్రమవంశ పరంపరామూలస్థానమగు శ్రీ జగద్గురు విశ్వారాధ్యజ్ఞాన సింహాసనమఠమని దెలిసి ధన్యుడనని తలంచి పరమానందమునొందిరి. అప్పుడాస్థానమున ఆచార్యులైయున్నవారు అపరబృహస్పతియనాయన నొప్పు విద్యామూర్తులు ౧౦౮ శ్రీ జగద్గురు వీరభద్రశివాచార్య మహాస్వాములవారు గురుపీఠమునధిష్ఠించియుండిరి. అట్టి జగద్గురు మహాసన్నిధిని దర్శింప సెలవుగైకొని లోపలికివెళ్ళి సింహాసనాసీనులైయున్న స్వామిని దర్శించినవెంటనే సాక్షాత్కైలాసాధిపతి యగు శ్రీ శంకరుడాయని తోచెను. ఆ దివ్యభవనము కైలాసమే యనిపించెను. వెంటనే మహాసన్నిధికి దండవత్ప్రణామములాచరించి కూర్చుండిరి. అపుడాస్వాములవారు "మీరెవరు? ఎచ్చటివారు? ఎందులకై వచ్చితిరి?" అని ప్రశ్నించిరి. అందులకు స్వామి తమ యావచ్చరిత్రను తామిచ్చటికి వచ్చిన పరమోద్దేశ్యమును భక్తివినయంబులతో విన్నవించుకొనిరి. మరియు, "ఈ బాలునిపై దయయుంచి కొన్ని నెలలిచట వసించుటకవకాశమిప్పింప బ్రార్థన"యని అడిగిరి.

ఈ మాటలు విన్న శ్రీ జగద్గురుస్వాములవారు కొంతసేపాలోచించి ప్రసన్నవదనమున సౌమ్యమగు మాటలతో, "నాయనా!

ఇంత చిన్నతనమునసే నీకింత వైరాగ్యమా? అట్లు కష్టించి నిష్ఠను సాధింపగలవా?'' యని యడిగిరి. అందులకు మన స్వామి, ''పూజ్యగురువర్యా! ఏదైనను చిన్నతనమున వినిర్మల హృదయమున హత్తుకొన్నదే కడవఱకుండగలదని తమబోటి మహనీయులు చెప్పుదురు గదా! ఇక ''ఆ నిష్ఠను కష్టించి సాధింప గలవా?'' యనుమాటకు నేను బదలుచెప్పజాలను. పూజ్యగురువుల యనుగ్రహముండినచో నది యొక అసాధ్యమైన పనిగాదని నాయంతరాత్మ పలుకుచున్నది'' అనిరి.

ఈ బాలుని ముఖమునుండి బయలుదేరు పెద్దమాటలు విని శ్రీ జగద్గురుస్వామివారు ''అట్టి సునిశ్చితమగు వృత్తియున్నచో మంచిదే. నీ దృఢనిశ్చయమే నిన్ను రక్షించు''నని పల్కి యటనున్న ఏజెంటుగారిని పిలిచి ''అయ్యా! వీరికి పైభాగమున నొక గదిని చూపించు''మనిరి. బాలునాశీర్వదించిరి. సన్నిధికి నమస్కరించి ఏజెంటుగారు చూపిన శుభ్రమగు గదిలో ప్రవేశించిరి. ఆ పవిత్రవాతావరణము, అనుకూలములు గాంచిన మన స్వామికి పట్టరాని యానందము గల్గెను. వెంటనే గంజిగుంట శ్రీ గురుసన్నిధికి తన యావచ్చరిత్రను విన్నవించుకొనుచు నొక జాబువ్రాసిరి. అటనున్న మన స్వామియొక్క నిత్యకార్యక్రమమే మన, ఉషఃకాలమున లేచి గంగానదికి వెళ్ళి స్నానమాచరించి గంగాతీరముననే కొంత జన సమ్మర్దములేని త్రిపురాఘాట్‌నందు తీరస్థమై గంగయందు వఱుపబడిన పలకలమీద గూర్చుండి ఉదయము 9-30 గంటలవఱకు మహామంత్రజపము చేయుట, పిదప విశ్వేశ్వరుని సందర్శించి 10 గంటలకు జంగమవాడి మఠమునకు వచ్చుట, అట 11 గంటలకు తక్కిన విద్యార్థులతోకూడ ప్రసాదమును భుజించుట, సాయంత్రం

3 గం. వఱకు తమ యేకాంతప్రదేశమున గ్రంథవ్యాసంగము చేయుట, 4 నుండి 5-30 గం. వఱకు గురుకులమున ప్రౌఢ విద్యార్థులును, సద్గుణవంతులునునగు పండిత సిద్ధరామశివాచార్యుల వారను బ్రహ్మచారులయొద్ద వ్యాకరణ (కౌముది) సూత్రపాఠములను జెప్పించుకొనుచు అనేకవిషయముల దెలిసికొనుచుండెడివారు. పిమ్మట 6 మొ. 9 గం. వఱకు తమ యేకాంత మందిరమున అనుష్ఠానము, తరువాత ప్రసాద స్వీకారము—ఇది మన శ్రీవారి నిత్య కార్యక్రమము.

ఇట్లు నియమముగా చక్కని శీలసంపదతో "విద్యా తపోభ్యాం పూతాత్మా" అన్నట్లు విద్యాతపస్సులను గావించుచుండిరి. ఒక నాడుదయం మామూలుగా గంగయొడ్డున నిష్ఠలోనుండిరి. అప్పుడు 7 గంటలుండవచ్చును. గంగయందు దేలియాడుచు కొన్ని మామిడి యాకులు దర్భలతో కూడిన యొక యల తమయొద్దకే వచ్చె. సహజముగా నర్థోన్మీలితనేత్రులైయుండిన స్వామి యా శబ్దమును విని కనువిప్పి చూచిరి. ఎదుట దర్భలమధ్య యొక పుస్తకముండెను. ఆ విశ్వనాథుని లీలలేమని చెప్పుదును! ఆ విశ్వంభరుడు ఆ గంగామాత ఎంత ప్రేమతోడనో భగవద్గీతా విష్ణుసహస్రనామములతో గూడిన పొత్తమును బిడ్డకనుగ్రహించిరి. పూర్ణకుంకుమాంకితము. పవిత్ర గంగాజలములచే దడిసి ముడుచుకొనియుండె. వెంటనే భక్తితో స్వీకరించి కన్నులకద్దుకొని, కారుచున్న యానందాశ్రువులచే పొత్తము మరల తడిసెను. ఆనందముచే భావసమాధినందిరి. తమ మామూలు నిష్ఠానందముగా ముగించుకొని విశ్వేశ్వరుని దర్శించి మఠమునకు వచ్చిరి.

తమ యాప్తమిత్రులగు పండిత సిద్ధరామ శివాచార్యులకు చూపగా వారు మిక్కిలి హర్షముతో, "స్వామిజీ! ఇదే మీ జీవితధ్యేయమగు సత్యసంపద. తక్కిన సంపదలు గంగలో మునుగును. ఇదియొ మునుగక మీయొద్దకే వచ్చినది చూడ, దీని యందు ప్రపంచమను (సంసారమను) సముద్రమునుండి పైకి దేల్చగల విద్య దానియందున్నది. గంగామాత యనుగ్రహించిన వరమిది. మీరు ధన్యులు" అని వాక్రుచ్చిరి. పుస్తకమును చక్కగా ఎండబెట్టిరి. అందులో నొక శ్లోకముకూడ పోలేదు. ఈ పొత్తము మన శ్రీవారియొద్ద నేటికిని సాదరమున పూజింప బడుచున్నది.

ఈ రీతిగా నియమనిష్ఠలతో తామనుకొన్నట్లు మూడు మాసములలో లక్షజపము నిర్విఘ్నముగా సాగిపోయె. మంగళమాయె. ఇంతలో శ్రీ స్వామివారి ఆప్తభక్తులును, సోదరశిష్యులుననగు శ్రీ నెరవాటి బాలసుబ్బయ్యశ్రేష్ఠి (నంద్యాల) గారినుండి "శ్రీ త్యాగరాజస్వామివారి యారాధన సమీపించుచున్నదిగాన తప్పక విచ్చేయవలె"నని వినయపూర్వకమగు ప్రార్థనతో జాబును, 40 రూపాయల మనియార్డరు వచ్చెను. (ఈ భక్తులకు మన స్వామి వారియందమిత పూజ్యబుద్ధి. పెక్కుమార్గ్ల సంచారమునకు గాని వారి నిష్ఠానియమములకేమి కావలసినంతగా ధనసహాయము చేసిన చేయుచున్న త్యాగులు)

ఇట్లు భక్తిభావముతో పంపబడిన ధనమును గైకొని అందులో 10 రూపాయలను శ్రీ జగద్గురుమహాసన్నిధిలో నర్పించుకొనిరి. కాని శ్రీ గురువులవారు వీరిసభ్యతను గాంచి "వలదు నాయనా!"

యని వారించిరి. కాని బలాత్కారముగా సన్నిధియందుంచి సాష్టాంగవందనములాచరించి 2—8—0 రూపాయలకు వేదాంతపరి భాష యనునొక గ్రంథమును కొని తక్కిన డబ్బును రైలుటి క్కెట్టుకై యుంచుకొనిరి. ఈయనివార్య ప్రయాణముచే ప్రథమ కాశీయాత్ర అప్పటికి ముగిసెననుకొనిరి. నాడు మామూలుగా నను ష్ఠానమును తీర్చుకొని విశ్వేశ్వరుని మనసార సేవించి పరమ ఋషుల శంకరాద్యాచార్యుల స్తుతించి అన్నపూర్ణా మహాప్రసాద మంది మఠమున సాయంత్రం 4 గంటలకే శ్రీ జగద్గురువుల యాశీ ర్వాదముంబడసి యచ్చటి తమ మిత్రులు మున్నగువారందరికి దెలిపి రాత్రి 7 గంటలకు బండినెక్కి ఉదయం శ్రీప్రయాగ (అల హాబాద్) క్షేత్రముంజేరిరి.

ఇచట గంగాయమునా సరస్వతీనదుల సంగమంబగు పవిత్ర తీర్థమున స్నానమాడి ధన్యులై యటనుండి 4-5 మైళ్ళ దూర మున నున్న అలహాబాద్ స్టేషన్‌కు బయలుదేరి నడచిపోవుచుండగా మధ్యమార్గమున కుంభవర్షము కురియనారంభించెను. "శ్రీరామ తీర్థస్వామివారు ఇల్లువెడలిపోవునపుడిట్టి కష్టమునే యనుభవించిరి గదా!" యని మనంబున దలపోయుచు భరింపరాని చలికిఁ జిక్కిరి. ఎన్నోతిప్పలు బడి చివరకు స్టేషన్ చేరిరి. కాని చలి బాధ ఎక్కువై వడకుచు నొక మూల గూర్చుండియుండగా స్వామివారి కా సమయమున ప్రాణములు వెడలిపోవునాయన్నట్లు తోచెనట. కాని ఆపద్బాంధవుడగు భగవంతుడార్తభక్తుల యాపద లదీర్చడా? ప్రక్కనున్న యెవరో సత్పురుషులు పెద్ద కంబళి నొకదానిని నాలుగుమడతలుగ మడచి మన స్వామిపై గప్పి,

"అబ్ గరమ్ హువాహైనా!" అనగా "ఇప్పుడు వెచ్చగా నున్నది గదా!" యని పలుకుచు దయజూపిరి. స్వామి స్వస్థముగా వెచ్చగానుండిరి. రాత్రి 9 గం. వఱకు దాని నడుగలేదు. సమయముకాగా కంబళిని ఆ సత్పురుషునికిచ్చి వందనములాచరించి బండినెక్కి సుఖముగా 4 రోజులకు నంద్యాలచేరిరి. (కంబళి సత్పురుషుని గూర్చి "ఆ సమయమున నతడు నాకు ప్రాణదాత" యని మన స్వామి సోదర శిష్యులతో చెప్పుచుందురు).

నంద్యాల త్యాగకుటీరమునకు శ్రీసదానంద సద్గురుస్వాముల వారు, శ్రీ చిదానందస్వాములవారు, శ్రీ సాధుశివారెడ్డిగారు మున్నగు ఉత్తమసాధువులు భక్తులును వచ్చియుండిరి. మన శ్రీవారు కుటీరమును ప్రవేశింపగానే సర్వులు అమందానందంబుతో నుప్పొంగిరి. గురుదర్శనంబుజేసికొని స్నానాదుల ముగించుకొని తాము తెచ్చినగంగాజలముతో శ్రీ గురుపాదాభిషేకంబు జేయ, సర్వులు తీర్థమును స్వీకరించిరి. ఆ సాయంత్రము శ్రవణమునకై శ్రోతలేతెంచిరి. ఆ నాడు శ్రీ సద్గురుస్వాములవారు మన శ్రీవారినే ప్రవచింపుమనిరి. నైష్కర్మ్యసిద్ధి మూడవ ప్రకరణమున ముప్పదియారవవాక్యమును ఆ ముందరి శ్లోకములను వ్యాఖ్యానము చేయుడని గ్రంథమును దీసియిచ్చిరి. భక్తితో దానిఁగైకొని గురుస్తోత్రముతో తత్త్వంపదముల యఖండార్థ బోధకమగు తత్త్వమసి మహావాక్యార్థ నిరూపణమును సమానాధికరణ సంబంధమున పదములకు విశేషణ విశేష్యస్వభావములతోను, లక్ష్యలక్షణభావ సంబంధములతోను సమగ్రముగా శాస్త్రోక్తముగా చక్కని యనుభవములతోను ఒక గంటసేపు శ్రోతలమనంబులు తన్మయంత్వము

నొంద నుపన్యసించిరి. అందఱు పరమసంతసమందిరి. మంగళ
ముతో నాటి కార్యక్రమము ముక్తాయమయ్యెను.

మరుదినమే శ్రీ త్యాగరాజస్వామి యారాధన. పూజ, పారా
యణము, ప్రవచనము, సంగీతము ఇత్యాది కార్యక్రమములతో
వైభవముగా జరిగి మహోత్సవము సాంగమంగళప్రదముగా
పూర్ణమాయెను.

ఇట్లుండ నొకనాడు చెన్నబసవస్వామిగారి ఆస్తిపాస్తులను
గూర్చియు, వైవాహికాదికార్యాలోచనను గూర్చియు మాటల
నందరు కలిసి మాట్లాడుకొనుచు శ్రీవారితో చెప్పనారంభించిరి.
ఆ మాటలు విని మన స్వామి వృత్తి క్షుబ్ధమై మరింత తీవ్రవిరా
గముతో నిండెను. గురుసన్నిధిగాన యూరకుండిరి. "శివశివా!
బిట్టేనెందరె బిడదీ మాయె। బిడదిద్దరె బెంబత్తితు మాయె...............
అను వీరవిరాగిణి అక్కమహాదేవి వాక్యానుసారముగా మన
శ్రీవారు "ఈ సమయమున నే ప్రమత్తుడనైనచో గొప్ప ప్రమాద
మొదవును.'' "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్'' అనుచు
నుపనిషదుపదేశమును మనసునకు దెచ్చుకొని "నేనిపుడే
యిచటినుండి బయలుదేరి ' ప్రైషోచ్చారణమంత్రపూర్వక
ముగా శిఖాయజ్ఞోపవీతముల త్యాగమొనర్చి క్రమసన్య
స్తుడనై ఈ లోకముకంటె విలక్షణుడు గావలెను. లేనిచో
వీరిపోరు వీడదు'' అని నిశ్చయించుకొనిరికాని తనకు సంన్యాసము
నొసంగు మహానుభావులెవరా? యని యాలోచించుచు వెంటనే
గుంటూరు శ్రీగురునాథాశ్రమవాసులగు పూజ్యపాద పరమహంస
శ్రీవేదానందస్వాములవారున్నారని మనసునకు వచ్చె. ఇక అల

సించుట తగదని నాటి రాత్రికే "శీఘ్రబుద్ధేః పలాయనమ్" అను జంబుక మంత్రమును పఠించుచు సిద్ధసంకల్పులై పగలంతయు కాలము గడపిరి. అందరికిని నాటిరాత్రి భిక్ష శ్రీమతి పగిడి శాయమ్మగారి యింట నేర్పాటైయుండెను. ఆదేప్రకారం రాత్రి 7 గం. కు అందరు ఆ తల్లియింటికి వెళ్ళిరి. యథావిధి పూజ చేసి వచ్చినవారందరికి భిక్షపెట్టిరి. అందరూ ఇంకనూ భోజనాదులు చేయుచుండగనే మన స్వామివారు లేచి చేయి కడుగుకొని మానసికముగానే వారికి వందనమాచరించిరి. ముందుగనే సిద్ధపఱచియున్న యొక గోనె పట్టసు మాత్రము దీసికొని, సర్వార్థసిద్ధుడు బుద్ధుడగుటకై నడురేయి అంతఃపురమును వీడి యడవులకు వెడలినట్లు మన స్వామి తురీయాశ్రమమును స్వీకరించుటకై యారాత్రి సర్వ సంగపరిత్యాగులై యడవులబడి వెడలిరి.

భోజనానంతరమచటివారందఱు వెలుపలవచ్చిచూడ మనస్వామి కనబడలేదు. కుటీరమునకు వెళ్ళియుండవచ్చుననుకొనిరి. చూడగా నటకూడ కనబడలేదు. "శివశివా! ఎంత పనియైనది? ఉదయము మనము మాట్లాడుకొన్న మాటల పరిణామమేనా? పావ మాపావనమూర్తి యీ రాత్రిసమయమున నెక్కడికి బోయెనో గదా!" యని పరిపరివిధముల పరితపించుచు వెదకుచు 4-5 రోజులవఱకుండి పిదప స్వస్థానములకు వెళ్ళిరట.

## ౮. సంన్యాసాశ్రమము

మన శ్రీవారి ఘట్టమున పెక్కు భగవన్నిదర్శనములంగనిరి. ఇందు శ్రీవారి ముఖమునుండి విన్న కొన్ని విషయములనిట

తెలియబఱచెద. ఆ రాత్రివేళ బయలువెడలిన యా మహానుభావుని వర్ణించినచో నిరాలంబుడగు సాక్షాచ్ఛంభువనవచ్చును. చేతిలో నొక కాని డబ్బైనను లేదు. కట్టుటకు వేఱు వస్త్రమైనను లేదు. పట్టుటకు భిక్షాపాత్రయైనను లేదు. ఉన్నది గోనెపట్టమాత్రమే ఆస్తి. అయితే నిట్టి వేషమున నానడురేయి నడచి యేల పోవలసి వచ్చె? నని స్వామినడుగగా వారు, "అయ్యా! పరమపూజ్యంబగు యత్యాశ్రమమును స్వీకరింపబోవునపుడు పాదచారిగనే వెడలవల యును అదికాక ఆ ఘోరారణ్య (శ్రీశైలపర్వతశ్రేణిలో) మున గానబడు వనసౌందర్యముల రూపముగానున్న ప్రకృతిమాతను గాంచుచు భగవన్నామమునుచ్చరించుచు, నిట్టి వేషమున వెడలి నచో ప్రకృతిమాత నన్నేవిధముగా చూడగలదో? ఏమి యిడుముల బెట్టునో? భగవంతుడెట్లు వానిని బాపునో? చూచెదముగాక యను పరమోత్సాహముతోనే బయలువెడలితిమి. మరియునొక వేళ నీ దేహేంద్రియములు భగవంతునికొఱకై యుపయోగము కానిచో నవి యేమైననగుగాక! యను నిశ్చయముతోనే "శివాయ నమః" యనుచు వెడలితిమి" అని వారి సద్భావమునిట్లు ఒక ప్పుడు వెలిబుచ్చిరి.

ఇట్టి నిశ్చయముతో బయలుదేరిన స్వామి యా రాత్రి కొంత దూరము నడచి యొకచోట పరుండి వేకువనే లేచి గాజులపల్లె మీదుగా రైలు పట్టాలవెంబడి నడవనారంభించి సాయంకాల మేడుగంటలకు చలమ స్టేషను చేరిరి (అరణ్యమధ్యగల చిన్న స్టేషను). అచ్చటనొక విచిత్రసంఘటన జరిగెను. గతరాత్రి ఆ స్థలమున దొంగతనమైయున్నందున స్టేషనుమాస్టరు మున్నగువారు

మిక్కిలి భ్రాంతులైయున్న పరిస్థితిలో సాయం సమయమున గోనెపట్టతో వచ్చిన స్వామిని చూచి వారు పట్టుకొని యొక గదిలో నుంచి తాళమువేసిరి. అన్నియు మంచికొఱకే గదా! అంతవఱకు చలిగాలిలో వచ్చిన శ్రీవారు మఱుమాటాడక గదిలోపల వెచ్చగా ప్రశాంతముగా భగవన్నామస్మరణ చేయుచుండిరి. రమారమి 9 గంటలుండవచ్చును. ఆ స్టేషన్‌మాష్టరు మున్నగువారు భోజనములు చేసికొని కులాసాగా నొకరితోనొకరు మాట్లాడుకొనుచు చివరి కిట్లు వారిలోనొకరు ప్రశ్నించిరి.

"అయ్యా! ధర్మము ధర్మము అందురే! ఏకపుత్రసంతానమైన పిదప భార్యను తల్లిగా జూడవలెనందురే! అట్లైనచో కుచేలున కంత బుద్ధి లేకపోయెనా? 27 గురు బిడ్డలనేల కనవలె?" అని యడుగ తక్కినవారు దానికేమేమో విపరీతముగా నర్థరహితప్రలాపముల జెప్పుకొనుచుండిరట. ఈ ప్రశ్నోత్తరములనెల్ల వెచ్చగా గదిలోనున్న మన స్వామి విని యోర్వలేక, "అయ్యలారా! ఆ ప్రశ్నకు మీరిట్టి విరుద్ధార్థములను చెప్పుకొనరాదు. ఆస్తికులైన ధార్మికబుద్ధిచే వినువానికా ధర్మరహస్యములు దెలియును. "న తు గుహ్యాః ప్రతీయన్తే పురాణేష్వల్పచేతసామ్" అన్నట్టు పురాణముల సత్యార్థములల్పబుద్ధులకు బోధపడవు"—అని లోపలినుండియే పలికిరి. ఆ మాటలు విన్నవెంటనే స్టేషనుమాస్టరుగారు గాభరాతో తలుపులుదీసి బ్యాటరీవేసిచూడగా, "అయ్యో! మనం పాపం చేసితిమిరా! ఈయనెవరో మంచి సాధువుగానున్నారు. చదువుకొన్నవారుగా గనబడుచున్నారు. నారాయణ! నారాయణ!" యనుచు

నమస్కరించిరి. మనశ్రీవారు ''శివాయనమః'' యని బదలు పల్కిరి.

పిదప శ్రీవారిని వారు వెలుపలకుఁ దోడ్కొనివచ్చి గతరాత్రి యచట జరిగిన సంగతులన్నియు దెలిపి, ''స్వామీ! ఇంతవఱకు తామెవరో తెలియక కష్టమిచ్చినందులకు క్షమింపుడు.'' అని ప్రార్థించుచు శ్రీవారి సర్వవిషయములను భక్తిశ్రద్ధలతో విచారించి తెలిసికొని, ''స్వామీ! స్నానముచేసెదరా?'' యని యడిగి చల్లని నీటిబిందెను దోడితెచ్చి చక్కెరకలిపిన చిక్కని పాలు, నాలుగు అరటిపండ్లు ముందుబెట్టిరి. ''ఇదంతయును శివలీల'' యనుచు వానిని భుజించి స్వామి హాయిగా పరుండిరి. ఉదయముననే లేచి ముందు ప్రయాణమును సాగింప బయలుదేరిరి. ఆ మాస్టర్లు, "స్వామీ! తామెచటికి వెళ్ళదలంచెదరో చెప్పండి. అంతవఱకు తమకెట్టి యడ్డులేకుండ గార్డుకు చెప్పి బండి నెక్కింతుము. సాయంత్రం 3 గంటలవఱకు నిచ్చటనే యుండవలె''నని ప్రార్థించిరి. కాని స్వామి ''నాయనలారా! భగవద్దైశ్వర్యవిస్తారమగు నీ ఘోరారణ్యమందలి ప్రకృతి సౌందర్యములగాంచుచు పాదచారిగా వెళ్ళదలచినాము. ఇంతటి సద్భావముగల మీకు భగవంతుడనంత శుభములొసంగుగాక'' యని యాశీర్వదించి ముందు వెడలిరి.

ఆ విపినవీధిని మొట్టోయని మ్రోగు భృంగముల ఝుంకారముతో కలకలలాడుచు, నానావిధ బకపికపక్షిధ్వానములతోను, దూరమునుండి వినవచ్చు మృగముల ఘర్జనలతోను నిండిన యా యరణ్యమున భగవదాయత్తచిత్తులుగాన నిర్భయులై మహామంత్రంబు బఠించుచు "నా కేల ఏ విచారము? ఏకంబగు

దానినందిన, శ్రీకంఠ ఉమా మహేశ్వరాఖ్యగురు పరంపరముండగా''— అను గురుపరంపరా స్తోత్రపాఠమునుత్కంఠమున పాడుకొనుచు నా దినమంతయు నడచి మరుదినం సాయంకాలమించుమించు 3 గంటలవఱకు నడచిరి. కాని యా సుకుమారదేహము ఇట్టియిడుములబడియుండలేదు గదా! ఆహారమా లేదు! ఇనుపకమ్ములప్రక్కన నడచినందున పాదములు వాచెను. అడుగిడుటకు కష్టమాయెం. ఇక నెనిమిది మైళ్ళు నడచిన అడవులు దాటి దిగువమెట్ట చేరవచ్చును. కాని దానికైనను శక్తి యేడ? ఇట్టియెడ ఆహారమొసగి రక్షించవలెనన్నచో నా భగవంతుడు తప్ప మరెవ్వడీ యరణ్యమధ్యమున నీయగలడు?

క. ''రక్షకులు లేనివారల, రక్షించెదననుచు చక్రి రాజై యుండగా,
రక్షింపుమనుచు నొకనరు, నక్షముఁబ్రార్థింపనేల నాత్మజ్ఞులకున్.''

అని స్వామివారు శాస్త్రప్రవచనమున నీ భాగవతపద్యమును దహరించుచుండెడివారు. దాని యర్థమునిట ననుభవముచే గనిరి. ''ఆనాడు తల్లిగర్భమున కిష్కింథమగు స్థానముననుండుతఱి నేదేవదేవుడన్నపానాదులొసగి రక్షించెనో యా పరమాత్మ వెలుపల లేడా? సర్వాంతర్యామి సర్వరక్షకుడునగు నాతని నమ్మి చెడినవారు లేరు. నమ్మక ధన్యులైనవారును లేరు.'' అని శ్రీవారిచే స్మరింపబడుచున్న యా దేవదేవుడే యా యడవిమధ్య బహు విచిత్రముగా స్వామికి ప్రసాద మొసంగి రక్షించెను.

ఎట్లనన నా యడవిలో నీరీతిగా నడవలేక నడచుచుండగా గుంతకల్లునుండి రైలువచ్చె. శబ్దము విని ప్రక్కన దూరముగానే నడచుచుండిరి. బండి ముందు వెడలిపోయె. కొంతదూరము వెళ్ళిన

పిమ్మట బండిలోనుండి యేదోయొక చిన్న మూట కిటికీగుండా పడెను. ముందుకు పోయి సమీపింపగా పొట్టపగిలిన మూట మట్టసముగా పడియున్నట్టు చూచిరి. విప్పిచూడ శుభ్రమైన కొన్ని లడ్డూముద్దలు మరికొన్ని తినుబండారములునుండెను. ఈ దృశ్యమును చూచి యానందాశ్రువులేర్పడి పార కరుణామయుని మనంబున దలంచుచు భావసమాధిని గనిరి. కొంత సేపటికి దెప్ప రిల్లి, "భో ! పరమేశా ! గురుదేవా ! వివేకానందులకు శ్రీరామ కృష్ణగురుడు పంపినట్లు నీ బిడ్డడకీరూపమున ప్రసాదమును బంపితివా తండ్రీ !

"ఓం నమః పురస్తాదథపృష్ఠతస్తే, నమోస్తుతే సర్వత ఏవ సర్వ।
అనంత వీర్యామితవిక్రమస్త్వం, సర్వం సమాప్నోషి తతోసి సర్వః॥

(గీ. 11-40)

అను గీతా శ్లోకమును పఠించుచు భగవంతుడగు గురునకు నమో వాకములర్పించి, దైవమంపిన యా మహాప్రసాదమును కడుపార భుజింప శక్తిసంపన్నులై మిగిలిన ప్రసాదమును తీసికొని ముందు నడచుచు సుఖముగ దిగువమెట్ట కెనిమిదిగంటలకు జేరుకొనిరి. అప్పటికి అడవులు ముగిసెను. తిన్నగ గ్రామగ్రామాంతరముల మీదుగా నడచి గుంటూరు శ్రీ గురునాథాశ్రమము జేరిరి.

శ్రీ గురునాథాశ్రమ క్షేత్రమున పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ వేదానంద స్వాములవారును, సమాధిభాషాపరులగు బ్రహ్మనిష్ఠ శ్రీ పూర్ణ చంద్రరావు (పూర్ణానంద) గారునుండిరి. వీరు గుడివాడ వాస్తవ్యులు. తటవర్తివారు. బ్రహ్మచర్యమునుండియే గొప్ప విరక్తులు. శ్రీశుద్ధచైతన్యస్వాములవారు శ్రీరాజగుప్తాది శిష్యులతో గుడివాడ

శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయమునందుండగా వీరు శ్రీవారి యొద్ద చక్కగా శ్రవణముచేసి బ్రహ్మనిష్ఠ సల్పుచున్న మహావిరక్తులు. వీరిని అపర—అష్టావక్రులని పిలుచుటయు కలదు. వీరిని మన శ్రీవారు గుడివాడ శ్రీప్రణవాశ్రమమున నెఱింగియుండినందున, వచ్చినవెంటనే ప్రేమాదరణలతో లోపలికి పిల్చుకొనిపోయి యుచిత సత్కారముల సల్పిరి. ఆశ్రమ పోషకులగు శ్రీమాన్ చక్కా సుబ్బారావుగారికి జాబువ్రాసి పంపిరి. వారు నిండుమోదంబున "ఈవచ్చిన నంద్యాలస్వామిని సదా ఇచటనే యుంచుకొనవలె"నని బదులు చీటివ్రాసి పంపి, సాయంత్రము వారే శ్రీవారి పాదచికిత్స కొఱకై మందును దీసికొని వచ్చి శ్రీవారిని దర్శించి వారితో నేరుగా సంభాషించి సర్వవిషయంబులు గ్రహించి సంతసమున నింటికి వెళ్ళిరి.

ఆ పవిత్రమైన యేకాంతస్థలంబున బ్రహ్మనిష్ఠతోను ఆ మహాత్ములతోడి యాత్మవిషయక చర్చలతోను పరమసుఖంబుండిరి. ఒకనాడు పూజ్య శ్రీ వేదానందస్వాములవారితో తమ రాకకు కారణములను వివరముగాఁదెలియఁబఱచిరి. దానికి పూజ్యస్వామి, "బాబూ! ఈ కాలమున సంన్యాసము బహు కష్టతరము. ఈ కలికాలమున కలిమలమునంటక గట్టెక్కుట దుస్తరము. వివేకవైరాగ్యముల దృఢతగలచోట సంన్యాసము ఫలించును, ప్రకాశించును. పైగా పూర్ణమగు నీశ్వరానుగ్రహములేనిచో దానిని రక్షించుకొన జాలడు. నిజముగా యత్యాశ్రమము లోకమునే దిద్దగల త్యాగాదర్శశీలయుతము. ప్రకృతికంటె పరము. సర్వశ్రేష్ఠము. కాంతాకనకముల పూర్తిగా జయించి పొందెడి స్వాత్మస్వారాజ్యసుఖానుభవమే

సంన్యాసము. కాని యనుష్ఠానపరుడగు ప్రయత్నశీలున కదేమి కష్టమైనది కాదు. బ్రహ్మనిష్ఠాపరులగు మీ సదిచ్ఛ యుత్తమమైనదే! మీ యాచరణ మాకు మిక్కిలి యానందదాయకము. ఆ రక్షణోపాయపటిమ మీయందుగలదనియే మా విశ్వాసము. మంచిదే. కొంతకాలమిచటనేయుండుడు." అని శెలవిచ్చిరి. అంత వారికి వందనములాచరించి తమ యేకాంతప్రదేశమునకు వచ్చిరి.

మన స్వామివారి స్థానమున భగవద్గీతా పరమార్థచంద్రిక (అనగా తొమ్మండ్రుగుర భాష్యముల యనువాదము)ను మూడు భాగములు శ్రద్ధగా నవలోకించిరి. మొత్తము పొత్తము ఆరు భాగములు. ముముక్షువులత్యావశ్యకముగా జూడదగినవి. ఇట్లు దాదాపు రెండు మాసములు గడచినవి. అంతనొకదినము శ్రీ వేదానందస్వాములవారు ఆశ్రమాధిపతులగు శ్రీ చక్కా సుబ్బారావుగారికి ఒక జాబువ్రాయుచు, "నూతనవస్త్రములు, విరజాహోమ ద్రవ్యములు, మున్నగు వస్తువులుకావలెను, మన యాశ్రమమునకు వచ్చిన నంద్యాలశ్రీవారు రేపు పూర్ణిమా—సోమవారం సంన్యాసాశ్రమం స్వీకరించెదరు" అని చీటివ్రాసి కోటయ్య అను భక్తునిద్వారా పంపుచుండ ఆయన పోవునపుడాచీటీని మన స్వామికి చూపించి వెళ్ళెను. ఆ శ్రీముఖమును చూచినది మొదలు మన స్వామి హృదయకమలము వికసించెను. "ఎప్పుడెప్పుడు పవిత్రకాషాయాంబరములు ధరింతునా? సంన్యాసినైయె లోకులనుండి యెప్పుడు దూరమౌదునా?" యని మహాతీవ్రతతో, ఆనాడు రుక్మిణీకల్యాణమున అగ్నిద్యోతనుడను పురోహితుడు వచ్చి రుక్మిణితో, "అమ్మా మెచ్చెను, వచ్చును, నిన్ను కృష్ణుడు స్వీకరించును." అని చెప్పినను ఆయమ "ఆఁ! ఎప్పుడు వచ్చును? నన్నెప్పుడు చేబ

ట్టును?". అని యఖండ వృత్తితో తహతహపడినట్లు, యావేశ ముతో పరితృప్తమానసులై "నేనఖండ సంన్యాసిని, సర్వసంగపరి త్యాగిని, ఎల్లబంధములు వీడిపోయె" ననుకొనుచు నా శుభ ముహూర్తమునకై యెదురుచూచుచుండిరి.

నాడు శ్రీతారణనామ సం॥ ఫాల్గుణ పౌర్ణమీ సోమవారం, శా॥ శకం ౧౮౬౬-(తే. 26-2-1945), కామదహన పర్వదినము, పవిత్రమగు అమరావతీక్షేత్రం, కృష్ణానదీతీరము, అట్టి స్థలమున శ్రాద్ధయుతముగ పూర్వభాగమగు క్రియాకలాపములు ముగిసెను. పిదప ప్రేషోచ్చారణ మంత్రపూర్వకముగ నాచార్యసాంప్రదాయాను సారము క్రమసంన్యాసమొసంగిరి· "శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి యతివర్య" యను యోగపట్టమును ప్రసాదించిరి. చెప్పవలసిన కర్తవ్యధర్మములను తెలియఁజేసిరి. శ్రీశంకరానందగిరిస్వామియై మంత్రపూతమగు కాషాయాంబరము ధరించినంతనే చేతనవంత మగు దివ్యతేజమొకటి పరమశాంతమైన మహోప్రభలతో దేహమా పాదమస్తకము వ్యాపించినట్లయ్యెను. తోడనే భావసమాధినందిరి· పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ వేదానందస్వాములవారికి శిరసాష్టాంగ నమ స్కారమొనర్చిరి. అందుచే శ్రీ గురునాథాశ్రమమునకు విచ్చేసిరి.

ఈ శుభవార్తను తమపూజ్యగురువరేణ్యులగు శ్రీసదానంద సద్గురుస్వాములవారికి అత్యంతభక్తిపూర్వకముగా జరిగిన శుభ సమాచారమునంతయు తెలియఁజేయుచు "ఇదంతయు తమ యనుగ్రహమే"యని విన్నవించిరి. తక్కిన యాప్తులగు సర్వుల కును తెలియఁజేసిరి. ఈ సమాచారము కొందరికమితానంద మందఁజేసెను. కొందరిని దుఃఖాబ్ధిలో ముంచివేసెను. మరికొం దరు ప్రేమానందములుప్పొంగ భక్తితో కొన్ని స్వస్తిపద్యముల

వ్రాసి పంపిరి. అట్లు వచ్చిన పద్యములలో నొకటిరెండు పద్య ముల నిట కనబఱిచెద.

పూజ్యపాద శ్రీ చిదానందస్వాములవారినుండి :- (కన్నడమున)

శా. "ఎందోగైద సుకర్మమిందు పరిపక్వావస్థెయం పొంది తా
నెందెందుం కెడదాత్మసౌఖ్య మతియొళ్ తందిత్తుదం కండుఆ
నందంపొందువ భాగ్య నిన్న హృదయక్కెదిక్కు వే శంకరా-
-నందా! ధన్యను ధన్య నీను భువియొళ్ బందావ్మె
నీంకాణ్బుదె"

కాశీక్షేత్రం పండిత సిద్ధరామ శివాచార్యులవారు :- (కన్నడము)

భా॥ ష॥ శంకరాధ్వగరమల యతిగళు।
టొంక కట్టిరువవరు హమ్మిన।
బింక మురిదలెదాడు తిర్పరు లోకసంగ్రహకె॥
మంకు మనుజరసంఖ్యశంకెగ।
ళంకురవ కిత్తొగెదు నిజసుఖ॥
మంకుడువ తత్త్వబోధక భవ్య సద్గురువు.॥
అరివు విరతి సుకర్మ భక్తియు।
కరగి మెరెదిహ మూర్తియొ? శం।
కరను తానవతరిసి బందిహనేనొ యెంబంతె॥
గురుగళెనిసి శంకరానంద!
గిరి సునామదె తోరుతిళె జన।
కరుహి తత్త్వవ ధన్యరాగిసి మెరెదరిళెయొళగె॥

అనంతర మిచటనే కొన్నిదినములుండి చివఱకు తమ తురీ యాశ్రమదాతలగు శ్రీ వేదానందస్వాములవారికి సాష్టాంగ ప్రణామము లాచరించి,

"వేదాంతే ప్రతిపాదితం సువిమలం తత్త్వం యదాత్మేతి యః
శాస్త్రాచార్యనిషేవణాదనుదినం నిశ్చిత్య యుక్త్వా స్వయం।
శిష్యాణా మపవర్గమార్గమనిశం సంబోధయన్ రాజతే
వేదానందయతీశ్వరః కరుణయా పాయాదపాయాత్స నః"॥

అని స్తోత్రముఁజేసి యాజ్ఞగైకొని బ్రహ్మనిష్ఠులగు శ్రీ పూర్ణచంద్రరావు దేవుని (పూర్ణానందులను) యాలింగన మొనర్చి కొని, ఆశ్రమ యజమానులకు దెలిపి యటనుండి బయలుదేరి గుడివాడ శ్రీ ప్రణవాశ్రమమునకు వచ్చిరి.

ఆశ్రమాధిపతులగు శ్రీప్రణవానంద స్వాములవారు ఆ సమయ మున ప్రవచనార్థమై స్థానాంతరమునకు పోయియుండిరి. కాని యంతటి గరిమగల బ్రహ్మజ్ఞులును, నైష్ఠికబ్రహ్మచారులునునగు, వారి శిష్యులు శ్రీ ఆదిరాజు సీతారామయ్యగారుండిరి. మన స్వామిని చూచినవెంటనే మహానందముతో నెదుర్కొని పరస్పర కుశలముల విచారించుకొనుచు, నూతన సంన్యాస స్వీకారమును గూర్చియు తెలిసికొనుచు ప్రేమానురాగములతో నుండిరి. మన స్వామికి వీరి పవిత్ర సాంగత్యమత్యంతతృప్తిగానుండెను. సదా ఆధ్యాత్మిక విషయములంగూర్చి చర్చించుకొనుచు గంటలకొలది మై మఱచుచుండిరి.

ఇట్టి సమయముననే వేదవానికిఁ బెన్నిధి దొరకినట్లు, సహజ శాంతస్వభావులును, బ్రహ్మవిద్యావిభూషితులును, నిజమైన పండి తులును దయాస్వరూపులును, పరమహంస పరివ్రాజకాచార్యవర్యు లును, శ్రోత్రియబ్రహ్మనిష్ఠులును నగు శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారు పుణ్యవశంబున నచ్చటకు విచ్చేసిరి. వీరి శిష్యులలో నొకరగు శ్రీపూర్ణచంద్రరావుగారును శ్రీగురునాథాశ్రమ

మరుదినమే అరుదెంచిరి. ఇకనా సమావేశము నేమని వర్ణింతును! సాక్షాత్ బ్రహ్మలోకమా! యనునట్లానందదాయకమై వెల్గొందెను. నిరంతరము వేదాంత విషయక చర్చలే.

"తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనం।
ఏక దేశపరత్వం చ బ్రహ్మాభ్యాసే విదుర్బుధాః॥"

"తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥" (గీ. 5-17)

అన్నట్లు సదా తద్భావ భావిత చిత్తములతో నిరంతరబ్రహ్మవిచారణాపరులై దేహజగంబుల మఱచిరి.

ఒక దినమున శ్రీశుద్ధచైతన్యస్వాములవారు శ్రీ శంకరవిరచితం బగు విజ్ఞాననౌకాస్తోత్రమునతివిపులముగా హృదయంగమము లగు ననుభవములతో ప్రతిపాదించిరి. ఆ విషయములు మరువరానివి. మన శ్రీవారిచ్చట గీతా పరమార్థచంద్రికా వ్యాఖ్యానమున తక్కిన మూడు భాగములను సాంతముగా పరిశీలించిరి.

## ౯. సిద్ధగీత – సద్గోష్ఠి

ఒకనాడు పూజ్యపాదులగు వీరందఱు ఆశ్రమము వెనుక తోటలో చేరిరి. శ్రీశుద్ధచైతన్యస్వాములవారిట్లనిరి :–

"స్వామీ! అందరమొకచోట నీ యుద్యానవనమున చేరియున్నాము. ఇప్పుడు మనమందరము సిద్ధులము. యోగవాసిష్ఠమున సిద్ధగీతయనియున్నది. కొందఱు సిద్ధులొక ఉద్యానవనమున చేరి మాట్లాడుకొన్న తమతమ బ్రహ్మానుభవములనే యట

సిద్ధగీతయనిరి. అట్లనే మనమును మన యనుభవములను చెప్పు కొందము గాక. ఇవియును సిద్ధగీతలే! కానిండు, మీ మీ యనుభవములను పాడండి''యనిరి. దానికందఱును "స్వామీజీ! తాము మొదట పాడినచో పిదప మేము పాడెద''మని చెప్పిరి. అప్పుడు

పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శుద్ధచైతన్య సిద్ధులు :—

''పిపీలికాది బ్రహ్మపర్యన్తాః సర్వేప్రాణినః సర్వదా నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావా ఏవ వర్తన్తే। తేషాం కల్పిత బంధప్రతీతిర్వ ర్తత ఏవ ఖలు, తన్నాశః కథం భవేత్ ?''—అనగా స్వభావముగనే సర్వప్రాణులు నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వరూపములయ్యే యున్నవి. బంధమనునది కల్పితము. అట్టి కల్పితబంధనివృత్తి యననెట్లు పొసగును? బంధము లేనేలేదు. అఖండాద్వితీయ పరవస్తువే నేను. ఆ నేనే మీరందరునగుచున్నారు.''

శ్రీ సీతారామసిద్ధులు :—

''ఆత్మనేనని చెప్పబడదు. అట్టి యనుభవమును సర్వత్ర దర్శించుటయే తత్త్వము.''

శ్రీ పూర్ణచంద్ర సిద్ధులు :—

''క్షేత్రము—క్షేత్రజ్ఞుడు అను భేదము బాధించిన అఖండ స్థితియే నేను.''

మన శంకరానందగిరి సిద్ధులు :-

"అది ఇది యనెడి బుద్ధివృత్తులు లేని యఖండసంవిత్తే నేను. ముముక్షువులభ్యాసమును విడువకుండిన ఈ తత్త్వమును సత్వరము సర్వత్రగాంతురు. ఇది గురుకృపాలబ్ధము. స్వసంవేద్యము."

ఇట్లీ నలువురు సిద్ధులు తమతమ గీతముల గానముజేసిన పిదప శ్రీ శుద్ధచైతన్యసిద్ధులు, సీతారామయ్య సిద్ధులును ఇట్లు పల్కిరి, "ఈ సిద్ధగీతాగానములలో శ్రీ శంకరానందగిరి సిద్ధుల గానము ఋషిసంప్రదాయమును పోషించు సదనుభవమైయున్నది." అని మహా సంతోషముతో మాట్లాడుకొనుచు ముగించిరి.

ఈ సుదినములలోనే పూజ్యపాద శ్రీ. శ్రీ శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు మన స్వామివారికి అష్టోత్తరశతోపనిషత్తుల మూల గ్రంథము నతిప్రేమతో ప్రసాదించిరి. ఇయ్యది నేడు మన శ్రీవారి ప్రేమాభిధానులగు నాగమహాశయులనబరగు విద్వాన్ యస్. రాజగుప్తగారి కత్యంత ప్రేమాభిమానములతో శ్రీవారిచే ననుగ్రహింపబడియున్నది. వీరు శ్రీ శుద్ధచైతన్యస్వాములవారి శిష్యులు. నైష్ఠికులగు నుత్తమగృహస్థులు. ఇట్టి సజ్జన సాంగత్యమున రెండు మాసములు రెప్పపాటులో ముగిసిపోయెను.

ఇంతలో మన శ్రీవారి పూర్వాశ్రమమందలి జనకులు పరమపదించినట్లు గుడివాడ ఆశ్రమమునకొక జాబు వచ్చెను. కాని యానాడే స్వశ్రాద్ధముబెట్టినవారేమి జేయగలరు? అయినను వైరాగ్యచక్రవర్తులగు శ్రీశంకరులంతటి మహానుభావులుకూడ

మాతృభక్తిని ప్రకటించిరిగదా ? యని మనంబున దలపోసి హృత్పూ ర్వకముగ "ఓంనమోనారాయణాయ" "ఓంనమఃశివాయ" యని శ్రద్ధాంజలి నొసంగిరి.

రెండు మూడు దినములలోనే ఆళ్ళగడ్డ పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారినుండి "శ్రీ శంకరజయంతీ మహోత్సవ మునకు తాము తప్పక దయచేయవలెను" అని మన శ్రీవారికొక జాబు వచ్చెను. అందువలన మన స్వామివారు అచటి మహాత్ము లందరి సెలవుబుచ్చుకొని పార్థివ వైశాఖశుద్ధచవితి (15-5-1945 మంగళవారం) కి ఆళ్ళగడ్డ శ్రీశంకరానందాశ్రమము జేరిరి. ఇచ్చట పూజ్యశ్రీ శంకరానందస్వాములవారితో తమ సంన్యాసాశ్ర మస్వీకారవిషయము మున్నగు యావత్కథను తెలియఁజేసిరి. వారును చాలసంతసించిరి. ఆనాడు శ్రీగురునాథాశ్రమమునకు స్వస్తివాచనములం బంపియుండిరి. పరమదయామూర్తులు, సర్వ కార్యదక్షులు, ఉత్తమప్రవక్తలు.

మరుదినమే (16-5-1945 బుధవారం) శ్రీ శంకరజయంతి మహోత్సవము. ఈ యాశ్రమమున నూతనముగా నీవత్సరమే దీనినాచరించుట. ఒక్కరోజు కార్యక్రమము మట్టసముగానుం డెను. మన స్వామివారే శ్రీ జగద్గురు శంకరాచార్యస్వామి పూజను శాస్త్రోక్తముగా జేసి సంగ్రహముగా శ్రీశంకరవిజయపురాణకాలక్షే పము గావించిరి. సాయంసమయమున శ్రోత్రియబ్రహ్మనిష్ఠు లగు హైదరాబాద్ శ్రీనివాసశాస్త్రులవారి యధ్యక్షతలో కార్యక్ర మము ప్రారంభింపఁబడెను. ఆశ్రమాధిపతులగు శ్రీ శంకరానంద

స్వాములవారి యుపన్యాసము జరిగెను. పిమ్మట అధ్యక్షోపన్యాసముతో కార్యక్రమము సమాప్తమయ్యెను. శాంతిమంగళము జరిగెను.

రెండుమూడు రోజులపిమ్మట శ్రీ శంకరానందస్వాములవారితో మనగిరిస్వాములిట్లు విన్నవించుకొనిరి, "స్వామీ! తమ యాశ్రమములలో శ్రీ గిర్యాశ్రమక్షేత్రము అత్యుత్తమమగు ఏకాంతస్థానముగా చెప్పుచుంటిరి గదా! అట్టి పవిత్రక్షేత్రమున నే గొంతకాలము వసింపగోరుచున్నాను. అది సాధ్యమా?" అని యడిగిరి. అందులకా స్వామివారు పరమప్రీతితో, "స్వామీజీ! తమబోటి యనుష్ఠానపరులగు ఆదర్శపురుషులదే ఆ యాశ్రమము. తమ కెట్టి యభ్యంతరమును లేదు. తప్పక వెళ్ళవచ్చును. ఈ విషయమున తమకు వలసిన సకల సౌకర్యములను గావించెదము" అని చెప్పుచు వెంటనే యచ్చటి తమ శిష్యులకొక జాబు వ్రాసిరి.

మరుదినమే స్వామివారి శెలవు గైకొని నేరుగా నంద్యాల శ్రీ త్యాగరాజస్వామి కుటీరమునకు వచ్చి తమ సంఘమువారినందరిని గాంచి నాటి శాస్త్రప్రవచన సమయమున తాము సన్యసించిన సంతోషవార్తను, మరి యానాడు నంద్యాల విడచి యడవులబడి పోవునపుడు దారిలోగన్న భగవల్లీలావిచిత్రములను దెలియఁజేసిరి. అది విని యచటి భక్తులందరును, "స్వామీ! తమరిట్లు సంన్యసింపవలెననియే మా కోరికయుండెను. మాకు చాల సంతసమయ్యెను." అని చెప్పుచు మరి మరి దండప్రణామము లాచరించిరి.

# ౧౦. గిరిక్షేత్రవాసము—చాతుర్మాస్య వ్రతాచరణము

పిమ్మట నంద్యాలలోని యందరి శెలవు గైకొని మన స్వామి వారు బాబాబుడన్‌గిరి ప్రాంతమునకుం ప్రయాణమై పార్థివ వైశాఖ బహుళ చవితి (31—5—1945 గురువారం)కి శ్రీదత్తాత్రేయ ఆదిపీఠమగు మొంగరేఖాగిరి (కడూరు జిల్లా బీరూరునకుం సమీపమున గలదు) శ్రీ శివానందసేవాశ్రమము జేరిరి. ఇది రమణీయంబగు ప్రకృతిసౌందర్యయుతమగు పర్వతశ్రేణి. అనేకవనస్పతులతోను, ఉన్నతవృక్షములతోను, పచ్చని బయళ్ళతోను, పెద్ద పెద్ద కాఫీతోటలతోను నానావిధమృగఖగములతో నిండి ఘోరాటవియై, మనస్సును హరింపఁజేయు ప్రకృతిసౌందర్యములతో విరాజిల్లు నీ పర్వతరాజమున ఎత్తునగల ఈ శ్రీశివానందసేవాశ్రమము కైలాసాధిపతియగు శివుడు సింహాసనమున గూర్చుండి శివసభ జరుపుచున్నాడా ఏమి? యనునట్లు గంభీరమగు శోభతో నొప్పుచుండును. ఆశ్రమమునకు క్రిందిభాగముననే పవిత్రమగు పెద్ద నెలయేటు. ప్రక్కన దత్తాత్రేయ పీఠమగు శ్రీసిద్ధేశ్వరాలయము. ఇట్టి ఉత్తమ పవిత్రవాతావరణయుతమగు నీ క్షేత్రమును గాంచి మన స్వామి మైమఱచి పరవశులైరి. పరమఋషులిట్టి స్థలములయందే నివసించుచుండిరి గదా! యని హృదయమున స్మరించి వానిని దర్శించిరి.

"వాసో గిరివరే నిత్యం గీతాధ్యయనతత్పరః ।
గంభీరాచలబుద్ధిశ్చ గిరినామాః స ఉచ్యతే ॥"

అనునట్లు తమ యాశ్రమనామమున కన్వర్థమై యొప్పుచున్నదని తలంచుకొనుచు గీతాధ్యయన తత్పరులైరి. తీవ్రమైన బ్రహ్మనిష్ఠంబూనిరి.

క్రిందిపల్లెనుండి మూడుమైళ్ళు పర్వతమెక్కి యాశ్రమమునకు చేరవలసియుండును. అచటి కాఫీతోటపు యజమానుల యిండ్లు కొన్ని యాగిరిపైననే గలవు. ఇది చిన్నిపల్లెగానుండును. ఆళ్ళగడ్డస్వాములవారి శిష్యులు పెక్కండ్రుగలరు. అందఱును ఉత్తమభక్తులు. సాధువిశ్వాసపరులు. వారిలో వేదమూర్తి బసవలింగయ్యయును సద్గృహస్థులు స్వామికి నిత్యము భిక్షనొసంగుచు పరమభక్తితో నన్నిసేవలఁ జేయుచుండిరి. తక్కిన భక్తులును పూర్ణముగా సహకరించుచుండిరి. క్రిందిపల్లెవారుకూడ భక్తితో వచ్చి స్వామిబోధల వినుచు సర్వవిధంబుల సేవజేయుచుండిరి. అనుదినమును భక్తాదులందఱు కలసి భజనపారాయణ శాస్త్రశ్రవణాదులఁజేయుచు పరమానందముగానుండిరి. ఇట్లుండ కొందఱు భక్తులు ఇట్లు కొన్ని ప్రశ్నలువేసి తమ సందేహములఁ దీర్చుకొనిరి.

ప్ర:—స్వామీ ! ఇంద్రియముల నిగ్రహించుటకై నేనెంత ప్రయత్నించినను అది సాధ్యముకాకున్నదే ! దీనికేమి చేయవలెను?

ఉ :—నేను (అహంకారము) విడిచి యిచ్చట నాయొద్ద నేయుండుము. అట్లైనచో నది సాధ్యమగును. అనగా మహాత్ముల సన్నిధిలో నున్నచో ఆ యింద్రియములుపశమించును.

ప్ర:—పూజ్యస్వామీ ! ఎట్లుండినచో నాకు శాంతి లభించును ? దానికేమి చేయవలెను ?

ఉ :—నీ గురుడు చెప్పినట్లు శ్రుతిసమ్మతంబగు మార్గములో నడచుచు ఆ త్రోవలో అటు ఇటు అగపడు విషయరూపములైన చిత్రవిచిత్రవ్యామోహపదార్థములకు లోబడక మోసబోక గురుస్మరణతో వాక్యార్థమును సదా విచారించుచుండుము. తప్పక శాంతిలభించును.

ప్ర:—దుఃఖమే లేదని చెప్పెదరే! అట్లయినచో దుఃఖమెచ్చటనుండి వచ్చినది?

ఉ :—ఆ దుఃఖమెక్కడినుండియు రాదు. విమర్శనాశక్తిలేని నీ మనోదౌర్బల్యమే దుఃఖరూపమున పరిణమించును. నిజముగా దుఃఖమునకు జగమున తావు లేదు. కశ్మలమగు మనస్సే దుఃఖరూపము. మహాత్ములను శరణంజొచ్చినచో నా కశ్మలము వీడును. దుఃఖమూ ఉండదు. నీవు సుఖస్వరూపుడవైయుందువు.

ఇట్లు మహానందముతో తపంబాచరించుచుండ కొన్ని దినంబులకు ఆళ్ళగడ్డ శ్రీ శంకరానందస్వాములవారు మన శ్రీ గిరిస్వామివారికి ప్రేమతోనొక జాబునిట్లు వ్రాసిరి :—

"స్వామీ!........బ్రహ్మమే అయ్యుండి బ్రహ్మమగుట మిక్కిలి యాశ్చర్యకరము. "విముక్తశ్చ విముచ్యతే" యన్న శ్రుతిభంగి తాము నిత్యముక్తులేయయ్యు, సదాచారవిచారములతో వర్తించుచుండు మీ యాదర్శజీవనము కడుంగడు ధన్యము, లోకకల్యాణదాయకము, మార్గదర్శకము........" ఈ మాటలను తమ సోదర శిష్యులతో నప్పుడప్పుడు ముచ్చటించుచుందురు.

ఇంతలో చాతుర్మాస్య వ్రతారంభకాలము సమీపించెను. ఈ వత్సరమునుండియే మనస్వామివారీవ్రతమును దీక్షగాబూనిరి. అన్నివిధములైన యేర్పాట్లు సిద్ధములయ్యెను. పార్థివ సంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశి (20-7-1945) శుక్రవారం బ్రహ్మాముహూర్తమున శుభసంకల్పముతో విధ్యుక్తముగా ఓంకారధ్యానముతో ప్రారంభింపబడెను. ఈ వ్రతకాలమున (నాలుగుమాసములు) సంపూర్ణమౌనము, అపక్వాహారము, నిరంతరము బ్రహ్మనిష్ఠ, ఉపనిషద్గీతాద్యవలోకనము అను నియమములతో సంయమశీలురై దీక్షను సలుపుచుండిరి. ఆ పుణ్య తపోభూమియందు క్షేత్రమహిమచే పెక్కు దైవాదేశములను మహిమలను గనిరి. పరమఋషుల సందర్శించిరి. వీనిచే తమ యాంతరంగిక సందియముల నశింపజేసికొనిరి. ఆత్మస్థైర్యముచే కొన్ని స్థిరానుభవముల బడసిరి. కష్టించి తపమాచరించిరి. లక్షగాయత్రీ మహామంత్రజపము జేసి పూర్ణాహుతి గావించిరి. మంత్రాధిదేవతను నిష్ఠయందు గనిరి. అందువలన నా స్థానమున శ్రీచక్రయంత్రరాజమును వేదోక్త విధులతో ప్రతిష్ఠింపజేసి యఖండభజన పూజాపారాయణాది విధ్యుక్త ధర్మములతో సప్తాహమ్ములు జరిపించిరి. చివరికతివైభవముగా నన్నసంతర్పణాది మహాకార్యములతో పూర్ణాహుతిగావింప జేసిరి.

అనంతరమొకప్పుడు అళ్ళగడ్డ శ్రీశంకరానందస్వాములవారచటికి వచ్చి యా వాతావరణమును గని పరమసంతోషమునొందుచు రెండు మూడు దినములుండి గీతాప్రవచనాదులు గావించి వెళ్ళిరి. తాపసవృత్తి కనుకూలమగు నా పరమశీతల వాతావరణమున శ్రీ

స్వామివారు పదునారు మాసములచట నివసించిరి. ఆ వర్షావైకాంతమగు నా సదవకాశమున శ్రీవారు భగవద్గీత, బ్రహ్మసూత్రములు, ఛాందోగ్యోపనిషత్తు, ఉపదేశసాహస్రి—ఈ యమూల్య వేదాంతగ్రంథములను చక్కఁగా పరిశీలించిరి. ఇట్టి సదవకాశమును కల్పించియిచ్చిన పూజ్య (ఆళ్ళగడ్డ) శ్రీ శంకరానందస్వాములవారికి అనంతప్రణామములని మాటిమాటికి మన శ్రీవారు తమ సోదర శిష్యులతో చెప్పచుందురు.

## ౧౧. శృంగేరి జగద్గురు పీఠదర్శనం

ఇంతలో బీరూరు R. M. S. ఆఫీసరుగారగు భక్తులు శ్రీ వెంకటస్వామినాయుడుగారు వచ్చి శృంగేరి జగద్గురుస్వాముల వారిని దర్శించివచ్చెదమని విన్నవించి మనస్వామివారిని బీరూరునకు దోడ్కొనివచ్చి తమ యింట భిక్షనొసంగి యొక దినమచటనే యుంచుకొని గిరిభక్తులు శ్రీ బసవలింగయ్యమున్నగువారితో కలసి శృంగేరి వెళ్ళిరి.

ఇయ్యది జగద్గురు శ్రీశంకరాచార్యస్వాములవారి చతురామ్నాయపీఠములలో శారదాపీఠమని ప్రసిద్ధిగాంచినదీ శృంగేరి మహాక్షేత్రము. అరణ్యములమధ్య తుంగానదీప్రవాహ పరిసర పుణ్యభూమి. "తుంగాపానం గంగా స్నానం" అనియు ప్రసిద్ధి. ఈ మహాస్థలము విభాండకమునికుదయించిన ఋష్యశృంగుడు మల్లికార్జునమహాలింగమునం దైక్యమందిన పుణ్యక్షేత్రమని పురాణ ప్రసిద్ధి. ఈ పవిత్రస్థలమున పరస్పరవిరుద్ధములగు (పాము-

కప్పు) ప్రాణులుకూడ తమ వైరభావమును వీడి పరస్పరప్రేమ సౌహార్ద్రములతో మెలగుచుండుటను తిలకించియే ఇయ్యది పుణ్య క్షేత్రమని నిశ్చయించి ఆదిశంకరులీచోట ప్రసిద్ధమగు నామ్నాయ (శారదా) పీఠమును స్థాపించిరని స్థలపురాణము. ఇట్టి యాచా ర్యపదస్పందిత పావనక్షేత్రమును జూచి పరమానందభరితులై మన శ్రీవారు తుంగా జలముల జలకమాడి శ్రీ శారదాదేవి సన్నిధికి వచ్చి పరమభక్తితో వాగ్దేవిని పూజించి సేవించి యుపనిషత్సూక్తు లతో స్తుతించి ప్రసాదమును బడసి ధన్యులైరి.

మరుసటి దినము సాయంసమయమున నదికావలియొడ్డున నుండు మఠమునకు (నరసింహవనమునకు) పోయిరి. అచ్చట సాక్షాత్ పరమేశ్వరుడా యనునట్లు దివ్యతేజస్సుతో వెల్గుచున్న ౧౦౮ శ్రీ శ్రీ శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీ మహాస్వాములవార ప్పుడు మౌనవ్రతముతో నున్నందున దూరమునుండియే సందర్శించి యనంతప్రణామము లాచరించుకొనిరి. పిమ్మట ఉపస్వాములవా రగు జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారిని సంద ర్శించిరి. వారును మన స్వామినిగూర్చి "ఎక్కడివారు? ఎవరు?" అను మున్నగు ప్రశ్నలడిగి అన్నివిషయములఁ దెలిసి కొని ప్రశాంతముగా తమ యాధికారికవాణితో కొన్ని మంచిమాటల జెప్పుచు చివరికి విధముగా మహోపదేశముగావించిరి.

"లోకమున నేమి జేసినను, ఎంతటి ఘనకార్యముల కొనసాగిం చినను, ఇంకను కొంచెము మిగిలియే యుండును. అది పరిపూర్ణ ముగాదు. అనంతరం, ఆ పిదప–యును నాకాంక్షలచే సర్వదా అపరిపూర్ణమే అయ్యుండును. కాని మానవుడెపుడు ఆత్మసాక్షా

త్కారమున నఖండాద్వితీయ బ్రహ్మానుభవమును పొందునో యుపు డిక చేయవలసినది గాని పొందవలసినది గాని మిగిలియుండదు. సర్వశ్రుతుల తాత్పర్యమునిదియే. కనుకనే భగవత్పాదాచార్యుల వారు గుర్వష్టకమున "తతః కిం తతః కిం" అని చెప్పిరి. అనగా నద్వితీయ బ్రహ్మానుభవసాక్షాత్కారానంతరము తతఃకిం అనునది ఆగిపోవును. అది నిరతిశయము, వ్యాపకము, పరిపూర్ణము. ఇట్టి బ్రహ్మాత్మనాసంస్థితియే జీవన పరమలాభము. తదితరము రజ్జుసర్పమువంటిది." అని యిట్లు పరమోత్తమతత్త్వమును గురుకరుణచే దెలిపి శ్రీ శారదాశంకర ప్రసాదములొసంగిరి.

మరియొక దినమచటనేయుండి చూడవలసిన స్థానములన్నియు చూచి నాలుగవ దినమచటినుండి బయలుదేరి బీరూరునకు రాగా అచ్చట వెంకటస్వామి మున్నగువారు శ్రీ స్వామివారి సెలవు పుచుకొనిరి. పూజ్యస్వామివారు మాత్రం నేరుగా శ్రీ సిద్ధగంగా శివ గంగా క్షేత్రముల సందర్శించి చివరకు గురుస్థానమగు గంజిగుంటకు వచ్చిరి. గురుమహాసన్నిధిలో సర్వవిషయముల సవినయముగా విన్నవించుకొనిరి. శ్రీ గురుమూర్తి సంతసిల్లుచు శిష్యు నిట్లు ప్రశ్నించిరి.

ప్ర:—"స్వామీ! నీవు జన్మతః నిత్యసంన్యాసివైయుంటివే. ఇక మఱల యీ సంన్యాసమంటె అర్థమేమి?

ఉ:—పూజ్యమహాశయా! గురుదేవా! వస్తుతః నేను సంన్యాసియే యైయుండినను నా గురుతులు వెలుపల కనబడుచుండ లేదు. గాన నీ లోకులనబడు కాకులు మఱల నన్నెప్పుడు తాకకుండుటకై యీ వేషమనబడు కంచెకోటను కట్టితిని.

నిజముగా కాషాయాంబరములు త్యాగాదర్శచిహ్నములు గదా! ఈ త్యాగులయొద్ద భోగులు మరెప్పుడు తమ భోగ లాలస విషయములగుఱించి మాట్లాడరు కదా! అట్లు న్నచో ఆజన్మసంన్యాసులగు వీరికా విషయవాసనలెక్కడివి కదా! వీరి చిత్తమున శుద్ధత్వమధికమగుటచే సత్వరముగా జ్ఞానదార్ఢ్యమేర్పడును గదా! ఇక నా మీదట అవి సజీవ ములుగా వీరి దృష్టికగపడవు. జీవచ్ఛవములై భాసిల్లును. ఇట్టి సాధనోపాయముగా లోకులకంటె విలక్షణమై సర్వవిల క్షణంబగు సత్యాత్మానుభవమునకుపాంగముగా జీవితప్రతి బంధముల దరిజేరనీయక దూరీకరించు గురుతుగా నీ వేష మును దాల్చితిని.

"జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి" గీ. 5-3.

యన్నట్లు ఫలసంన్యాసమునుద్దేశించి తాము సెలవిచ్చిన మాట పరమసత్యంబే అయినను "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అను శ్రుతి ప్రత్యగాత్మదృష్టితో వర్తించు నధికారికి శ్రవణమననాదులద్వారా బ్రహ్మాత్మనా సంస్థితికొఱకు కర్మసంన్యాసమును విహితమే గదా! సంస్కారమునుబట్టి అంగీకరింపబడుచుండుననియు సన్నిధివారు చెప్పుచున్న సంగతియే కదా! కాన తమ యనుగ్రహమే నా సంన్యా సము. నిజముగా సంన్యాసమనునది యిచ్చునదియు పుచ్చుకొను

నదియు కాదు. తమ యనుగ్రహమున స్వయంముగా గల్గ నదియే. అయినను క్రమసంన్యాసము లోకాదర్శము సంప్ర దాయసిద్ధము'' అని ఈ విధముగా వినయముతో విన్నవించు కొనిరి. ఈ సశాస్త్రీయమగు సమాధానమును విని శ్రీ సద్గురు మూర్తి యమందానందసందోహంబు నందిరి.

## ౧౨. విచిత్రఘటన

ఇట్లు గురుసన్నిధానమున కొన్నిదినములున్న పిదప వారి నెలవంది కుందనకుర్తి శ్రీశివలింగాశ్రమమునకు వచ్చిరి. శ్రీవారి రాక యచటివారికందరికి మహానందమును గల్గఁజేసినది. అంత మఱికిగ్రామమున వర్షములేక ప్రజలు బాల బాధపడుచుండిరి. శ్రీ స్వామివారాయూరికి వచ్చినరోజే కొంతసేపటికే కుంభవర్షము కురిసి వాతావరణము చల్లబడి యందరికిని శాంతి ఆనందముల గల్గజేసెను. కాని యా జనులందఱును ''మనస్వామివారు మన గ్రామమునకు వచ్చినందుననే వర్షముపచ్చెను. సాక్షాత్ శృంగి మహాముని వచ్చినట్లాయెను.—'' అని పొగడదొడగిరి. కాని పెద్ద వారు లౌకికుల యిట్టి నిందాస్తుతులకెన్నటికి నుబ్బి తబ్బిబ్బలు కారుగదా! ఆ మాటలు విని మన స్వామి, ''అయ్యా! అట్లన రాదు. వర్షము వచ్చుట పోవుట భగవంతుని యిచ్ఛయేగాని మాన వులందులకు గారణులు గారు. మీరీలాంటికల్పనలు చేయరాదు.

''ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిం।
వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి॥''

అను వచనానుసారము ఉత్పత్తిప్రళయములను, భూతముల

రాకపోకలను, విద్యావిద్యలను— ఈ . యారింటిని ఎవడెఱుంగునో అతడే భగవంతుఁడు. వర్షరూపముననే ప్రాణుల రాక గాన నా తత్వము నెఱింగినవాడు భగవంతుడొక్కడే. ఆవర్షముయొక్క రాకయు కర్మానుసారమే. భగవంతుని యిచ్ఛకధీనమైయె వచ్చును. అంతియే గాని యెవరో యిచ్చుటకు వచ్చినందువలన వర్షము వచ్చెననునట్టి సాకులను చెప్పుకొనరాదు—'' అని బుద్ధివాద ములఁజెప్పిరి.

పిమ్మట ప్రతిరోజు మామూలుగా నాశ్రమమున శాస్త్రశ్రవణా దులచేతను తమ యనుష్ఠానాదిసన్నియమములచేతను సంతృప్తిగ నానందముగా నుండగ కొలది రోజులకే చాతుర్మాస్యవ్రతారంభ కాలము సమీపించెను. శ్రీ వ్యయనామసంవత్సరము ఆషాఢశుద్ధ ఏకాదశి (తే. 10-7-1946 బుధవారం) శుభదినమున సశాస్త్రీయ ముగా గత సంవత్సరమువలె పూర్ణమౌనము, అపక్వాహారము, బ్రహ్మనిష్ఠ మున్నగు కఠిననియమములతో నుత్తమరీతిని సత్యమగు ననుభవములతో వ్రతము ప్రారంభింపబడెను..

ఇంతలో భాద్రపద ఆశ్వయుజ మాసముల మధ్య దైవ యోగమున వర్షము సకాలమునకు రాకపోయెను. పాపమా తెలియని మనుజుల యజ్ఞత నేమందును? ఆనాడు వర్షము వచ్చినప్పుడు పొగడిన యా మనుజులు నేడు వర్షము రానందుచే నిందించుటకు మొదలువెట్టిరి.

''స్వామివారు అన్నము నీళ్ళు విడిచి ఏమో చేయుచున్నారు. అందువలన వర్షమురాలేదు. గాన రేపు కొండకు వెళ్ళి వారి వ్రతము

విడిపించి క్రిందికి దింపుదము'' అని మాట్లాడుకొని సంసిద్ధులై యుండగా, నాటి రాత్రికే విశేషముగా వర్షము గురిసెను. ఆ వర్షము ఎనిమిదిరోజులవఱకు విడువలేదు. అమాయక భక్తులగు నా జనులు వెంటనే తమలోతాము, ''చూచితిరా! మన మందరము ఆనాడు మన స్వామినిగూర్చి యేమేమో తప్పుగా ననుకొంటిమి, పెద్ద యపరాధమయ్యెను. పట్టిన వర్షము విడువక కొంపలు మునుగుచున్నవి. వెళ్ళి స్వామి పాదాలు పట్టుకొనవలెను'' అని కొంతమంది కృతనిశ్చయులైయుండిరట. కాని యదేమి చిత్రమో! నాటిరాత్రికే వర్షమాగిపోయెను. స్వామివారికెట్టి కల్పనలు లేకపోయినను కాకతాళీయముగా భగవల్లీలా రూపముగా జరగిన యీ విచిత్ర సంఘటనల గాంచి యమాయక ప్రజలు నానావిధములుగా కల్పనలు చేసికొనుచు నాడు "ఓరే! మనస్వామివారు గొప్పవారు. వీరిలోనేమో మహిమగలదు. మనమేమి భావించినను తప్పై యీ దెబ్బ మనకే వచ్చి తగులు చున్నది. వారు పెద్దలు. మనకు వారు స్వామి''—అని యిట్లు మిక్కిలి భక్తివినయంబులతో నాటినుండి నేటివఱకును విశ్వాసముతోనే మెలగుచున్నారు. ఏదెట్లున్నను వారి సద్భావములు వారిని తప్పక గాచుచున్నవి. ఈ విషయములన్నియు వ్రతానంతరము కొందఱు భక్తులు స్వామివారికి విన్నవించగా వారు నవ్వుచు, ''పాపము! వారికి తెలియదు; బాలురు! భగవంతుడు వారికి సద్బుద్ధినొసగి రక్షించుగాత!'' యని పలికిరి. ఆ వత్సరము కూడ సాంగమంగళప్రదమై నిర్విఘ్నముగా వ్రతము జరిగి చివరిరోజులలో నఖండభగవన్నామభజనపూజాపారాయణ

మున్నగు సర్వవైదిక విధానవములతో విజృంభణముగా జరిగి యున్నదానాదిశాంతితో కార్యము పరిపూర్ణమయ్యెను.

వ్రతము సమాప్తమైన పిదప కొందఱు భక్తులు వచ్చి మన స్వామిని కొన్ని ప్రశ్నలవేసి తమ సందేహములఁదీర్చుకొనిరి :—

ప్ర :—మహాత్మా! మౌనమనగానేమి? దాని ప్రయోజనమెట్టిది? అపక్వాహారమున గలుగు లాభమేమి?

ఉ:—మౌనమనగా నెట్టి మనోవృత్తులు లేకయుండుట. అందు వలన గలుగు ప్రయోజనము ఆత్మలాభము. శాంతిసుఖము.

శ్రీ శంకరభగవత్పాదులవారు "మోక్షస్య ప్రథమం ద్వారో వాఙ్నిరోధోఽపరిగ్రహః....." అనిచెప్పిరి. అనగా మోక్షకవాటము తెరువబడవలెనన్నచో మొదట సంయమముచే వాగ్రూపమైన యీ కవాటమును మూయవలెను. అప్పుడు మనస్సు వైఖరీస్థానమును వీడి మధ్యమవాక్కున లీనమగును. వెలుపల రాను ప్రయత్నించును. వచ్చుటకు వాకిలి మూయబడియున్నందున నచ్చటనే గొణుగుకొనుచు గొంతకాలముండి యాపిదప మనస్సు పైచోటగు పశ్యంతికివెళ్ళి యాత్మప్రతిఫలనమంది చూచుచుండును. అపుడు మనస్సుచూచునదయ్యేయుండును, గాని చూడబడు స్థానమునకు రాదు. అంత గొంతకాలమునకు ఈ స్థానమును విడచి కేవలము పరావాణియనబరగు నాత్మస్థానమును జేరును. ఇక మనస్సునకావల గమనము లేనందున నాచోట నిలిచి చూడ సర్వమును తానుగనే భాసిల్లును. ఆవాణి మరల వైఖరికి వచ్చినను వైఖరియని చెప్పబడదు. పరారూపముననే యాత్మమాత్రముగనే పలుకును. ఈ మూలమున ప్రథమమున వాఙ్నిరోధమనునది యెంతటి పరమసాహాయ్యమో పరప్రాప్తిసాధనమో యనుస్మించి

చూచిన నిది తెలియఁగలదు. అంతియేగాక సామాన్యముగా అస త్యాదిదోషములు వాక్కున కాపాదించవు. ఆ సంస్కారములు జేరవు. గ్రంథావలోకనకవకాశమగును. పరమనిష్కతి సహాయ మగును. వేయేల! "మౌనేన కలహంనాస్తి" యన్న నీతి వాక్యము చాలు................" ఇక అపక్వాహారమనగా వికారమొందని యాహారపదార్థముల భుజించుటచే నిర్వికారమగు నాత్మసందర్శన మునకు వలసిన బుద్ధికుశలత గలుగును, ప్రమత్తత వీడును...." ఇట్లింకను ననేక విషయములందెల్పిరి.

## ౧౩. హంపీ యాత్ర

ఇట్లుండ కొన్నిదినంబులకే యాత్రార్థమై సుమారిరువది మంది భక్తులతో కలసి శ్రీ పంపాక్షేత్రమునకు వెళ్ళిరి. పూజ్య స్వామివారివెంట వెళ్ళిన మా యాత్రానందమును ఏమని వర్ణించ గలను? జతలో వెళ్ళినవారు సద్భక్తులగు యువకులు. అంద రును సుఖముగా హంపీక్షేత్రమును జేరిరి. ఆనాడచ్చట ఉదయం మొదలు వర్షము గురియుచు మేఘావృతమై ప్రకృతివాతావర ణము మిక్కిలి చల్లగానుండుటచే చలికి జంకి తుంగభద్రాతీర మును సమీపించియు స్నానముచేయుటకు ముందువెనుకలు జూచుచు నొడ్డున గూర్చుండి భక్తిపూర్వకముగా, "ఓ విరూ పాక్షేశ్వరా! లేకలేక ఈ నాడు నిన్ను దర్శించుటకు వచ్చియుండ ఈ నీ భక్తులకుత్సాహముప్పొంగ నదియందు మునింగి నినుంగను గొను భాగ్యమీయలేవా? భగవంతుడగు శ్రీరామచంద్రుని కార్య మున రాయిరప్పలును పశుపక్షిరూపములు ప్రకృతియు సాయ మొనంగినట్లు వినబడుచున్నదే! అట్లు ఈ నీ యాత్మారామ

భక్తులమైవై దయగలిగి యీ కొంతసేపు సూర్యభగవంతుని దర్శింప జేసి సహాయమొసంగరాదా?'' అనుచు భక్త్యుత్సాహములతో చిందులు వేయుచుండ నదేమిచిత్రమో! మరుక్షణముననే, యానాడు జయద్రథుని వధసమయమున భగవన్మాయచే మాయం బడిన భానువు మఱల ప్రకాశించి ఫల్గునుని సందేహము బాపి నట్లు, ఈ భక్తుల భక్తికి భగవంతుడు మెచ్చడాయనునట్లు వెంటనే మేఘాచ్ఛన్నుడైయుండిన సూర్యుడు దర్శనంబిచ్చి తన వేడి కిరణములచే భక్తులను బాధించుచున్న చలిని ఎటకో పార ద్రోలి భక్తుల కానందమును గలిగించె. ఇక నా భక్తుల యానందో త్సాహములకు మేరయే లేదు. వెంటనే అందరును పవిత్రభావ మున "ఓ భాగీరథీ! పావనగంగామతల్లీ! మాకందరికిని భక్తి జ్ఞానవైరాగ్యముల ప్రసాదించి గావుమమ్మా!'' యని సంక ల్పించి కైవల్యోపనిషత్పఠనమొనర్చుచు గంగయందు దూకి తనివి దీర స్నానముచేసి, భగవంతుని గుణగానమొనర్చుచు శ్రీ విరూ పాక్షేశ్వరాలయమునకు వచ్చి యచట స్వామిని పూజించి గీతా పారాయణ భజన శ్రవణాదుల గావించి ధన్యులైరి. రాత్రి శ్రీ శివరామావధూతస్వామి యను వైరాగ్యశిఖామణుల యా పుణ్యా శ్రమమందు విశ్రమించి యుదయమున తమతమ నియమనిష్ఠల ముగించుకొని యచ్చట చూడవలసినవన్నియు జూచిరి.

## ౧౪. హుబ్బళ్ళి శ్రీ సిద్ధాశ్రమము

అటనుండి యందఱును ప్రసిద్ధమగు హుబ్బళ్ళి శ్రీ సిద్ధా శ్రమమునకు వచ్చిరి. అపరశివుడోయనునట్లు వెలిగి వేదాంతభేరిని దిగ్విజయముగా మ్రోగించిన శ్రీ సిద్ధారూఢస్వామివారిచే స్థాపింప

బడినది. వేదాంత ప్రచారమునకు కేంద్రము. వీరి సమాధియు నిచటనే గలదు. సమాధిదర్శనమంది భగవద్గీతాపారాయణాది సర్వనియమములందీర్చుకొనిరి. శ్రీ సిద్ధారూఢస్వాములవారి శిష్య వర్యులు అపరశుకులా యననొప్ప శ్రీ గురునాథారూఢస్వాముల వారి సన్నిధికి వెళ్ళి దర్శనమందిరి. అప్పుడచ్చట పెక్కుమంది సాధువులు, స్వాములు, శ్రోతలు, భక్తులు మొదలగువారందరు చేరియుండిరి. ఆ సన్నిధిని వేదాంతశ్రవణము జరుగుచుండెను. మన శ్రీవారు పరివారముతో కూర్చుండి శ్రవణము గావించిరి. వీరింగూర్చి మహాసన్నిధివారు "మీరెవరు? ఎచటివారు?" అను వివరములడిగి దెలిసికొని సంతసించి ఆనాడు సాయంకాలము శాస్త్ర ప్రవచనము మన శ్రీవారిచేతనే జరుగవలెనని కోరి నిర్ణయించిరి. ఆప్రాంతమున కన్నడ వేదాంతసాహిత్యమునందు సుప్రసిద్ధమైన సర్వశాస్త్రసారరూపమైన శ్రీమన్నిజగుణశివయోగులచే విరచితంబగు షట్ఛాస్త్రములు లేదా పంచరత్నములు (ఒక ఘట్టము తీసివేయగా) – వీనిలో నొకటగు అనుభవసారము అను ప్రకరణము నందలి "చిత్తిన వివర్తవెందెనలేకె జగవిదం మత్తెమాయామాత్రవెనలాగదె?" అను నీ ప్రశ్నాత్మకమైన అయిదవ సూత్రమును దీసియిచ్చి ప్రవచింపవలసినదిగా గోరిరి.

మన పూజ్యస్వామివారు గురుస్మరణాత్మకముగ గ్రంథమును చేబట్టి యిట్లారంభించిరి. సూత్రార్థమేమన:—

"జగత్తును మాయామాత్రమేయని చెప్పక చిద్వివర్తమని యేందుకనవలె ?" అని ప్రశ్న:— "వస్తుతః బ్రహ్మము కాని పదార్థము త్రికాలాబాధితమైన సద్రూపమున లేదు. "నాఽసతో విద్యతే భావః, నాఽభావో విద్యతే సతః"

"లేమికి ఉనికి లేదు ఉన్నదానికి లేమిలేదు"—ఇదినియమము. గాన జగత్తనునది బ్రహ్మముకంటె భిన్నసత్తాకమై, యన్యోపాదానమున లేదు. ఉన్న యా బ్రహ్మమే భ్రమచే జగత్తుగా కనుపించుచున్నదేగాని జగత్తనునది ప్రత్యేకముగా నపృథక్సిద్ధిలక్షణాత్మక స్వయంశక్తిచే నున్నదిగాదు. ఆ బ్రహ్మమే భ్రమచే నిదిగా గోచరించుచున్నది. అందుచే జగత్తన వివర్తోపాదానమేగాని మాయోపాదానమనరాదు. వివర్తమన "అప్రచ్యుత పూర్వస్వరూపస్య అసత్య నానా ప్రకారావభాసః వివర్తః"—అనగా పూర్వరూపము చెడకయే చెడినట్లగపడుట. రజ్జువు చెడకయే సర్పముగా నెట్లు భాసించునో, మరియు నా భాసించు సర్పమొకటి యన్యోపాదానమున రజ్జువుకంటె భిన్నమై సత్యముగానెట్లు లేదో, ఉన్నరజ్జువే భ్రమచే సర్పముగా నెట్లు దోచినదో మరియు నధిష్ఠాన జ్ఞానమున బాధనొందున్నదై యున్నదో, అటువలె నిజముగా లేని జగమునకు అనిర్వచనీయమగు మాయ ఉపాదానము గాదు. ఉన్నచిత్తే వివర్తోపాదానమున,బాధాయోగ్యమై జగము భాసిల్లుచున్నది" అను నీ మొదలగు విషయముల నతిస్పష్టముగ హేతుదృష్టాంతానుభవములతో నా సూత్రాధారమున శ్రోతలమనమొప్ప రెండు దినములుపన్యసించిరి. అచటి సర్వశ్రోతలు నమితానందమునొంది పరమప్రేమతో మరి కొంతకాలముండవలసినదిగా మన స్వామిని కోరిరి; గాని మన శ్రీవారు "నాయనా! మంచిదే. మీప్రేమకు చాల సంతసము. మరొకసారి వచ్చెద"మని చెప్పి సన్నిధియందు వందనములాచరించి యందరితో ప్రయాణమై శ్రీ శివలింగాశ్రమమునకు విచ్చేసిరి.

## ౧౫. శంభులింగని కొండ

ఇట్లు కొంతకాలమిచటనే గీతాభాష్యశ్రవణాదుల జరుపుచుండి యాపిదప మైసూరుప్రాంతమందలి "శంభులింగనబెట్ట" యనుస్థళమునకు బయలుదేరిరి. బ్రహ్మజ్ఞానసంపన్నులగు శ్రీ మన్నిజగుణశివయోగులు తపమాచరించి బ్రహ్మసాక్షాత్కారమందిన పుణ్యభూమి. మైసూరునుండి నంజనగూడు మీదుగా కొళ్ళేగాలం వెళ్ళు త్రోవలో మూగూరున కారుమైళ్ళదూరమున "చిలకవాడి బెట్ట (కొండ) యని ప్రసిద్ధిజెందిన తపోభూమి యీ కొండ. ఈ పవిత్రస్థళమున మనశ్రీవారు కొన్నిదినంబులు ధ్యానమగ్నులై యుండుచు షట్శాస్త్రగ్రంథము నవలోకించిరి. అనంతర మాప్రాంతమందలి విశేషములన్నియు తిలకించి మైసూరు రాదలచినవారై యారుమైళ్ళదూరముననున్న మూగూరువఱకు పాదచారులై వచ్చిరి. అట్లు నడచి వచ్చునపుడు శ్రీవారి యొద్దనున్న అయిదు రూప్యముల కాగితము (నోటు) దారిలో పడిపోయెను. శ్రీవారి యొద్ద వేరు డబ్బులేకపోయెను. అచటినుండి మైసూరునగరము దాదాపు ౬౦-౭౦ మైళ్ళదూరమున గలదు. దగ్గరలేదు. ఇక నపరిచితమగు నాస్థళమున కరుణామయుడగు పరమేశ్వరుడు తప్ప వేరెవ్వరీయగలరు? అప్పుడేమియుఁదోచక శివశివా! పరమాత్మా! నేను నేడిట్టి కష్టమనుభవించుట నీకిష్టమా? తండ్రీ!"- అని తలచుకొనుచు వెళ్ళి బస్సువారితో వినయముగా, "అయ్యా! నా యొద్దనున్న అయిదురూపాయలు దారిలో యెచటనో పడిపోయెను. కాన నన్ను మైసూరువఱకు నెక్కించుకొని పోగలరా?" అని యడిగిరి. కాని పరమలౌకికులగు వారికి సాధువులు మహా

త్మలు అనియు వారిని గౌరవించవలెననియు ఏమాత్రము తెలియకపోవుటచే నాజనులు మన స్వామియెడ తిరస్కారభావముతో "అయ్యా, సాధూ! ఈ వేషము ధరించిన మీకిదేగతి. దేవుడని కలవరింతురే! చూచితివా? అసలు దేవుడే ఉన్నచో మీ యయిదు రూపాయలనెట్లు పోగొట్టెను? మీ సన్యాసుల కథ మాకు తెలుసునులే! చూచినాము; పో పొమ్ము" అని కసరుకొనిరి.

క్షమాశీలురగు మన స్వామివారికంతమాత్రమునకేవిధముగను విసిగివేసారక "కాని, ఈనాటి దైవలీల యీ స్థలమున నిట్లు కావలసియున్నది. తన లీలార్థమై యా పరమేశ్వరుడే(గురుదేవుడే) వారి ముఖముద్వారా నిట్లు పలుకుచున్నాడు; నాద్వారా వారి నడిగించుచున్నాడు; అడిగినపిదప యీ వ్యథనందునట్లు జేయుచున్నాడు; కానిమ్ము మంచిదే, ఓం తత్సత్!" అని యొకచోట గూర్చుండిరి. ఇంతలో నొక పెద్దమనిషి చేతిలో కొన్ని పూలు పండ్లు పట్టుకొని శ్రీవారియెదుటనే నడువీధిలో పోవుచుండెను. ఆ గృహస్థునియొద్ద అయిదు రూపాయలు అప్పుగా నడిగి మైసూరు భక్తులు గోవిందప్పగారి యద్రస్సు నీయవచ్చుగదా! యనెడి సంకల్పము శ్రీవారికుదయించినది. వెంటనే ఆ వ్యక్తియొద్దకు వెళ్ళి యున్న విషయము తెల్పి డబ్బునడిగిరి. ఆ సద్గృహస్థుడు వెంటనే యా నడువీధిలో శ్రీవారి పాదములకు నమస్కరించి, "స్వామీ! నేనింతవఱకు పెక్కు చిక్కులకు చిక్కి స్రుక్కుచుంటిని. భగవంతుని యనుగ్రహముచేతను, తమబోటి పెద్దల యాశీర్వాదముచేతను నేడా చిక్కులన్నియు నశించెను. కనుకనే యిపుడు కరుణామయుడగు నా భగవంతున కభిషేకపూజాదులద్వారా నా కృతజ్ఞతను తెల్పుకొనుటకై ఫల

పుష్పాదుల గొని గుడికి వెళ్ళుచున్నాను. ఇట్టి నాయొద్దకు, నాడు భగవంతుడే వామనరూపుడుంగా బలిచక్రవర్తిని చేయిజాపి యడగినట్లు వచ్చి యడుగుచుండ నాభాగ్యమేమని చెప్పగలను! ధన్యుడ! ఇంతకంటె పుణ్యము వేరెద్ది? ఎంతకావలెనో తమ రడుగవచ్చు మహాత్మా! అని భక్తివినయంబులతో విన్నవించెను. అంతట మన శ్రీవారు, "నాయనా! నాకు కావలసినది మైసూరు వఱకు టిక్కెట్టు; మూడు రూపాయలు చాలును. మైసూరు వెళ్ళగానే పంపగలను" అనిరి. కాని యా యుదారవ్యక్తి వెంటనే పది రూపాయల నోటొకటి ఫలతాంబూలములతో స్వామి కర పాత్రయందు సమర్పించి నాకు మరల పంపవలదనిరి. మన స్వామి "ఇంత డబ్బవసరములేదు" అని యెంత చెప్పినను బలా త్కారముగా సమర్పించి మ్రొక్కి సెలవుగైకొని గుడికి వెళ్ళెను.

"శివశివా! నీ లీలలేమని చెప్పగలను? తండ్రి! నీవు కర్తుమ కర్తుమన్యథాకర్తుం సర్వశక్తి సంపన్నుడవయ్యా! పరాత్పరా! ఈ రథముయొక్క సారథ్యము నీ చేతిలోనున్నది. నిన్నేనమ్మి దీని సారథ్యము నీకు సమర్పించి నిరహంకృతిచే వర్తించిన నీ బిడ్డలను కష్టము ఆయాసము అనునది లేక గమ్యస్థానమును జేర్చగలవు గదా! అయితే ఓ గురుదేవా! విశ్వంభరమూర్తీ! ఇట్టి క్లిష్ట సమయములయందును నీస్మరణ తప్పకుండునట్లాశీర్వదింపుము. ఎల్ల రూపముల నీవే భాసిల్లుచున్నావు. రూపములు వేరైనను చూపులకు చూపైనవాడవు నీవొక్కడవేగదా! అన్నిటియందును నిన్ను గాంచగల దృష్టినొసంగుము. శ్రుతిసమ్మతమైన సద్బుద్ధి నొసంగుము. రక్షించుము. ప్రభో! ఈప్రకృతి లీలారంగమున నీ చిత్రవిచిత్ర రూపములజూచి మోసబోక వ్యామోహమొందని

చిత్తస్థైర్యమును ప్రజ్ఞాచక్షుస్సును ప్రసాదించుము. ఓం తత్ సత్'' అని భక్తితో దయామయుడగు భగవంతుని ప్రార్థించిరి. (ఈ విషయమును సోదరశిష్యులతో భక్తి పరవశులై చెప్పు చుండురు).

అచటినుండి మన స్వామివారు ఆ బస్సుకడకే వచ్చిరి. పాపమా నాడు బస్సువారికి పాసింజర్లు రానందున నంతవఱకు వెళ్ళక నిలిచి యే యుండెను. శ్రీవారు నేరుగా వెళ్ళి బస్సులో గూర్చుండిరి. అంత కొంతసేపటికే బస్సు కదలెను. బస్సువారికి స్వామి డబ్బీయం బోయిరి. అపుడా బస్సువారు, "ఓ స్వామీ! మొదట మమ్ము క్షమింపుడు. ''ఏపుట్టలో నేపాముండునో'' యన్నట్లు తమ విషయము తెలియక ఆడరాని మాటలనాడితిమి; హాస్యముగావించి తిమి; అట్లు చేసినందులకు ఫలమా యనునట్లు మాకు రూపాయలు రాకపోయె; కష్టములు పోవాయె: జనులు లేక బండిపని చేటాయె. కాబట్టి స్వామీ! మీడబ్బులువద్దు. మీ యాశీర్వాదములుండిన చాలును. ఎట్టికష్టములేక నడువీధిలో నొకవ్యక్తి భక్తితో మ్రొక్కి డబ్బులు సమర్పించుకొనగా జూచు చుంటిమి'' అని చెప్పుచు రొక్కమును తీసికొనలేదు. స్వామి శివాయనమః అని సుఖముగా గూర్చుండిరి. భగవదేక దీక్షగలిగి వర్తించువారికిడుములెన్నటికిరావు. ఒకవేళ వచ్చినను నిరపాయ ముగా నివృత్తము లగుచుండును. ఇది ముమ్మాటికి సత్యము. పెద్దలయనుభవము.

## ౧౬. మైసూరువాసము

బస్సులో గూర్చున్న మనస్వామి సుఖముగ మైసూరు చేరి ఆప్తభక్తులగు శ్రీ గోవిందప్పగారి యింటికి వెళ్ళిరి. స్వామినిచూచిన

వెంటనే మహదానందముతో పరమభక్తితో వారిని తగినట్లుపచరించి తమ మేడమీదనే స్వామికి బసనేర్పాటుగావించిరి. అన్ని సౌకర్యముల గావించిరి. ఈ గోవిందప్పగారి కుటుంబమున పిల్లలు మొదలు పెద్దలవఱకు నందరు సజ్జన విధేయులు, వివేకవంతులు. ఇట్టి పరమభక్తుల ఇంటిలో గీతాపారాయణప్రవచనాదినిత్యకార్యక్రమములను యథావిధిగా జరుపుచుండ నందరును పరమ తృప్తిగానుండిరి. ఇట్లుండ నొకనాడు ప్రసంగవశమున శ్రీ గోవిందప్పగారు సాధువుల యెడ తమకుగల గాఢవిశ్వాసమును గూర్చి యిట్లు పల్కిరి, "స్వామీ! ఎట్టివారేయగుగాక! సాధువులంటే నాకు పరమ పూజ్యభావముదయించును. కాషాయాంబర మాత్రదర్శనముచేతనే వారి గుణాగుణములతో నావశ్యకత లేకయే వారియెడ నాకెంతో ప్రేమ గల్గును. వారిని చూచినతోడనే వారికి నమస్కరించుట, యథాశక్తి సేవచేయుట ఇది నాధర్మము." అని తెలియజేసిరి. ఇది విని మనస్వామి యావేశపూరితులై,

"నాయనా! నీ సద్బుద్ధి యెంతటి యపూర్వమైనదయ్యా! ఈ యవిచ్యుతమగు నీ సత్యనిశ్చయమే నిన్ను సదా గాచును. పరమపూజ్యమగు నీ యుత్తమ లక్షణముకంటె భగవత్సాక్షాత్కారమునకు వేరొక గొప్ప సాధనములేదు. సాధుజన విశ్వాసమే ముక్తికి పరమసాధనము. ఇది మొదటిది. ఈ టిక్కెట్టు మొదట పొందినచో ముక్తి మందిరమునకు నిరాటంకముగా పోగలము. మార్గమధ్యమున నేకేయుడ్డులు రావు.

"సత్సంగత్వే నిస్సంగత్వం.........జీవన్ముక్తిః"

అనెడి శ్రీ శంకరాచార్యుల భజగోవిందశ్లోకమందలి భావమును

మననము చేయుడు. ఇట సత్సంగమనగా నే పరిశుద్ధవృత్తికి త్రికాలాబాధితంబగు సత్పదార్థమున సంగము అనగా వ్యాప్తిగలిగి తానుగా ననుభవింపబడునో అదే నిజమైన సత్సంగము. అట్టి సద్వస్తునిష్ఠ గలవారగుటచేతనే మహాత్ములను సాధువులని పిలుతురు. ఇట్టి సాధువుల సంగమునకే సత్సంగమనియు చెప్పుదురు.

"సాధవః క్షీణదోషాస్స్యుః సచ్ఛబ్దః సాధువాచకః।
తేషామాచరణం యత్తు సదాచారస్స ఉచ్యతే॥"

అన్నట్లు దోషరహితులై సత్యనిష్ఠచే సదాచారవిచారముల గలిగి వర్తించువారే సాధువులు. అట్టి సాధుపుంగవుల గురుతులే పరమపూజ్యంబులగు కాషాయాంబరములు. ఇట్టి కాషాయాంబరము లందు పూజ్యబుద్ధిగల మీరు శాశ్వతశాంతిసుఖస్వరూపమగు కైవల్యము నందుటకు ఎట్టి సందియమును లేదు. అది యుత్తమమగు పవిత్రభావము. ఓం శుభం భవంతు; శ్రీరస్తు; శివమస్తు."

అని పలికిరి. ఇట్లుండ కొన్నిదినములకు శ్రీ స్వామివారు వెళ్ళి వచ్చిన శ్రీ శంభులింగనికొండనుండి పూజ్య శ్రీ చిదానందస్వాముల వారు, బదనవాళ శ్రీ తమ్మిరెడ్డి యనువారును మైసూరు వచ్చి శ్రీ గోవిందప్పగారి యింటనే భిక్షను స్వీకరించి యొకదినమున నందరు కలసి (మైసూరు) అగ్రహారముననుండు శ్రీమన్మహారాజుల గురువులుననగు శ్రీ సిద్ధలింగశివాచార్యస్వాములను దర్శించుటకై వెళ్ళి యాజ్ఞవడసి లోపలజని స్వామిని దర్శించిరి. అనంతరము శ్రీ చిదానందస్వాములవారు తాము రచించిన ఉపనిషద్గీతాదిగ్రంథములను శ్రీ స్వామివారికి సమర్పించిరి. పరస్పరసంభాషణమును జరిగెను. పిమ్మట సంతోషముతో మన స్వామివారిని గూర్చి విచారించిరి. అందులకు శ్రీ చిదానందస్వాములవారు మన గిరి

శ్రీవారిని గురించిన సర్వవిషయంబులను తెల్పిరి. "ఈ స్వామివారు చాతుర్మాస్యవ్రతము నీ మైసూరు ప్రాంతము ననే చేయఁదలంచియున్నారు," అనియు తెలియఁబఱచిరి. అది విని యాగురువులు పరమసంతోషమున, "చాల మంచిది; కొంత విద్యాబుద్ధులు గలిగి వైరాగ్యసంపన్నులగు నీలాటి యనుష్ఠానపరులకు వారి యనుష్ఠానాదులకు తగిన యను కూలములు కల్పించియిచ్చుట లోకకల్యాణప్రదము. నిజమైన సంన్యాసులు అనుష్ఠానపరులు లోకమున నధికమైనచో మాన వులు బాగుపడుటకెట్టి సందేహము లేదు. అట్లయినచో స్థానాం తరమున్నకై వెదకనేల? మన ఈ మహా సంస్థానముననే మంచి యేకాంతమగు నొక యుద్యానవనమును చూపెదము. అన్ని యేర్పాట్లు చేయబడును. హాయిగ నట నుండవచ్చు" నని పరమప్రేమతో బలికిరి.

ఈ మాటలు విని వీరందరు మన శ్రీవారినచటనే విడచివచ్చిరి. అనంతర మా రాజగురువులు రాజమర్యాదతో నొప్పు తమ గురు వుల సమాధిగల యేకాంతవనమున నొక గది నొసంగి యందు సర్వసౌకర్యముల కల్పించిరి. అది పట్టణమునకు నాతిదూరమై నాతిసమీపమై చాముండేశ్వరీ పర్వతశ్రేణుల ప్రక్క చక్కని ప్రకృతిసౌందర్యములతో నలరారు తోట. వృక్షలతాదులచే సుశో భితంబై యానందదాయకమైయుండెను. ఇట్టి యుత్తమ స్థలమున మామూలుగా తమ యనుష్ఠానాధ్యయనముల గావించు కొనుచు నియమముతో పరమసుఖంబుండిరి. అపుడపుడు శ్రీ సిద్ధలింగస్వాములవారి సన్నిధికి వచ్చుచు బోవుచు పరస్పరము

భగవద్విషయములఁ జర్చించుకొనుచుండిరి. ఆ శ్రీవారును వీరిని పరమప్రీతితో గౌరవించుచుండిరి.

ఒకనాడు ఆ రాజగురువులు మన శ్రీవారితో, "స్వామీ! సిద్ధాంత శిఖామణిగ్రంథము మీకు తెలియునా? అందలి మంగళాచరణాత్మకమగు నీ శ్లోకమును వ్యాఖ్యానము దయతోచేయండి'' యని గ్రంథమున నా శ్లోకమును దీసియిచ్చిరి. అవుడు మన స్వామి పరమప్రీతితో గ్రంథమునందుకొని మనమున శ్రీగురు స్మరణ జేసికొని మొదట శ్లోకమును జదివిరి,

"త్రైలోక్యసంపదాలేఖ్య సముల్లేఖనభిత్తయే ।
సచ్చిదానందరూపాయ శివాయ బ్రహ్మణే నమః"

అనగా త్రిలోకములను సంపద్రూపచిత్రలేఖనకు భిత్తి (గోడ) వలె నాధారముగానున్న సచ్చిదానందస్వరూపుడును, పరబ్రహ్మ స్వరూపుడునయిన శివునకు నమస్కారము—అని యందలి తాత్పర్యమును జెప్పి యనంతర ముత్తమరీతిని చక్కని యనుభవములతోను, కేవల మద్వైతపరముగను, పంచదశి చిత్రదీపికయందలి యుపమానోపమేయములతోను, సర్వసమన్వయముగా మృదు మధురభాషతో నిరూపించిరి. అంతయును విన్న యా రాజగురువులు పరమసంతోషముతో నిట్లనిరి, "స్వామీజీ! తమబోటి విద్యావంతులు, బుద్ధిమంతులు జన్మతః ఉత్తమమైన వీరశైవ మాహేశ్వరులైయుండియును మతవిశ్వాసమును వీడి శిఖా యజ్ఞోపవీతముల విసర్జించియుండుట మాకంత యిష్టములేదు. మేము చెప్పుమాటను వినండి. మరల మీకు శాస్త్రోక్తముగా శిఖా యజ్ఞోపవీత లింగధారణముల గావించెదము. అవి మాత్రము మీకు బరువా? వీరశైవ మహామతమున వాటిని విసర్జించ

కయే ఆచార్యులై సంన్యాసులైయుండలేదా? అట్లుండిన నీ స్థల
ములో వీరికన్నివిధముల గౌరవప్రతిష్ఠలు చాల బాగుండును"
అని చెప్పిరి.

అందులకు మన పూజ్యస్వామివారు వినయముతో, "పూజ్య
మహాశయా! మతములన్నియు మనోభావములే. ఈ మనోభావ
లన్నియు సుడిగినచోటే యందరి మహామతము. అదియే నా స్వరూ
పము, సర్వస్వరూపమునైయున్నది. మానవునకు తన జీవిత
లక్ష్యమగునీస్థితిని బొందుటకు మతమనునది విశ్వాసపాత్రమై
పరమసాధనముగానున్నది. తాము జెప్పిన విషయము పరమపూ
జ్యంబే, గాని మహాత్మా! విహితమైన యే మతమైనను సరియే.
ఏదేనొకదానినాశ్రయించి జీవనపరమలాభమగు మోక్షమును బొంద
వచ్చునుగదా! ఒకసారి మనఃపూర్వకముగా సంన్యసించిన విషయ
మును మరలగైకొనుట ఆదర్శహీనముగదా! అది వారి వారి
సంస్కారాధీనము. శ్రుతిసమ్మతమగు నే మంచిమతమునైనను
మహనీయులు జ్ఞానులు మన్నింతురుగదా! యని సన్నిధిలో
విన్నవించుకొనువాడ" నని వినయసంపన్నమగు వాణితో నాటి
ప్రసంగమును ముగించి సంతోషమున నా గురువుల నెలవంది
తమ యేకాంతవాసమునకు వచ్చిరి. విశ్వవ్యాప్తమగు మన స్వామి
మతమును (హృదయమును) వేఱొక మతముగా విభజించు
వారెవరు? అన్ని మతములు తన స్వరూపమే యనెడి నిశ్చయ
ముగల మహానుభావులు మర్యాదలకు మాన్యనీయురుగదా!

అంత మరుదినమే గుంటూరునుండి స్వామికి నొక యుత్త
రువు వచ్చెను. అదే కారణముగా నా రాజగురువులయొద్దకు
పోయి, "మహానుభావా! ఇట్లు నాకుత్తరము వచ్చినది. వెళ్ళు

చున్నాడ. సన్నిధివారు సెలవీయవలె'' నని గోరిరి. ఆ గురు స్వాములు వలదని నివారించిరి. అయినను స్వామి సవినయముగా మరల వచ్చెదనని చెప్పి తమ యాప్తులగు శ్రీ గోవిందప్ప గారి యింటికి వచ్చిరి. గుంటూరు వెళ్ళవలసిన విషయము దెలుపగా గోవిందప్పగారు బలాత్కారమున వలదని ప్రయాణము నాపిరి. సుమారెనిమిది రోజులు వారి యింటిలో శాస్త్రశ్రవణములు గావించిరి. ఇంతలో నంజనగూడునుండి గోవిందప్పగారి మిత్రులొకరు శ్రీ పుట్టస్వామి యనువారువచ్చిరి. వారితో మాట్లాడుచు ప్రసంగవశమున నంజనగూడులో నేదేని యేకాంతప్రదేశ మున్నదా? యని విచారింప వారు "కపిలా నదీతీరమున ఒక శివాలయమున్నది. అది చాల విజనమైన ప్రత్యేకముగా నుండును. ఆ స్థలముకూడ పవిత్రమైన క్షేత్రము'' అని తెలుపగా గోవిందప్పగారు వెళ్ళి చూచి యాస్థలమున నన్ని యేర్పాట్లుగావించి స్వామిని భిక్షయొసగవలసినదిగా శ్రీ పుట్టస్వామి గారికి చెప్పి యీ సర్వవిషయములను స్వామికి తెలియఁజేసి గుంటూరు వెళ్ళనీయక జేసిరి.

## ౧౭. కపిలాతీరము-నంజుడేశ్వర క్షేత్రము

ఇంతలో వ్రతారంభదినములు సమీపించెను. స్వామి కపిలా నదీతీరమున గల నంజనగూడు పట్టణమందలి శివాలయమునకు విచ్చేసిరి. ఇయ్యది విజనప్రదేశమున గల యొక పురాతన దేవాలయము. ప్రక్కనే కపిలానదీప్రవాహము. ఇట్టి నదీతీరస్థమగు నేకాంతప్రదేశమును గని పరమానందభరితులై, తమ పరమేష్ఠిగురువు పాడు దేవాలయమున వసించుచు బ్రహ్మను

భూతినందిన సమాధిపరులగు దేశికులని చరిత్ర వినియుండిరి గాన నద్దానిని స్మరించి తానును నేడారూపమున నీ శివాలయము నందు పరదేశియై వసించెదగాక యని సద్భావనాయుక్తులై శుభ సంకల్పముతో వ్రతమారంభించి బ్రహ్మనిష్ఠతోను, గ్రంథవ్యాసంగ ముతోను అవసరమైన ప్రసంగమున నియమితకాలములో మిత ముగా మాట్లాడుచు బ్రహ్మానందముగ సువిశాలంబగు నీ శివా లయంబున సుఖముగానుండిరి.

ఈ సమయమున స్వామియొద్దకు గొందరు పెద్దమనుష్యులు, మధ్యములు, సామాన్యులు కూడ వచ్చి తమకు గలిగెడి సందేహ ములను ప్రశ్నలమూలముగా నివారించుకొనుచుండిరి. ఉత్త ములు శ్రీవారి కన్నివిధముల సహకరించుచుండిరి. ఆ ప్రశ్నోత్తర ములలో కొన్నిటిని శ్రీవారి దినచర్య (డైరి) నుండి ఇచ్చట పొందుపఱచెద. ఒకనాడొక పెద్దమనుష్యులు వచ్చి జిజ్ఞాసతోనే భక్తితో నిట్లడిగిరి:—

ప్ర:—స్వామీ! అద్వైతమతస్థులు సర్వము మిథ్యయందురే! అట్లయిన ప్రమాణములగు శ్రుతులు కూడ వారికి మిథ్య లేనా? అట్లు శ్రుతులే మిథ్యలైనచో నద్వైతమతమునకు ప్రమాణమే లేకపోయెనుగదా! గాన నద్వైతమతము ప్రమాణరహితమా? దయతో తెల్పుడు.

ఉ:—ఔను, అద్వైతమతమున సర్వము మిథ్యయే. ప్రమాణములకు ప్రమాణమగు అద్వైతమతమునకు మరొక ప్రమాణమ వసరము లేదు, అది స్వయంప్రమాణమే.

ప్ర:—స్వామీ! ఈ యర్థమును మరింత విశాలముగా వివరింప గోరుచున్నాను.

ఉ:-(సౌమ్యముతో) అయ్యా! ఈ విషయమును మరికొంత వివరముగా సమన్వయించవలెనన్నచో:-సత్యము తెలియు నంతవఱకు భేదము నిలిచియే యుండును. అపుడు శ్రుతు లు ప్రమాణములనియే చెప్పబడును; గాని పరమార్థ సత్యమగు నద్వైతానుభవమున ప్రమాణము ప్రవర్తింప జాలదు. ఆవరణ భంగమొనర్చు పర్యంతమే ప్రమాణముల ప్రామాణ్యత చెల్లును. "యతో వాచో నివర్తన్తే। అప్రాప్య మనసా సహ। (తై. ఉ.)అని శ్రుతియే ఆ చోటున తన ప్రామాణ్యతను వద లెను. ఆవల నేను వెళ్ళజాలననియెనుగదా! వస్త్వనుభవసమ కాలమున ప్రమాణములతో బనిలేదు. వడ్డనయగువఱకే పంక్తియందు ప్రక్క చూపులు. భోజనకాలమున నవిలేవు. మఱియు నద్వైతమనునది యీ వ్యావహారికదృష్టిచే నిర్ణ యింపబడు సత్యమిథ్యలకోటిలో జేరినదిగాదు. సత్యమిథ్య లను నీ విమర్శ యేచోటునుండి బయలుదేరునో యా పర మగు స్థానమే అద్వైతము. అచ్చటేమియును లేదు. ఉన్నదొకటే యఖండవస్తువు, స్వసంవిత్తు, "నేహనానాస్తి కించన", "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", "న నిరోధో నచోత్పత్తిర్న బద్ధోనచసాధకః।న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతః॥" అను నీ మొదలగు శ్రుతి వాక్యములను విమర్శించి బోధించిరి. అంత నా యజమాని మహానందముతో శిరసాష్టాంగ ప్రణామము లాచరించి వెళ్ళిరి. (వీరు నంజనగూడు ప్రక్కపల్లెవారు; సిద్ధ వీరప్పయని పేరు.)

మరొక రోజు వేఱొక పెద్దమనిషి స్వామికప్పుడప్పుడు పండ్లు సమర్పించుచుండిరి. ఏదో సంస్థకు యజమాన్నిగాను యుండనోవు. వీరు స్వామినిట్లడిగిరి :—

ప్ర:-బుద్ధీ ! మీరెందుకీ సంన్యాసమును స్వీకరించి లోకులందరి కంటె వేరుగ నిట్లున్నారు? మిమ్ము జూచిన చాల సంతోష మగుచున్నది. మీ యాచారవిచారములంటే అపరూపము. చాల బాగున్నది: నేనొక మాట చెప్పెద వినండి. మాకును మఠమొకటి యున్నది. దానికి మంచి యాస్తిపాస్తులున్నవి. ఆ గ్రామమిచటికి దగ్గరనేయున్నది. మిమ్మచటికి పిలుచు కొనిపోయి మీకు గాయత్రివేసి (పట్టముకట్టి, సమర్పించి) మఠానికి యజమానిగా చేయుదవుం. కాన దయతో మా మఠానికి దయచేయుదురా ?

ఉ :-(స్వామి నవ్వుచు) పెద్దయ్యా ! మీ మఠానికి వచ్చి గాయత్రి వేసికొని యజమాన్నిగాను యుంటే కలిగే గొప్పతనమేమి? ఇంతకంటే ఏదైనా పెద్ద మోక్షము వచ్చునా ?

య:—ఆఁ ! రాకేమి? మా వారంతా మిమ్ము పెద్దగా జూస్తారు. గౌరవిస్తారు. మీకు కావలసిన సౌకర్యములు చేస్తారు. మీ మాటలు జవదాటక వింటారు.

స్వా:—అంతేనయ్యా ఆధిక్యం ! కాని యిక చాలు. ఈ అశాశ్వత మగు గౌరవములు ఆధిపత్యములు మాకవసరములేదు. అవి యానాడే దిగనాడితిమి. వాటిని గుఱించిన ప్రసంగ ములవసరములేదు. మానవ జీవితధ్యేయమది గాదు. అందులకై మానవుడు పుట్టలేదు. ఈ యనాత్మవిషయ వాసనలచే గలిగిన యాశాపాశములతో మీ జీవితము

నెందులకిట్లు బంధించుకొందురు? శాంతముగా భగవన్నిష్ఠచే భవ్యమగు చిరసుఖమును పొందగోరుడు''— అని బుద్ధివాదమును గఱిపిరి. ఈ మాటలు విన్న యా పెద్దమనిషి అసమాధానముతో నేమేమో గొణుగుకొనుచు వెడలిపోయెను. నాటినుండి పండ్లను తెచ్చి సమర్పించు భక్తి నిలిచిపోయె.

ఈయన విషయముననే మన శ్రీవారు సోదరశిష్యులతో చెప్పుచు నవ్వుచుండెడివారు. ఏమన, "అయ్యా! నీవు పండ్లనెందులకు దెచ్చెదవు? దినదినము నీకిదియొక ఖర్చుగాదా?" యని స్వామి వారడుగ, ఆయన కన్నడమున,

"స్వామీ! నీరుకోళి నీరినల్లి ముళుగిబిట్టరె, తనగె స్నాన ఆయితు; తిన్నోదక్కె మీనుసిక్కితు. హాగేనే తమగె హణ్ణు కొట్టరె నమగె పాప హోయితు; నిమ్మదు పుణ్య బంతు. స్వామీ! ఇదు ఒళ్ళేదు''—అనుచుండెడివారట. అనగా తెనుగులో,

"స్వామీ! నీటికోడి నీటిలో మునిగితే తనకు స్నానమాయె; తినుటకు చేపలు చిక్కె. అట్లనే తమకు పండ్లు ఇస్తే మా పాపం పోయె; మీ పుణ్యం మాకు వచ్చె''–అని.

మరొకరోజు యస్. చంద్రశేఖరయ్య అను వివేకులొకరు వచ్చి భక్తి విశ్వాసములతో నిట్లు కొన్ని విషయములడిగిరి. వీరు స్థలీయ యోగ్య గృహస్థులు.

ప్ర:—పూజ్యస్వామీ! ఆత్మ చిదాకాశస్వరూపమందురే! అది అనుభవముననెట్లు దర్శించనగును? (అనగా అనుభవమెట్లు?)

ఉ:—నాయనా! బుద్ధికిని ఆత్మకును మధ్యనుండు అనుభవము చిదాకాశము. మరియు "దేశాద్దేశాంతరప్రాప్తౌ సంవిదో మధ్యమేవయత్। నిమేషేణ చిదాకాశం తద్విద్ధి వరవర్ణిని!"; "పూర్వవృత్తేర్విలయం, ఉత్తర వృత్తేరనుదయం—ఈ మధ్యకాలం "అపలంబ్య నిరాలంబమథమధ్యే స్థిరోభవ" యన్నట్లు ఉభయ కల్పనలు లేని సామూహికస్థితియే చిదాకాశానుభవము. ఇది బుద్ధికిని మనస్సునకును మధ్యనుండునది భూతాకాశమనియు, విషయాదులయందు మనస్సు కలసిపోవుట చిత్తాకాశమనియు చెప్పబడును.

ప్ర:—గురువర్యా! జ్ఞానకర్మోపాసనల సంగ్రహార్థమేమి?

ఉ:-వస్తు యాథార్థ్యమును దెలుపునది (బోధించునది) జ్ఞానము; భావనను కల్గించునది యుపాసన; కర్తృత్వమును గల్గించునది కర్మ.

ప్ర:-మహాస్వామీ! ఎట్లుండినచో నాకు జ్ఞానదార్ఢ్యము లభించును?

ఉ:-ద్రవ్యమునుండి ధర్మమును, కుశలమంత్రినుండి రాజ్యమును, పతివ్రతయగు గృహిణినుండి గృహమును ఎట్లు చక్కబడునో అటువలె విడువని సాధనానుష్ఠానములతో సంతత వాక్యార్థ శ్రవణముజేయుచుండినచో నీకు జ్ఞాన దార్ఢ్యము లభించును.

ప్ర:-పూజ్యా! అనుష్ఠానమనగానేమి?

ఉ:-వృత్తినొకేచోటునందుంచుట అనుష్ఠానమనబడును.

ప్ర:-పూజ్యచరణా! తమ యీ కార్యములకు సహాయకులై చూచుకొనువారెవరు?

ఉ:-సంప్రదాత్మా! తల్లిలేని పిల్లలను అన్యులేవిధముగా జూతురో,

అట్లే కర్తృత్వము లేని సాధు సంన్యాసుల భక్తుల కార్యమును ఈశ్వరుడే చూచుకొనును. ఆ మూలమున కొందఱు భక్తుల నేర్పఱచినాడు. ఏమి కొఱంతయును లేదు. ఓం తత్సత్.—

ఇట్టి సత్యవాక్యములను విన్న యా సభ్యులు వినమితభావమున, "స్వామీ! తమకేమి కావలసినను చెప్పిపంపండి. నే తప్పక తమ సేవ యొనర్చెద" నని చెప్పి నమస్కరించి వెళ్ళిరి. మరొకనాడు లౌకికు లొకరిట్లడిగిరి:—

"స్వామీ! నిగ్రహమంటే ఏమి? మీరేమి నిగ్రహించినారు? అన్నము నీళ్ళు విడిచినారా?" అని ప్రశ్నింప దానికి స్వామి మహామౌనముద్రతో జవాబిచ్చిరి. (ఊరకుండిరి). ఆయన కొంత సేపు చూచి యందే సమాధానముగా దలంచి వెడలెను.

ఈ స్థానమున కొందరు యువకులు కొంటిచేష్టలతో నల్లరి చేయుచుండిరి. స్వామినిష్ఠకు భంగము కలిగించుచుండిరి. ఒకనాడు స్వామిమీద రాళ్ళు రువ్వుటకై యొకడు గుడిచుట్టు గోడనెక్కి మరొకనిని లాగుకొనుసమయమున నిద్దఱు జారి క్రింద పడి పెద్దదెబ్బలు తగిలి తప్పులను గుర్తించిరి. చివరకు స్వామి యెడ తామొనర్చిన యపరాధమునకు ప్రాయశ్చిత్తమని తలంచి స్వామికి శరణై శ్రీవారి బంటులైరి. నాటినుండి వారు శ్రీవారికి వలసిన వస్తువుల తెచ్చియిచ్చుచుండిరి. భగవదాయత్తచిత్తులకు గలిగెడి ప్రతిబంధముల భగవంతుడచిరకాలమున బాపును గదా!

ఒక రోజు ప్రసంగము జరుగుచుండగా కొందఱు భక్తులు గుమిగూడి ప్రశ్నించిరి:—

ప్ర:-స్వామీ! ఈ జగత్తులో నెట్లుండినను కష్టమేయున్నది.

నేనెట్లు జీవించవలె? నాకు చాల తొందరలున్నవే!

ఉ :-అయ్యా! ఇట్టి కల్పనల మనసున తెచ్చుకొనక మీ గురువులు చెప్పిన నిష్ఠను విచారములను మనసున కంటగట్టి ఊరకనేయుండండి. లేనిపోని కలతల బెట్టుకొని బుద్ధిని పాడుచేసికొన్నచో చెడిపోదురు. కాన మనస్సును స్వాధీన పఱచుకొనుడు. మొన్ననే ఆ విషయమును చెప్పితిమి గదా! శాంతము వహింపుడు. అన్నియు సరిపోవును.

ప్ర:-స్వామీ! మనస్సునావిధముగా వశపఱచుకొనుటకు శక్తి చాలకున్నదే! ఏమి చేయవలెను?

ఉ :-విశేషముగా సత్పురుషుల సాంగత్యమున వర్తించుచు వారు చెప్పు హితబోధల వినుచుండండి.

ప్ర:-శివశివా! అట్లు విరామముగ వచ్చుటకు నాకు దీరిక లేదు స్వామీ!

ఉ :-అట్లయినచో తప్పక యీ తిప్పలే పడుచున్నను ఆ యిష్టకష్టములను గూర్చియే నీలోని భగవంతునితో మొరబెట్టుకొని యేడ్చుచుండుము. ఇతరులతో నెప్పుడును చెప్పుకొనవద్దు. అపుడు నీ హృదయేశుడు దయదలచి సమాధానమిచ్చును. క్రమముగా శాంతి లభించును.—అని నచ్చజెప్పి కొన్ని హిత వాక్యములజెప్పి పంపిరి.

ప్ర :-(మరొకరు) ఈ బ్రహ్మవిద్య (వేదాంతము) ఈ చిన్నవయస్సునుండియే నేర్చుకొనవలసిన యావశ్యకతయేమి! పెద్ద వయస్సైనపిదప నేర్చుకొన్నచో రాదా?

ఉ :-పెద్దవయస్సు వచ్చువఱకు బ్రదుకుదునని నీకు నమ్మకమేమి?

ముందేమగునో తెలియదు. "సహస్రప్రమాణం జంతూనా ముత్త రక్షణజీవనే" "అయుః పరిస్రవతి భిన్నఘటాదివాంభః" అన్నట్లు ఉత్తరక్షణము జీవించియుందుననుటకు ప్రమాణమే లేదు. రంధ్రముబడిన కుండయందలి నీరు క్రమముగా గారిపోవునట్లు క్షణక్షణము ఆయుస్సు క్షీణించుచున్నది. ముందు గతులు తెలియవు గాన నన్నివిధముల బాగుగనున్నపుడే బాల్యముననే బ్రహ్మవిద్య పట్టువడవలెను. బాల్యమునందంటిన విద్యయే విద్య. ముదిరిన పిమ్మట చక్కగా నంటదు. ముదిరిన గుడ్డ రంగంటనట్లు అపుడు బ్రహ్మవిద్య యలవడదు.

ప్ర:-అయితే గీతలో "స్థిత్వాస్యా మంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" (గీ. 2-72) అని భగవంతుడు చెప్పినాడు గద స్వామి!

ఉ:-అచ్చట చెప్పినది నీ యభిప్రాయానుసారం గాదు. ఆ స్థిత ప్రజ్ఞుని జ్ఞానమహిమను వర్ణించుచు నీ స్థితి యంత్యకాలమున్ననైనను బడసి ముక్తులు కావచ్చును. అనగా నారంభమునుండియు నా పని చేయుచుండినవానికే యంతిమ స్మృతి గలుగును గాని యెప్పుడో తీరికగలిగి విషయభోగములుపభోగించుట కసమర్థముౖలై పనికిరాని బుద్ధీంద్రియములతో విగతవయస్కుఁడై ముసలితనమున తెలియఁగోరిన నది తెలియబడదు. అట్లనుకొనకుము. సంతతాభ్యాసవశమున నిది లభించును. "నాయమాత్మా బలహీనేన లభ్యః" అని కఠోపనిషత్తు చెప్పినది యీ యాత్మబలహీనునకు, ఇంద్రియవిషయలాలసులకిది లభించదు అని గ్రహించవలెను.

ప్ర:-(ధనికులొకరు) స్వామీ! పుత్రులు లేనివారికి గతులు లేదని చెప్పెదరే! దీని యర్థమేమి?

ఉ:-అయ్యా! గతులు లేకేమి? అనేక బ్రహ్మచారులు సంన్యాసులు-వీరికే పుత్రులు కలరు? ఎందరో గృహస్థులుకూడ పుత్రులు లేకపోయినను వారు పరమగతి యనదగు ముక్తినందినట్లు వినబడుచున్నది. ఇందలి ముఖ్యార్థము తత్త్వజ్ఞానోదయమే. సుపుత్రసంతానము. మరియు "అపుత్రస్య గతిర్నాస్తి" అన్న మాట గౌణము. దాని తాత్పర్యమేమన తన స్వార్థమును విడిపించుచు విరక్తిని బుట్టించు నుపాయమున మోక్షార్థమయ్యే పుత్రులు గావలెనని చెప్పినదే గాని కేవల మాంసమయపుత్రుని పొందినమాత్రమున ముక్తి గతి యని యెన్నటికి నమ్మవలదు. తత్త్వార్థము తత్త్వజ్ఞానమును బడయుంటే పుత్రత్వము.

ఈ స్థలమున నిట్లు పెక్కండ్రు మంచివారు, పండితులు సామాన్యులు మున్నగు భక్తులెందరో వచ్చి పోవుచుండిరి. స్వామి కన్నివిధముల తోడైయుండిరి. సర్వవిధముల శివంకరమైన యా ప్రాంతముల వివిధాచార సంస్కారయుతలం గాంచుచు మేర దప్పక తమ యనుష్ఠానాధ్యయనాది కార్యముల సక్రమముగా నెరవేర్చుచు పరమతృప్తిగా నా యేటి చాతుర్మాస్యవ్రతము నా యేటి యెుడ్డున జయప్రదముగా జరిపి శాంతిజేసి శాంతినందిరి. "దేశం చూడాలి కోశం చదువాలి"అను సామెతను చక్కగా కార్యరూపమున జూచిరి.

పిదప నంజనగూడు భక్తాదులకు ధన్యవాదశుభాశీస్సులొసంగి యటనుండి బయలుదేరి మైసూరు గోవిందప్పగారి గృహమునకు

వచ్చిరి. వారి యాతిథ్యమును స్వీకరించిరి. "శివం భూయాత్" అని శుభాశీస్సుల పల్కి వారి కృతజ్ఞతననుస్మరించుచు నచ్చటి సుప్రసిద్ధ గీతాప్రచారిణీసభా సంచాలకులు పండితులు మహనీయులునగు పూజ్యపాద పరమహంస శ్రీ శ్రీ శ్రీ శంకరానందభారతి స్వాములవారినిదర్శించి వారి యాశ్రమముననే కతిపయదినంబులు వసించుచు సనాతన సదాచార పరులగు నా పండితవర్యుల బోధలందుకొనుచుండి యటనుండి నంద్యాల భక్తుల ప్రార్థనానుసారము శ్రీ త్యాగరాజస్వామి యారాధనకు వచ్చిరి.

## ౧౫. శ్రీ శైలసందర్శనము

నంద్యాల త్యాగ కుటీరమునందలి యారాధన జరిగిన పిమ్మట కొంతకాలమిట నైష్కర్మ్యసిద్ధి గ్రంథప్రవచనమును గావించిరి. పిదప శ్రీ నెరవాటి బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారి యుత్తమ ప్రేరణానుసారము వారి సహాయమున తమ యిష్టదైవంబగు శ్రీ శైల మల్లికార్జున మహాలింగమును దర్శింప శ్రీ శైలపర్వతమునెక్కి స్వామిని దర్శించి శ్రీ రుద్రపురుషసూక్తంబులచే మనసార పూజించి,

"శార్దూలాజిన చేలపూర్ణకరుణాఽఽశ్రిత్యాతిభక్త్యా మహత్
స్థానంత్వాం బసవాదయో యయురియాయాఖ్యాదేవీ పరం।
ఆచార్యత్వమవాప శంకరయతిర్జిత్వా భిదావాదినో
భావత్కం కిము పేశసేఽముకగిరిం శ్రీగిర్యగారేశ్వర ॥"

అని భక్తిభావమున నైవేమఱచి స్తుతించి ధ్యానించి ధన్యులైరి. మరియు సూర్యసింహాసనాధీశ్వరులగు శ్రీశైల ౧౦౮ శ్రీ శ్రీ శ్రీ

జగద్గురు వాగీశపండితారాధ్య శివాచార్యస్వాములవారిని సందర్శించి విద్యానిధులగు నమ్మహాసన్నిధి ప్రేమకు బాత్రులై వారియుపదేశములంది యాశీర్వాదమును బడసి బయలుదేరి నంద్యాలలో శ్రీ బాలసుబ్బయ్య శ్రేష్ఠి మున్నగువారికి తీర్థప్రసాదంబులొసంగిరి.

పిమ్మట శ్రీవారు నంద్యాల సమీపమునగల పెద్ద కొట్టాలయను గ్రామమున ఉత్తమభక్తులగు శ్రీ ఎస్. లింగారెడ్డిగారి తోటలో నందరు సంతసింప "గీతాకుటీరము" నొకటి స్థాపించిరి. పిమ్మట నేరుగా అటనుండి శ్రీ శివలింగాశ్రమమునకు విచ్చేసిరి.

## ౧౯. శివలింగాశ్రమము—శంకరజయంతీ మహోత్సవము

ఇచ్చటి భక్తులందరును పరమభక్తితో శ్రీ స్వామివారి యాత్రా విశేషములన్నియును విని సంతసిల్లిరి. శ్రీవారు తమ పద్ధతిననుసరించి శాస్త్రప్రవచనాది కార్యములను జరుపుచుండిరి. కొన్నాళ్ళకు చింతలాంపల్లె పి. నరసింహప్ప, చిన్నకదిరెమ్మ అను పుణ్యదంపతులకు శ్రీ శంకరానుగ్రహమున పుత్రుడుదయించెనను సంతసమున వారు మన శ్రీవారి సన్నిధికి వచ్చి, "స్వామీ! తమ యనుగ్రహమున మాకు మగబిడ్డ గలిగె. ఈ యేడు తామిచటనేయుండి శ్రీ శంకరజయంతి మహోత్సవమును జరుపవలె"నని గోరుచు అయిదువందల (500) రూపాయలను శ్రీపాదముల కడ సమర్పించి నమస్కరించిరి.

ఇది చూచి మన స్వామి యీ పుణ్యదంపతుల త్యాగమునకు సంతసించి మంచిదని యీ విషయమును తమ పూజ్యగురువులతో

నివేదించుకొనగా వారును ముందుగనే యాశ్రమమునకు విచ్చేసిరి. మరియు పూజ్యపాద (గుడివాడ) శ్రీ శ్రీ శ్రీ ప్రణవానందస్వాముల వారికిని సవినయముగా లేఖద్వారా విన్నవించుకొనగా వారును పరమకరుణతో శ్రీ శివలింగాశ్రమ భక్తుల కోర్కెను మన్నించి సకాలమునకు దయచేసిరి. శివలింగాశ్రమమంటే ఈ స్వామివారి కత్యంత ప్రేమ. అటువలె ఇంకను రావలసిన శ్రీ సాధు శివారెడ్డి గారు మున్నగు సాధువులు, స్వాములు తక్కిన భక్తులును నంద్యాల, గుంతకల్లు ఉరవకొండ రాగులపాడు మున్నగు ప్రాంతములనుండి విచ్చేసిరి. చుట్టుప్రక్కల జనులు చేరిరి. మహా సంభ్రమమున కార్యక్రమము శ్రీ సర్వధారినామ సం॥ వైశాఖ శుద్ధ పాడ్యమి ఆదివారం (తే. 9-5-1948) మొదలు 13-5-1948 గురువారం వరకు సర్వజనానందకరమై విధ్యుక్తముగా శ్రీ ఆచార్య స్వామిపూజ, ఉపనిషద్గీతాపారాయణము, శ్రీ శంకరవిజయ పురాణశ్రవణం మరియు వచ్చిన మహాత్ములచే రెండుపూటల కర్మభక్తి జ్ఞానయోగములంగూర్చి యుపన్యాసములు మున్నగు కార్యక్రమములతో సాంగమంగళప్రదమై సమాప్తియయ్యెను.

ఆ కడపటి రోజు శ్రీ శంకరజయంతి (తే. 13-5-1948వ గురువారం) మహాపర్వదినమున శ్రీ శంకరానుగ్రహమున నుదయించిన బిడ్డకు "శ్రీ శంకర" అని నామకరణము గావించిరి. ఇదే సమయమున పూజ్యశ్రీ చిదానందస్వాములవారు జగద్గురు శ్రీ శంకరాచార్యులపై యొక మహామంగళమును కన్నడ భాషలో రచించి యిట్లు పాడిరి.



జయతు మంగళ శ్రీ జగద్గురు శంకరాచార్యప్రభో !
జయతు షణ్మతగళిగె రక్షక। భయవిదూర మహాప్రభో ॥ప॥

బేడె భిక్షెయ నెల్లికాయియ। నీడలవళదరిద్రమం।
దూడి హేమామలక వర్షవ। నాడె సురిసిద హేప్రభో ॥౧॥

బాల్యదోళ్ సంన్యాసవను ౯కె। కొళ్ళుతాగమ వేదదోళ్।
ఉళ్ళప్రౌఢార్థగళరిదు నిజ। మెల్లలోకక్కరుహిదెయ్ ॥౨॥

శ్రుతివిరుద్ధ మెనిప్పనాస్తిక। మతవ దుష్కర్కంగళ।
అతిగళెదు బ్రహ్మాత్మసంస్థితి। క్షితియొళెల్లర్గసిరిదెయ్ ॥౩॥

సుకరవేదాంతాబ్ధిగతమా। దఖిలజ్ఞాన సురత్నవ।
నకుటిలర్గొలిదిత్తు సంస్కృతి। వికళతెయపరిహరిసిదెయ్ ॥౪॥

మతియ శుద్ధిగె కర్మ; నిశ్చల। స్థితిగె ధ్యాన; పవర్గకె।
శ్రుతివిదితసుజ్ఞాన; వెందతి। హితదె సారిదె లోకదోళ్ ॥౫॥

మూరుసల భరతావనియ సం। చారగెయ్దద్వైతవ।
సారివేదాంతార్థనిశ్చయ। భేరి బారిసి దిశెయొళు ॥౬॥

అర్ధశ్లోకదె బ్రహ్మవిద్యెయ। శుద్ధమతిగళిగుసిరిదెయ్।
మధ్యమందర్గఖిలగ్రంథగ। ళాద్యుపకృతియ నెసగిదెయ్ ॥౭॥

కర్మధర్మద రూపదెంబువ। కర్మిమండన మిశ్రగె।
కర్మసంన్యాసత్వదిం ౯నె। ష్కర్మ్యసిద్ధియనిత్తెయొ ॥౮॥

సూత్రమొదలాగిర్ప ప్రస్థా। నత్రయప్రామాణ్యదిం।
ధాత్రియొళగద్వైతమతవను। చిత్రిసిరువె జగద్గురో ! ॥౯॥

దిట్టతరనాల్కాశ్రమగళను। కట్టినాల్దెర దిక్కినోళ్।
శ్రేష్ఠసంన్యాసిగళిగల్లియొ। పట్టికట్టిదె హే ప్రభో ! ॥౧౦॥

నిన్నచరితెయనోది తిళియువ| మాన్యనవనే ధన్యను|
నిన్నచరణాబ్జవను నంబిరు| వెన్నరక్షిసు శంకరా! ||౧౧||
భక్తికృతశంకరజయుంతిసు| యుక్తనేవెయ మన్నిసె|
భక్తశివలింగాశ్రమస్థర| రక్తిరక్షిసు హేప్రభో! (సద్గురో) ||౧౨||

అయితే జయంతీ మహోత్సవము అయిదువందల రూపాయ లతో ప్రారంభమైనది అయిదు రోజులలో రెండు వేలకు పైగా ఖర్చాయెను. అచ్చట చేరిన యుత్తమ భక్తులందరు నీ ఖర్చు లను భరించిరి. కార్యము సమాప్తము కాగానే భక్తులందరు స్వస్థానముల జేరిరి. ఈ యేడు మన శ్రీవారు శ్రీచాతుర్మాస్య వ్రతము నిచటనే జరుపుకొనుచు గీతాభాష్యశ్రవణమును గావించి యందరిని పరమతృప్తిం బొందించిరి. వ్రతము యథారీతి శివదమై పూర్ణమాయెను. అంత నొకనాడు భక్తులొకరిట్లు స్వామిని ప్రశ్నించిరి:—

ప్ర:—స్వామీ! మంత్రమును సర్వకాలములయందును జపించు చుండుమని మీరు చెప్పుచుందురే! అట్లయిన దానికి స్నానశౌచాదినియమము లవసరము లేదా?

ఉ:—ఆ నియమములుండిన మంచిదే; కాని లేకున్నచో దోష మేమియును లేదు. సత్యమగు ఫలము తప్పదు. మంత్ర మునకు మైలలేదు. "నాస్య విధిరితి సర్వదా శుచిరశుచిర్వా పఠన్ బ్రహ్మణః సలోకతాం సమీపతాం సరూపతాం సాయుజ్య తామేతి" అన్నట్లు భగవన్నామమును సదా జపించుటకా కట్టుబాట్లేమియు లేదు. జపించుటచే మహాపుణ్యమే వచ్చును. అట్లనే జపించుచుండిన ఈ ప్రశ్న పుట్టదు.

ఆ ఘనతను గన్నవానికి కశ్మలమగపడదు. నీ నాలుక నీ యందే యుండుచు ఎంత యెంగిలి గలిగియుండినను అయ్యది యశుచి గానేరదు. ఆ ఎంగిలి వెలువలబడిన యాచోటు అశుచియగును. అటువలె భగవన్నామమును నీ వాక్కునందిడుకొని నమలుచుండిన నది యెన్నటికి నెంగిలిగాదు; అశుచిగాదు. ఆ నామమును విడిచి నీవు వర్తించినచో నశుచివగుదువు. భగవన్నామము నిత్యశుద్ధము. సదా జపించుచుండినచో నీ వత్యంత శుచిర్భూతుడవగుదువు. ఆ భాగ్యమబ్బిన నింకేమి కావలె?-అనిరి.

పిమ్మట నంద్యాల భక్తుల ప్రార్థనానుసారం అటకు వెళ్ళి శ్రీమతి పగిడి శాయమ్మగారి మేడయందు గొన్ని దినంబులు నైష్కర్మ్యసిద్ధి నిగూర్చి ప్రవచించుచుండిరి. అంత నొకనాడు స్వామితో నుత్తమభక్తులొకరిట్లు ప్రశ్నించిరి:—

ప్ర:—"శివోహం"—అనుట సిద్ధలక్షణమేనా స్వామీ?

ఉ:—సిద్ధుడు శివోహం—అనిగాని రామోహం—అనిగాని యనడు. సర్వాహమ్ములు తానైయుండగ విడిగ నింకే యహము నేననును? సర్వము తానే గావున నేమి యునడు. మూగివాని నోటిలో మిఠాయి బెట్టి రుచినడిగినట్లు మహానఘనానందాబ్ధి యతడు.

ప్ర:—స్వామీ! ముక్తికి మంచి మార్గమెద్ది?

ఉ:—తత్వజ్ఞానమే. ఆ పిదప నింకా కొంచెమెక్కువగా జెప్పవలెనన్నచో నిర్మమత్వమే నిరహంకారమే ముక్తికి మార్గము. అహంమమకారములే బంధములు.

# ౨౦. రమణ దర్శనము

త్యాగ కుటీరమున గీతాభాష్య ప్రవచనము జరుపుచుండ కొన్ని దినములకు ఆత్మీయులగు శ్రీ బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారు తాము సకుటుంబముగా తిరుపతి యాత్ర వెడలుచు స్వామిని గూడ వెంట రావలెనని బలాత్కారముగా కోరిరి. అందఱు కలిసి వెంటనే శ్రీ తిరుపతియాత్ర వెడలిరి. అటనుండి శ్రీ స్వామివారు శెట్టిగారితో కలసి శ్రీ వ్యాసాశ్రమము, కాళహస్తి కైలాసాశ్రమము మున్నగు స్థానములకు వెళ్ళి అందరిని దర్శించి మఱల తిరుపతి వచ్చిరి. కాని శ్రీ శెట్టిగారు నంద్యాల వెళ్ళుచు మన స్వామిని శ్రీ రమణాశ్రమమునకు మఱలవెళ్ళి శ్రీ రమణభగవానులను దర్శించి రండని పరమప్రీతితో బంపించిరి.

వారి మాటప్రకారం పరమసంతోషముతో శ్రీవారు అరుణాచల వాసియగు శ్రీరమణసన్నిధి జేరిరి. భగవానుల దర్శించి ధన్యుడనని ప్రశాంతముగా నాశ్రమమునందు మూడు రోజులుండుచు మఱలి వచ్చునాడు హృదయముప్పొంగ, జిజ్ఞాసతో నిట్లడిగిరి :—“భగవాన్ ! నే సదా యాత్మతృప్తి యాత్మరతి యనదగు బ్రహ్మనిష్ఠ యందే యుండవలెనను తీవ్రేచ్ఛచే ప్రయత్నించినను మఱల వృత్తి యంతరాయమును పొందుచున్నదే! ఇందులకేమి జేయవలె? అనుగ్రహింప వేడుచున్నాడ”నని హృదయావేదనతో నడిగిరి. అందులకా కరుణానిధి యనుగ్రహదృష్టితో మన స్వామివారిని సారించి వీక్షించుచు, “ఆఁ! అట్టి స్థితిని పొందగోరుచున్నావా? ఇది యంతరాయమని నీ యంతరాత్మకు దెలియుచున్నది గదా! అదే వృత్తిని పదే పదే ఆవృత్తి చేయుచుండినచో అంతరాయముల

ణగిపోవును. అపుడే "ఆత్మన్యేవాత్మనాతుష్టః" అను స్థితి గలుగును"— అని చెప్పి మాటల ముగించి మౌనమును వహించిరి. "....... ణౌను గాదనక యూరకుండె నత్తె, బంగు గని సంతసిల్లి రా రమ ణులెల్ల"—యను నాంధ్ర సాహితీకారుని వాక్యమును మనమున దలంచి మహాతృప్తితో నిట్టి స్థితియే నీవని చివరకు మౌనము ద్వారా భగవానులు దెలిపిరని తలంచి యాస్థితి ననుసంధానముఁ జేయుచు, సాష్టాంగవందనములాచరించి నంద్యాల వచ్చి జేరిరి.

ఇచ్చట శ్రీ త్యాగరాజస్వామి యారాధన యింకనూ 5-6 దినము లుండెను. ఇంతలో నొకనాడు మన స్వామి తమ కుటీరమునందు శుభస్వప్నమొకటి గనిరి. ఏమన "తాము రెండవసారిగా కాశీక్షేత్ర మునకు వెళ్ళినట్లును, పావనగంగయందు స్నానమాచరించి నిష్ఠలో గూర్చుండినట్లును, అచటి యున్నత పాఠశాలలయందు బ్రహ్మ సూత్రభాష్యము శ్రవణము చేయుచున్నట్లును, సంస్కృతభాష నభివృద్ధి జేసికొనుచున్నట్లును" కలగనిరి. ఇదే కారణమున స్వామికి మరల కాశికి వెళ్ళవలెనను సంకల్పము గలిగెను. మరియు నొక సంవత్సర కాలమచటనే యుండి శ్రీ చాతుర్మాస్యమహావ్రత మునచటనే జరుపవలయునను తీవ్రేచ్ఛపొడమెను. కాని ఈ విషయమును వెలిబుచ్చినచో ప్రయాణమునాటంకపరచువారడుగ డుగునను కలరు గాన గుప్తముగానుండి ప్రయాణసన్నాహముల సిద్ధపరచుకొనిరి.

భక్తులగు శ్రీ అయ్యపుశెట్టి పుల్లయ్య అనువారికి మాత్రమీ విషయమును తెలియఁబరచిరి. విన్నవెంటనే యా భక్తులు పరమ సంతోషముతో శ్రీవారి ప్రయాణఖర్చులకై నలుబది రూపాయ లను తెచ్చి యప్పుడే భక్తితో సమర్పించిరి. స్వామివారి యున్నతో

ద్యమమునకు తోడై గుప్తముగా నుండిరి. ఈ సమయమున నిండు ప్రేమతో గుప్తదాన మొసంగిన యాతని దాతృత్వ మెంత మంచిదోగదా! మరల కాశికి వెళ్లి యొక్క సంవత్సరకాలమట విద్యావ్యాసంగముతోఁ బాటు తపమాచరించి వచ్చు మహాపుణ్యమాదాన గర్భమునందుండెను.

ఇంతలో శ్రీత్యాగరాజస్వామి యారాధనామహోత్సవము సమీపించెను. గురువరేణ్యులగు శ్రీ సదానందస్వాములవారును, ఆళ్ళగడ్డ శ్రీ శంకరానందస్వాములవారును, శ్రీ చిదానందస్వాముల వారును, సాధు శ్రీ శివారెడ్డిగారు, గీతాభినయ శ్రీ గీతానందులు, బళ్ళారి కాలవ సుబ్బన్నగారు మున్నగు భక్తులెల్లరు సకాలమునకు విచ్చేసిరి. ఆరాధనా మహోత్సవము సక్రమముగా ప్రారంభమై మహాత్ముల యుపన్యాసములతోను, సంగీతగీతాభినయములతోను కార్యము పూర్ణమాయెను. ఆ రాత్రికే ప్రయాణము నిశ్చయించి సిద్ధపఱచుకొనియుండిరి గాన అందఱు పరుండిన పిదప "శివాయనమః" అనుచు పెద్దలందరికి వందనమాచరించి, గురుః చరణసన్నిధిని గొంతసేపు నిలుచుండి "ఓం తత్సత్" అనుచు నమస్కరించి, విద్యావ్యాసంగము గోరి కాశీక్షేత్రమునకు వెళ్ళ దలంచి నంద్యాల స్టేషనుకు వచ్చి యచ్చటినుండి నేరుగా రైలు టిక్కెట్టునొకటి కొని బండినెక్కిరి.

ఉదయమున కుటీరమునందు జూడ శ్రీ శంకరానందగిరి స్వాములవారు కనుపించలేదు. దిగులుపడి యెక్కడయుని యాలోచించుచు వెదకుచుండగా గుప్తదానమొసంగిన శ్రీ పుల్లయ్య శెట్టిగారు వచ్చి ఉన్నసంగతిని విశదపఱచుచు "మేము వెళ్ళ

వలెకు ఎవరికిని చెప్పగూడదని స్వామివారాజ్ఞ జేసియున్నందున నే ముందు జెప్పలేదు''-అని వినయముతో పల్కిరి.

ఈ మాటలు విని శ్రీగురుదేవుడు మున్నగు మహాత్ములందరును తమలో,

''వీరి ప్రారబ్ధము శ్రీశుకులవంటిది, ఒకరికి చిక్కువారు కారు. దేశాటనము జేసి పెక్కు దేశికుల సందర్శించి తమ భావి జీవితమునకు వలసిన విద్యాతపస్సులనార్జించుచున్నారు. మంచిదే! వారి యుద్యమమునకు భగవంతుడు దోడ్పడు గాక. మాకు తెలిసి పోయియుండిన బాగుండెడిది; కాని మంచిదే''—అని మాట్లాడుకొనిరి.

## ౨౧. కాశీవిశ్వారాధ్య గురుకులవాసము

మన శ్రీవారు నంద్యాలలో బండినెక్కి నాలుగు రోజులలో సుఖముగా కాశిజేరిరి. శ్రీ జగద్గురు విశ్వారాధ్య గురుకులము శ్రీ జంగమవాడి మఠమును జేరుకొనిరి. ఇప్పుడిచ్చట జగద్గురువులై యుండిన శ్రీస్వాములవారు ముందున్నవారు కారు. ఈశ్వరేచ్ఛచే ముందున్నవారు కీర్తిశేషులైయుండిరి. ఇప్పుడున్నవారో అట్టి శక్తి సంపద్విశిష్టులును, పరమశాంతస్వరూపులును, విద్యావంతులునగు ౧౦౮ శ్రీ శ్రీ శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములు జగద్గురు పీఠమునలంకరించియుండిరి. ఇట్టి ప్రసన్నమూర్తులగు శ్రీజగద్గురుస్వామిని దర్శించుటకై తమ మిత్రులగు పండిత శ్రీ సిద్ధరామశివాచార్యులతో గూడుకొని మహాసన్నిధికి వెళ్ళి దండప్రణామములాచరించిరి.

అనంతరము శ్రీ జగద్గురువులు వచ్చిన మన స్వామిని గూర్చిన

యన్ని సంగతులు విశదముగ తెలిసికొని ముదమున మందహాస మొనర్చి "మంచిదే! కష్టించి విద్యాతపస్సులనార్జించండి. గురుకులనియమముల ననుసరించండి." అను కొన్ని మాటలజెప్పి వసించుటకు ప్రౌఢవిద్యార్థుల వాసస్థానమగు పై యంతస్తున నొక ప్రశాంతమగు గదిలోనుండ నియమించిరి.

ఈ గదియో మహాప్రశాంతమైనది. ప్రక్కనే శ్రీశైలజగద్గురుస్వామివారి సోదరులగు పండిత శ్రీ గురుసిద్ధస్వామి B.A., విద్యార్థుల గది; మూడవది పండిత శ్రీ సిద్ధరామ శివాచార్యులవారిది; ఇక చుట్టుప్రక్కల నున్నత ఛాత్రనివాసమే. ఇట్టి పవిత్రమగు నేకాంతస్థానము. ఉత్తమ విద్యార్థి జనసంసర్గమున కనుకూలమైన యీగది నిప్పించినందులకు శ్రీ స్వామివారపారముదమంది, "జగదీశా! విశ్వేశా! ఇదంతయు నీ కృపామహిమ" యని నుతించిరి.

ఏకాంతస్థానమున నిట్లు వసించుచు తమ నిత్యకార్యక్రమములనిట్లు పరిపాలించుకొనుచుండిరి; గంగాస్నానము, విశ్వేశ్వర సందర్శనము, రెండుపూటల నియమితకాలములందనుష్ఠానము, గురుకులమున శ్రీ పండిత సిద్ధరామ శివాచార్యులు శ్రీ గంగాధర శర్మ వీరియొద్ద ఉ. 10 గంటలవఱకు కావ్య వ్యాకరణసూత్రపాఠములు, వేదాంతపరిభాష మున్నగు సాహిత్యముల జెప్పించుకొనుట; పిదప 11 గం. కు భోజనం; అనంతరం విద్యాలయములకు* వెళ్ళి యున్నతాధ్యాపకులు ప్రౌఢవిద్యార్థులకు దెలుపు నువ

*ఇచ్చట ఉత్తమసంస్కృత విద్యాలయములు పెక్కులుగలవు, మంచి వారెవరైనను అక్కడ వెళ్ళి పాఠములు వినవచ్చును. ఎట్టి యభ్యంతరమును లేదు. అనుభవులగు వృద్ధులు అధ్యాపకులుగానుందురు. భాష్యముల నత్యుత్తమరీతిని బోధించుచుందురు.

నిషత్సూత్రపాఠముల శ్రద్ధతో వినుచు విషయముల సంగ్రహిం చుట; సాయంకాలము పట్టణమున నచ్చటచ్చట జరుగు సభలకు వెళ్ళి మహాత్ముల, పండితుల యుపన్యాసముల వినుట; (తఱచుగా శ్రవణమున్నకై శ్రీ గీతామందిరమునకు పోవుచుండిరి) 7 గం.కు మఠముజేరి తమ నిత్యానుష్ఠానమును ముగించుకొని 9 గం.కు ప్రసాదమును స్వీకరించుట; పిమ్మట 10-30 గం. వఱకు ముందు పాఠముల నవలోకించుట—ఇది శ్రీవారి నిత్యప్రణాళిక. అపుడపుడు శ్రీరామకృష్ణ మఠమునకు వెళ్ళి యా మహా మైదానమున జదువుకొనుచు హాయిగా నుండెడివారు.

ఇట్లు తమ కాశీవాసమును గూర్చి విద్యానిధులగు ౧౦౮ శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారికిని, తమ గురు వరేణ్యులగు పూజ్యపాద శ్రీసదానంద స్వాములవారికిని భక్తిపూర్వకముగా పత్రముద్వారా తెలుపుకొనిరి. నంద్యాల కుందనకుర్తి మున్నగు స్థలములలోగల తమ యాప్తులకును విషయమును తెల్పుకొనిరి. శ్రీవారి శుభసంకల్పము నభినందించుచు తమ మిత్రులనుండి జాబులువచ్చెను. హితైషుల నుండి శుభసందేశములును వచ్చినవి. మరికొందరు పెద్దలనుండి ఆశీర్వాద రూపవములైన పత్రము లందినవి. తాముబూనిన మహాకార్యమున సర్వవిధముల ప్రోత్సాహము కలుగుచున్నందులకు శ్రీవారు మిక్కిలి సంతసించిరి. తమకర్తవ్యనిష్ఠయందు మగ్నులై చక్కగా నిర్వహించుచుండిరి. అంత కొన్నాళ్ళకే శ్రీశైల జగద్గురు స్వాములవారు మన శ్రీవారికిట్లు కన్నడమున శుభాశీర్వాద లేఖనొకటి పంపిరి.

కాశిలో గ్రంథవ్యాసంగము చేయుచున్న



శ్రీవారు

ಶ್ರೀಶೈಲ ಜಗದ್ಗುರು ವಾಗೀಶಪಂಡಿತಾರಾಧ್ಯ ಮಹಾಸ್ವಾಮಿಗಳವರು
ಶ್ರೀ ಜಗದ್ಗುರು ಶ್ರೀಶೈಲ ಸೂರ್ಯಸಿಂಹಾಸನಮಠ
ಆತ್ಮಕೂರು (ಜಿ. ಕರ್ನೂಲು) ಗುಂತಕಲ್ಲು (ಜಿ. ಅನಂತಪುರ)
Shree Jagadguru Sreeshail Suryasimhasana Mott.
12-2-49, Camp

అనగా,

శ్రీ జగద్గురు పండితారాధ్యో విజయతే
శ్రీశైల జగద్గురు వాగీశ పండితారాధ్య మహాస్వాములవారు
శ్రీ జగద్గురు శ్రీశైల సూర్యసింహాసన మఠము
తే. 12—2—49 గుంతకల్లు

"స్వస్తి ! తమ 27—1—49 వ జాబువలన అంతయు తెలిసి పరమ సంతోషమయ్యెను. శ్రీ జగద్గురు విశ్వారాధ్యుల ఆశ్రయమునందు తమ సాత్వికానుష్ఠానము జరుగుచుండుట మిక్కిలి ఆనందము. శ్రీ విశ్వనాథుడు మీ సదిచ్ఛను సఫలము జేయుగాక. మీ (అధ్యయన) అనుష్ఠానములు జగద్ధితకరములగు గాక............"

అను నిట్టి యుత్తరము ఇచ్చటి శ్రీ జగద్గురు మహాసన్నిధికి వచ్చెను. వెంటనే మహాసన్నిధివారు మన శ్రీవారిని పిలిపించి

చిరునవ్వుతో, "శ్రీశైలమహాసన్నిధి యవరింద నిమగె ఆశీర్వాద పత్ర బందిదె" (అనగా శ్రీ శైలమహాసన్నిధివారినుండి మీకాశీర్వాద పత్రము వచ్చినది) అని చెప్పి జాబునిచ్చిరి.

ఈ శ్రీ ముఖమును గాంచి శ్రీవారు పరమానందభరితులైరి. మరియా యుత్తరువును జూచి తమ మిత్రులెల్లరు మిక్కిలి మక్కువతో జదివి సంతసించిరి. మనస్వామి యా లేఖనద్దమునందు భద్రముగా నుంచినారు. పిమ్మట కొన్ని దినములకు స్వామియందు విశ్వాసముగల నంద్యాల, కొట్టాల, బళ్ళారి, కుందనకుర్తి, మైసూరు, పెద్ద బళ్ళాపురం ఈ స్థళములయందలి భక్తులనుండి సుమారు 500 రూపాయులవఱకు వచ్చెను. ఈ ధనమున చాల వఱకు సంస్కృత హిందీ పుస్తకములు, వ్రతసమయమున వలసిన పూజా ద్రవ్యములు: పాలు నేయి మున్నగు ఆహారపదార్థములు వీనికొఱకుపయోగింపబడి యాధనము సత్పాత్రయందు సమర్పితంబై యక్షయమందెను. ఈ క్షేత్రమున శ్రీస్వామి మొట్టమొదట గొన్న గ్రంథము బ్రహ్మసూత్రశాంకరభాష్యము:—3 భాగములు 15 రూపాయులు. ప్రథమభాగమున శ్రీ సిద్ధరామ శివాచార్యపండితులే తమ స్వహస్తముల నీక్రింది శ్లోకమును వ్రాసిరి :—

"శ్రీ శంకరానంద యతీశ్వరస్య, శ్రీ శంకరానక్తసుధీశ్వరస్య ।
శ్రీ బ్రహ్మసూత్రస్యసుభాష్యమేతత్, కాశ్యాంగృహీతం శివదంసదాస్తు"॥

ఈ పండితులప్పుడు వేదాంతాచార్య పరీక్షయందు చదువుచుండెడివారు. కావ్యతీర్థ సాహిత్యశాస్త్రి మున్నగు పట్టపరీక్షలయందు తీర్ణులైన పరమసజ్జనులు. వీరు మన స్వామివారికి మిక్కిలి సహాయ మొనర్చిరి. బ్రహ్మసూత్ర భాష్యపాఠము జరిగెడి విన్స కాలేజి మున్నగు మంచి స్థలముల జూపిరి.

ఆ మహాసన్నిధి గురుకులమున ప్రౌఢవిద్యార్థులందరు కలసి యపుడపుడు నైతికధార్మికాధ్యాత్మికాది విషయములంగూర్చి యుప న్యాసము లేర్పఱచుట యలవాటుగాన నీ విద్వత్సంఘ సమావే శము జరిగెను. కొందరుత్తములుపన్యసించిన పిమ్మట మన శ్రీవారినికూడ మాట్లాడ గోరగా మన శ్రీవారు గురుస్మరణచేసి "గురుకులవాసము" అను శీర్షికపై యీ క్రింది విధముగా నను భవ విషయములతో మృదుమధురభాషతో నొక గంట నేపుపన్యసిం చిరి. దాని సారమిది:—

"ఏచోట ప్రశాంతమయవాతావరణమున ప్రకృతి సౌందర్యముతో విద్యార్థుల విద్యాతపస్సులకు సాధనభూతమైయుండునో ఆ స్థలము గురుకులము. విద్యార్థులు బ్రహ్మచర్యదీక్షతో గురు సమీపమునందు వసించుచు సేవాదులచే నాతని యాదర్శజీవిత మును గడపుకొనుచు గురువు చెప్పినట్లు తపఃస్వాధ్యాయములను దప్పక ఆచరించుచుండుటచే నది గురుకులవాసము—అని చెప్ప బడెను.

మన భారతభూమి గురుకుల సంస్కృతికి పరమ కేంద్రము, పుట్టినిల్లు, మానవాభ్యుదయసభ్యతకు సత్క్రియాచారవిచారము లకునిది మూలస్థానము. ఈ మూలమునుండియే జనజీవిత వృక్షము శోభావంతమై యభివృద్ధినొంది శాంతిసుఖములను పూలుబూచి, యఖండసుఖమనదగు ముక్తిఫలమునిచ్చును. ఇట్టి యుత్తమ భారతీయుల సుసాంస్కృతిక విద్యావినయాదిగుణ పాఠముల గరపుకేంద్రములనే గురుకులములని పిలుతురు. ఇవి ఉపనిషత్కాలమునుండియు సుప్రసిద్ధములు. ప్రతిబ్రహ్మ చారియు 12ఏండ్ల వయస్సుయిన పిదప గురుకులమునకు వెళ్ళి

34సంవత్సరముల వయస్సువచ్చువఱకు వేదాదివిద్యలభ్యసించి గురునాజ్ఞవడసి గృహస్థుడుగనో సంన్యాసిగనో సంస్కారమును బట్టియుగుచుండెడివారు. శ్వేతకేతువు, సత్యకాముడు, ఆరుణి మున్నగువారు ఉపనిషత్తులలోను ప్రసిద్ధులైయుండ వారివిషయము వేరుగా చెప్పనక్కరలేదు. చక్కనిగురుకులములు విద్యాపీఠములు ఎన్నియోయుండెనని తెలియవచ్చుచున్నవి. వానిలో తక్షశిల, విక్రమశిల, శాంతిపురి, నలంద మరియు వారణాసి మరికొన్నియు ముఖ్యములు. వానిలోప్రస్తుతము మనమీ వారణాసి(కాశి) శ్రీ జగద్గురు విశ్వారాధ్య గురుకులముననే యున్నామనుట మిక్కిలి యానందదాయకము.

కాని నేడు నవనాగరికతతో నిండిన పాశ్చాత్య భూముల గాలి నీచి పూర్వాచారవిచారము లడుగంటినవి. అయినను మనగురుకులమున నట్టి దుఃఖస్థితిలేక శ్రీ గుర్వనుగ్రహమున నైతికాధ్యాత్మిక విధానములచే శిక్షణ యొసగబడుచున్నందులకు మనము పరమసంతోషమునందవలసినదే! అయినను ప్రచండప్రకృతి వికటతాండవమాడుచున్న యీకాలమున ఎంతటి మంచివారమే యైనను ప్రమత్తులు గాక జాగ్రత్తగలిగియుండవలెను. నేటి విశ్వవిద్యాలయముల, కాలేజీల చట్టముల నతిగ వాడుకొనక ప్రాచీన అర్వాచీన పద్ధతుల నాలోచించి దేశకాలానుసారము ధర్మవిరుద్ధము గానియట్లు చూచుకొని యథోచితముగ చరించవలెను. ఈగురుకుల విద్యావిధానములచే మనము భావిజీవిత పూర్ణ వికసన మొందవలసియున్నది. ఇట్టియుత్తమ గురుకులమున వసించు మనమెట్టి నీతినియమములతో వర్తించవలెనో, ఆ విషయములు మీకు సువిదితంబులే. అయినను గురువులు

చెప్పినచొప్పున ఆ మాటలనే మరల కొన్నింటిని చెప్పుచు విరమించు వాడ.

"బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ" అన్నట్లు బ్రహ్మ విషయకమగు బుద్ధి వృత్తిచే వర్తించుచు అనాత్మవైషయిక వృత్తులు లేక జీవనచరమ లక్ష్యమగు పరమపురుషార్థమునకై పోరాడు పోరాటమే బ్రహ్మచర్యము. తప్పిపోని సత్యమగు బ్రహ్మచర్యమున తపమాచరించుచు సద్విద్యనార్జించు విధానమే నైష్ఠికబ్రహ్మచర్యము. గురుకుల వాసానంతరము గుర్వాజ్ఞను బడసి సద్గృహస్థుడగుట ఉపకుర్వాణ మనియు చెప్పబడును. గురుకులమున పొందబడు విద్యను పూర్ణ విశ్వాసమున పరిశ్రమించి ఆపోశనము జేసికొన్నచో తప్పక మనము విజేతలమైన పరతత్త్వమును గాంచి జీవించియుండగనే యఖండ సుఖమందగలము. "బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపఘ్నత" "బ్రహ్మచర్యేణ విద్యా విద్యయా బ్రహ్మలోకమ్"—అనగా బ్రహ్మచర్యమనెడి తపస్సుచే మృత్యువును జయింపగలరు. బ్రహ్మచర్యముచే జ్ఞానము, జ్ఞానముచే బ్రహ్మప్రాప్తియు గల్గును. అట్టివారు భయమందరు.

మన పూర్వాచార్యులందరును అంత ప్రతిభావంతులై ధైర్యముతో లోకసేవయొనర్చుటకు వారికున్న బలమేమి? గురుకుల వాసమున పొందిన నైతిక ధార్మికాధ్యాత్మిక శిక్షణలే కదా! ఇచ్చట సంపాదింపబడిన ఆత్మబలమే; బ్రహ్మచర్యప్రభావమే. నేడు మన మీ స్థానమున సంపాదించిన తపఃస్వాధ్యాయశక్తులే మన భావి జీవితమునకు భద్రమైన పునాదులు. అట్లు లేక ఈ సుదినము లలో అవినీతిపరులమైన యాంతరంగిక సద్భావములు లేక వ్యర్థ బుచ్చినచో, నికముందు అడుగడుగునకు అనర్థములు, నష్టకష్ట

ములు దప్పవు. అపుడు వానినెదిరించు పటిమ మనకుండదు. ఓడి పోదుము. ప్రకృతిశాసనములతి కఠోరములు. గాన ఇప్పుడే మనమది దెలిసి చక్కని కృషి చేసినచో ప్రకృతియే మాతయై బల మొసగును. కనుకనే ఆర్యసంస్కృతి గురుకులమని పిలిచె.

"యదావై బలీ భవతి, అథ ఉత్థితా భవతి। ఉత్తిష్ఠన్ పరిచరితాభవతి। పరిచరన్ ఉపసత్తాభవతి। ఉపసీదన్ ద్రష్టాభవతి శ్రోతాభవతి మంతా భవతి బోద్ధా భవతి కర్తాభవతి విజ్ఞాతా భవతి।" అనగా మనుజుడెప్పుడు (బ్రహ్మచర్యాది రక్షణోపాయముచే) బలవంతుడగునో, అపుడు లేచి స్వతంత్రముగా నిలుచును. గురుసేవ చేయగల్గును. గురుని సమీపించి ఆ కీలకమును అనగా శ్రోత్రియబ్రహ్మనిష్ఠాపరిపూతం బగు సదాచారసంపదను గని ఆతని బోధలందుకొనును. ఆ యర్థ ముల సాధకబాధక యుక్తులచే మననమొనరించి నిశ్చయించుకొని జ్ఞానియగును. జ్ఞానానంతరము కర్మ బంధకారకముగాదు. అందుచే నాత్మవిజ్ఞానమున స్వధర్మకర్మల యథారీతినొనర్చుచు నిరంకుశతృప్తిరూపకైవల్యమునందును. ఇది ఉపనిషత్కాలమం దలి విద్యావిధానము.

ప్రస్తుత మన్ననో ఈ విధానములు కొంత విస్మరింపబడి శ్రీ రామతీర్థస్వామివారన్నట్లు GOD అను ఇంగ్లీషు శబ్దమును తల క్రిందగా చదివినచో (DOG) గలిగెడి విపరీతార్థమువలె అస్తవ్యస్త మ్మైయున్నవి. గురుకులములు పోయి కురుకులమ్మైనవి. ఇందు వసించు బ్రహ్మచారులు భ్రమచారులై దుర్యోధనాదులవలె నొప్పుచున్నారు. ఈ విషయమున నుత్తములగు మనము పరమ శ్రద్ధనుంచవలెను. ఉత్తమ విద్యార్థులైమె పవిత్రములగు నిట్టి గురుకులములందు వసించుచున్న మన యాదర్శ విధానములను

జూచినవారి నీ స్థలమున కాకర్షించుచునవిగా నుండవలెను. మనస్సు వాక్కు చూపు వినికిడి చేయుకర్మ వేషము ఆహారము—ఈ యన్ని విషయములయందును నిరాడంబరులై యుండవలెను, ఉన్నత విద్యనభ్యసించి యుత్తమోత్తమమగు సత్యపథమున నడచుచుండ వలెను. కావున నిట్టి సుసంపన్నమగు విద్యనార్జింప జగద్వంద్యుడగు గురుపరమాత్మ సమస్వయశక్తిని, అవిచ్యుతశ్రద్ధను మన యందరికిచ్చి గాచుగాతయని జగద్గురు శ్రీ విశ్వారాధ్యగురుచరణోపాంతమున శరణులిడువాడ. మరి యీ యల్పమతి అనంతముగ శ్రీ గురుసన్నిధిని మాట్లాడ నసమర్థుఁడైనది. అయినను తత్కృపా లేశమున యథామతి నేమో బలికితిని. అందేమైన త్రుటులున్నచో నుత్తమపండితులగు తాము క్షమింతురుగాక యని నమోవాకములతో విరమించువాడ. ఓం తత్సత్."

ఈ విధముగా అనర్గళవాగ్ధారతో నుత్తమవిషయము లెన్నియో ఒక గంటసేపుపన్యసించిరి. విద్యార్థులందరు పరమానందమందిరి. వెంటనే ఆ సభలో నిట్లు తీర్మానించిరి.

"శ్రీ శంకరానందగిరి స్వాములవారు ఇకవిూదట మా విద్వత్సంఘమున నొక సదస్యులైరి. మరియు ఆ శ్రీవారు గురుకులము నుండి వెలువడు "విపంచి"యను మాసపత్రికకు వ్యాసములు వ్రాయవలసినదిగా మేము గోరుచున్నాము"—ఇట్లు నిర్ణయించుటయే గాక శ్రీవారి నామమును విద్వత్సంఘసదస్యుల పట్టికలో వ్రాసికొనిరి. విద్యార్థులందరు నీ విధముగా పరస్పరప్రేమాదరణలతో మెలగుచు అప్పుడప్పుడు ఇట్టి సమావేశముల నేర్పఱచుచు నుత్తమ తత్త్వప్రసంగముల స్వామితో ముచ్చటించుచుండిరి. "విపంచి" మాసపత్రికకు 4-5 వ్యాసములు వ్రాసిరి. ఒకప్పుడు

విద్వత్సంఘపు తరపున జబ్బల్‌పూర్ సమావేశమునకు వెళ్ళి వచ్చిరి.

మన శ్రీవారు అమూల్యమగు నీ సమయమును కొంచెమైనను వృథాచేయక దేహమలయునంతవఱకు పరిశ్రమించిరి. అప్పుడప్పుడు తమలో తాము తమ మనస్సుతో నిట్లు చెప్పుకొనుచుండెడివారట,

"ఓ మనసా! ఇచ్చట నిన్నెవరును దండించువారు లేరని సోమరివైయె ఏ విధముగను కాలమును వృథాచేయకుము; వేసటనొందకుము. స్వల్పమగు నీకాలమును సార్థకపఱచుకొనుము. జీవితమున సమయమపూర్వమైనది. గడచిపోయినది రాదు. రాబోవునది తెలియదు. వచ్చిన యిద్దియు నిట్లనే యుండదు. ఇది ప్రకృతి స్వభావము, అనిత్యము, మాయాలక్షణము. అయినను భగవన్నిష్ఠచేత నీ మాయనే యూతగా గొని నీవు మాయాతీతుడవు గావలెను. "అనిత్యమసుఖం లోక మిమంప్రాప్య భజస్వమాం" అన్నట్లు పోవుటకు సంసిద్ధమైయున్న యీ యల్ప సమయమును పొందిన నీవు ఇది గడచిపోకపూర్వమే సదుపయోగమొనర్చుకొని శాశ్వతఫలమును బడయుము. "మాంభజస్వ" అన్నట్టు పరిశ్రమించు విషయమున నీ వేమరుపాటు జెందవద్దు. ఇట్లు లేకున్నచో నీవు ఋణియగుదువు. జీవనమున ఋణము మహాభారము సుమా! కావలసినంత డబ్బు వచ్చె. కోరినట్లుత్తమస్థలము లభించె. గుర్వనుగ్రహమున సర్వసౌకర్యములొదవె. కాన నో మనసా! నీవే మాత్రము ప్రమత్తుడవు గారాదు. "స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం" అను శ్రుతిసూక్తిననుస్మరించుచుండుము. ఓ మనసా! ప్రమత్తతవలన నీకెన్ని నష్టములు సంభవించునో తెలుసా! మొదటిది సమయనష్టము; రెండవది గురుసాన్నిధ్య సేవానష్టము;

మూడవది ద్రవ్యనష్టము; నాల్గవది ఆయుర్నష్టము; అయిదవది మాననష్టము; భద్రము సుమా!'' యని తమలో తాము జెప్పుకొనుచు శ్రీ గురుకృప ననుస్మరించుచు ఆనందాశ్రుధారాపూరితులై భావసమాధినందుచుండెడివారట.

ఈ విధముగ మన స్వామి యచటి మిత్రులు మొదలగువారి కందరికి అతిప్రియులై సన్నియమనిష్ఠలతో నొప్పుచు తమ యధ్యయనమునందు మగ్నులగుచు మౌనముగానుండుచుండిరి. ఇట్లుండ ఒకనాడు విన్సాకాలేజీలో బ్రహ్మసూత్రభాష్యపాఠమునకు వెళ్ళి యందరికంటెను చివర గూర్చుండి వినుచుండిరి. అధ్యాపకులు పాఠప్రసంగమున అధ్యాసవిషయమై చెప్పుచుండిరి. అంత నొక విద్యార్థి ''మహారాజ్! అధ్యాస అధ్యాస యని జెప్పెదరే, శ్రుతులయందు అధ్యాసయనుమాట యెక్కడను వినబడలేదే!'' యని యడిగిరి. అందులకా పండితులు, ''జీ భాయీ! శ్రుతులయందధ్యాసయని రాకపోయినను తదర్థవంతములగు ననేకశబ్ద ప్రయోగములున్నవి. అధ్యాసయనగా ఒకటిని మరొకటిగా తలంచుట. ఇట్టి అర్థమునందే అవిద్య, అజ్ఞానము—అను శబ్దములచే శ్రుతులయందు భాష్యములయందు చెప్పబడినవి. అలాటి శబ్ద ప్రయోగములు వచ్చు ఏదైన యొక ఉపనిషన్మంత్రమును జెప్పు'' డని యడిగిరి. అంత విద్యార్థులింకను ఆలోచించుచుండగనే చివరనున్న మన స్వామివారు కఠోపనిషద్ ప్రథమాధ్యాయము ద్వితీయ వల్లి నాల్గవ మంత్రమగు

''దూరమేతే విపరీతే విషూచీ। అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా।
విద్యాభీప్సినం నచికేతసం మన్యే। న త్వా కామా బహవోఽలోలుపన్త।
(క. 1-2-4)

అనుదానిని ధైర్యముగా తటాలున చెప్పగానే విద్యార్థి బృందము లోనివారుగాక వేరుగా చివర గూర్చున్న యొక సంన్యాసి చెప్పి నందున, విద్యార్థులు ఉపాధ్యాయులు—వీరందరి దృష్టియు మన స్వామివీాద పడెను. ఎవరాయని సారించి చూచుచుండిరి. ఇంతలో నుపాధ్యాయులు ప్రేమతో మన స్వామిని గూర్చి, "మహా రాజ్! ఆప్ కహాం రహనేవాలే హై? ఆప్ కౌన్ హై? క్యా పఢాహువా హై?" అనగా "తమరెక్కడ నివసించుచున్నారు? తమరెవరు? తమరేమి చదివినారు?"—అని యడిగిరి. స్వామివారేదో కొన్ని మాటలతో సంగ్రహముగా విషయముం జెప్పిరి. అప్పుడు వారు "తమకు శాస్త్రసంస్కారము, సుశిక్షణము ఉన్నట్లు కాన్పించు చున్నది. అనుదినము పాఠమునకు వచ్చుచున్నారు. పరమసంతోషము. ఇచట మీకే యభ్యంతరమును లేదు. జంకు లేక లోపలికి వచ్చి గూర్చుండి విని వెళ్ళవచ్చును." అని నిండు ప్రేమాదరణలతో బలికిరి. ఈ పరిచయ కారణముననే తరువాత ఉన్నత విద్యార్థుల గీతా పోటీపఠనసంఘమున శ్రీ స్వామివారికిగూడ స్థానము లభించెను. పోటీలో ప్రథమశ్రేణియందు విజేతలై గీతా శంకర భాష్యగ్రంథమును, వెండిపతకమును బహుమానముగా పొందిరి.

ఇంకొకమారు కాశీ సంన్యాసీకాలేజియొక్క వాగ్వివర్ధినీ సభ యందు తమకొసంగబడిన నియతమగు నల్పసమయమున సంగ్రహముగా సంస్కృతభాషయందు పండితులు సంతసిల్ల, తోడి విద్యార్థులు ముదమంద శ్రీవారిట్లు పన్యసించిరి :—

విషయము:—కానామ నీతిః? నీతియనగానేమి?

ఓం తత్సత్—"అయి అధ్యక్షమహోదయాః! చిదంశభూతాః సదస్యాశ్చ! "కానామనీతిః?" ఇత్యస్మిన్ విషయే కించిద్వివక్షు

రహం। ఆశాసేహం తత్రభవన్తో మహాన్తః శాంతాంతరంగాః శృణ్వంత్వితి।

కా నామ నీతిః? నీయతే అనయా సర్వలోకః సౌఖ్యస్థానమితి నీతిః; అర్థాత్ దుఃఖసంసార సాగరాత్ మానవజీవనం యద్ధి వచః నియమో వా సముద్ధరతి సైవ నీతిరితి అస్మాభిః ఉద్ఘో ష్యతే। పరం ఏతావతా నీతి నిర్ధారణా అతీవసులభా ఇతి న కైరపి సంభావనీయమ్। యతః "కిం కర్మ కిమకర్మేతి కవయోప్యత్ర మో హితాః" తయాహి। లోకే ఏకత్ర యా నీతిః సైవ అన్యత్ర అనీతిః। అత ఏవ గహనా నీతేర్గతిరితి మే మతిః। తథా చ సాంఘికదృష్ట్యా యా అనీతిః సైవ వ్యక్తిదృష్ట్యా నీతిః। యా హి వ్యక్తిదృష్ట్యా అనీతిః సైవ చ సాంఘికరీత్యా నీతితాం ఆపద్యతే। అస్యోదాహరణం మహాభారతయుద్ధ మేవ।

అర్జునస్య దృష్ట్యా బాంధవాదీనాం హననం అనీతిరాసీత్। అత ఏవ స మహార్హః కథమహం జానన్నపి అనీతివర్త్మని పాదక్షేపం కుర్యామితి శోకాకులో బభూవ। జగదుద్ధరణార్థం అవతీర్ణస్య శ్రీకృష్ణస్య దృష్ట్యాతు యేన యేన లోక రక్షణం ధర్మాభ్యుదయశ్చ స్యాత్ తత్సర్వం నీతా వంతర్భవతి స్మ। అతః తద్దృష్ట్యా ఖలానాం కౌరవాణాం హననం శాస్త్రసజ్జనసమ్మతా నీతిరివాసీత్। ఏవం స్థితే నీతిరహస్యే పండితా భవన్తః స్వనీతిపథం యథాతథం నిర్ధార యన్తు: యయా ఖలు సమాజస్యలోకస్య అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స్యాత్, తామేవ సమష్టిదృష్ట్యా నీతిం మన్వానాః జీవనపథే అగ్రేసరా భవన్తు। వ్యష్టిదృష్టిం పరిత్యజ్య విశాలభావనాభావితం నీతిమార్గమాశ్రయన్తు। ఏవం చేత్ విజయలక్ష్మీః యుష్మాన్ వృణోతి శీఘ్రమితి శం। ఓం తత్ సత్."

అనగా (తెలుగులో)

"నీతియనగా నేమి?"

ఓ అధ్యక్షమహాశయా! చిదంశభూతులగు సదస్యులారా! "నీతియనగా నేమి"–అనెడి విషయమున కొంత చెప్పదలంచితిని. పెద్దలగు తమరందరును శాన్తాత్ములై విందురని ఆశించు చున్నాను. ఉండనిండు.

నీతియనగా నేమి? ఏ వాక్కు లేదా నియమము దుఃఖరూప సంసారసాగరమునుండి యుద్ధరింపజేసి మానవుని శాశ్వతసౌఖ్య స్థానమును జేర్పగలదో అదియే నీతియని మాచే ఘోషింపబడు చున్నది. నీతి యిట్టిదని నిర్ధరించుట మిక్కిలి సులభమని తలంచ రాదు. ఎందుకనగా కర్మయనగానేమి? అకర్మయనగా నేమి? అనెడి విషయమున పండితులుకూడ మోహితులగుచున్నారు. కనుకనే లోకమున ఒకరికెద్ది నీతియో అదియే మరొకరికనీతియై యున్నది. అందువలననే నీతియొక్క స్వరూపము మిక్కిలి లోతై నదని నా యభిప్రాయము. అట్లనే సాంఘికదృష్టిచే నేది యనీ తియో అదియే వ్యక్తిదృష్టిచే నీతియైయున్నది. వ్యక్తిదృష్టిచే నెద్ది అనీతియో అదియే సాంఘికదృష్టిచే నీతియగుచున్నది. దీనికి దృష్టాంతము మహాభారతయుద్ధమే.

అర్జునుని దృష్టిచే బాంధవాదులను చంపుట అనీతియయ్యెను. కనుకనే ఆ మహానుభావుడు, ఎటింగియు ననీతిమార్గమున నేనెట్ల డుగిడుదునని శోకాకులుడయ్యె. జగదుద్ధరణకొఱకు అవతరించిన శ్రీకృష్ణుని దృష్టితోనో దేనిదేనిచే లోకరక్షణము, ధర్మాభివృద్ధి కలుగునో అవంతయు నీతియందంతర్భవించును. కనుక అతని దృష్టిచే దుష్టులగు కౌరవులను చంపుట శాస్త్రసజ్జన సమ్మతమగు నీతియయ్యెను. పరిస్థితి యిట్లుండ నీతిశాస్త్రమునందు పండితు

లగు తమరు తమతమ నీతిమార్గమును నిర్ధరింతురుగాక. దేనిచేత నైనెతే సమాజమునకు లోకమునకు అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధి గలుగునో దానినే సమష్టిదృష్టితో నీతియని తలంచుచు జీవన మార్గమున ముందడుగువేయుదురుగాక. వ్యష్టిదృష్టిని వదలి విశాలభావనతో గూడిన నీతిమార్గము నాశ్రయింతురు గాక. ఇట్లైనచో విజయలక్ష్మి మిమ్ముల శీఘ్రముగా వరించగలదు. ఓం తత్ సత్."

ఎప్పటియట్లే ఒకనాటి సాయంకాలము గీతామందిరమునకు శ్రీవారు వెళ్ళిరి. ఆనాడచట సుప్రసిద్ధమహామండలేశ్వరులు, మహనీయులు, నిష్ఠాగరిష్ఠులునగు పూజ్యపాద గం॥శ్రీశ్రీశ్రీ విద్యానంద స్వాములవారు వచ్చియుండిరి. వీరి బోధ సులలితమై చక్కని యుపమానోపమేయములతో నొప్పుచు శ్రోతృజనచిత్తాకర్షకమై యుండెను. సులలితశైలి. ఇచ్చట వీరు మూడురోజులుండిరి. అద్భుతముగా నుపన్యసించిరి. ఒకనాడు ప్రత్యేకసమయమున వారిని మన శ్రీవారు దర్శించి వినయముతో నిట్లడిగిరి:—

"మహారాజ్! ఉత్తమసాధకుడగు అధికారిపురుషుడు బ్రహ్మసాక్షాత్కారమును బడయుటకు ఎట్టిసాధనల జేయవలెను?"

ఈప్రశ్నవిని మండలేశ్వరులు పరమకరుణతో నిట్లనిరి:— "ఆహా! ఇంతపెద్దప్రశ్ననడుగుచున్నావే! చాలసంతసము. ఉత్తమ సాధకుడు—అను మీప్రశ్నయందే జవాబున్నది. బ్రహ్మసాక్షాత్కారమునకు అఖండాత్మవిచారణ తప్ప మరేసాధనములవసరములేదు. "తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః..........." (గీ. 5-17) అన్నట్లు ఉత్తమాధికారికిదియే పరాయణము గాని యట్టి గాఢ నిశ్చయములేనిచో సక్రమముగా జపతపధ్యానాదులచే నధికారియగు

ట్నికై బాగుగాపరిశ్రమించవలెను. నిజమైన శ్రద్ధ గల్గినచో తక్కిన సాధనములన్నియు నందులోనే కలసియుండును. అయితే "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యను నిశ్చయమును బ్రహ్మాత్మా వలంబనమగు ప్రత్యగాత్మదృష్టియే పూర్ణశ్రద్ధ యనబడును. ఉత్తమాధికారులకిది సర్వ సంశయముల దీర్చి బ్రహ్మానుభవము నొసగును గాన "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రరీతిని నిజమైన యట్టి యధికారికాపిదప బ్రహ్మవిచారణ యొక్కటియే కర్తవ్యము. దేహాత్మవద్బ్రహ్మాత్మనా సంస్థితియే విచారపర్యవసానము."

తృప్తికరమైన యీ సమాధానమంది వందనమాచరించి విచ్చేసిరి. మరొకప్పుడు కాశీటౌనుహాలు వద్ద సుప్రసిద్ధ ధార్మికప్రచారకులగు గం౹౹ శ్రీశ్రీశ్రీ కరపాత్రస్వాములవారు 3 దినములుపన్యసించిరి. ఆసభ లక్షలకొలది జనులచే క్రిక్కిరిసియుండెను. హంసగమనము వంటిదైగంభీరమైన సభనుబ్బితలూగించువారి యుపన్యాసమును శ్రద్ధగా శ్రీవారు వినిరి. వానిలోని యొకటిరెండంశముల తెలియఁజేసెద.

"ఆ సనాతనపరతత్త్వమే జీవరూపమున వ్యవహరింపబడుచున్నది గాని వేరుగాదు. మన ఆత్మయే పరబ్రహ్మము. దానియందే సర్వ జగత్తుకల్పింపబడుచున్నది. ఇదియే సర్వశ్రుతుల తాత్పర్యము. సద్రూపమైన బ్రహ్మమొక్కటే సజాతీయవిజాతీయస్వగత భేదరహితమైయుండెనని యుపక్రమించి, చివరకదియే సత్యమైనది, ఆ యాత్మ నీవనియు, అదియే అద్వితీయ పరబ్రహ్మమనియు ఆ శ్రుతులుపసంహరించుచున్నవి."

"ఒకప్పుడు తెలియని అజ్ఞులెవ్వరైనా వేదమతము సనాతన సిద్ధాంతము గాదని దూషించి కలతపఱచుటకు ప్రయత్నించినచో

నవి కేవలము బాలురప్రలాపములే. ఇది భారతీయుల జన్మ హక్కు. అట్టి మాటలకు చెవియొగ్గి ఐహికవశుభోగలాలసచే మనమనార్యులము గారాదు.''

"భారతీయ మహిళలు తొల్లింటి సతీమతల్లులగు సీత సావిత్రి, అనసూయ, మీరాబాయి మున్నగువారిని మనసున తెచ్చుకొనవలెను.''

శ్రీవారపుడపుడు దశాశ్వమేధఘాట్ నందు జరుగుచుండిన శ్రీ తులసీదాసరామాయణమును వినుచుండిరి.

కేదార్ ఘాట్ నందు నివసించు యోగులయొద్దకు వెళ్ళి పాతంజలయోగసూత్రాభిప్రాయములను తెలిసికొనుచుండిరి.

చౌషష్మిఘాట్ నందు ఒక పండితులయొద్ద కొన్ని భాష్యగ్రంథముల శ్రవణముఁ జేయుచుండిరి.

గోఘాట్ నందున్న హిందీ పండితులవలన విచారసాగరగ్రంథ ప్రసంగముల ముచ్చటించుచుండిరి. వీరే మన స్వామివారికి "భారతీయ దర్శనము'' అను నొక హిందీపుస్తకమును ప్రేమతో గొనివెట్టిరి. ఇదియొక దార్శనికగ్రంథము. అన్ని దర్శనము లిందు సంగ్రహముగా జెప్పబడియుండును.

ఈ సమయమున కాళహస్తి శ్రీ కైలాసాశ్రమం పూజ్యపాద శ్రీ నిత్యానంద స్వాములవారు శిష్యసమేతులై బదరీయాత్రకై వచ్చి మన స్వామివారితో కలసికొని శ్రీ జగుద్గురుస్వాములవారిని సందర్శించి సంభాషించి, మనస్వామివారితో, "స్వామీజీ! ఇక చాలించి మన దేశమునకు రండి. ఇంకను ఇక్కడుండి తమరు తెలియవలసిన క్రొత్తవేదాంతమేమియును లేదు.'' అను నీ విధ

ములైన కొన్ని మాటలను ఛలోక్తిగాను ప్రియముగను బలికి దర్శ నంబిచ్చి వెళ్ళిరి.

ఇక చాతుర్మాస్యమహావ్రతము వచ్చె. శ్రీవారు దీక్షాబద్ధులై, హంసమంత్రానుష్ఠానపరులై నియమము దప్పక యనుష్ఠించుచు పరమశాంతముగా తమ యేకాంతపు గదియందు కొన్ని వేళల గంటలకొలది పరవశులై యుండుచుండిరి. ఇంతకు పూర్వము గంగామాత తమకు ప్రసాదించిన యీ భగవద్గీతాగ్రంథముచేతనే అష్టోత్తరశతవారములు (108 సార్లు) గీతా పురశ్చరణము గావిం చిరి. ఈ వ్రతమధ్యముననే విరోధి శ్రావణ బహుళ ఏకాదశి (తే. 20—8—1949 శనివారం) నాడు మామూలుగా చేయుచున్న గీతాపారాయణమున ఐదవ అధ్యాయం 27-28వ శ్లోకములు ("స్పర్శాన్కృత్వా.......ముక్త ఏవసః") చదువుచుండగా తమలో నేదో యొక విధమైన అనిర్వచనీయమైన పరమతుష్టి సుఖశాంతి లోలోన కలిగి వృత్తి సమాధినందెను. ఇట్లు నాటియుదయం 8 గంటలకంతర్ముఖమైన వృత్తి మరుదినముదయముదాక బహి ర్ముఖము గాకుండెను. అనాడు స్వామి భిక్షకు వెళ్ళలేదుగదా! గది తలుపులు మూయబడియే యున్నవి. ఎచటికో వెళ్ళియుండ వచ్చునని విద్యార్థులనుకొనిరి. పాలవాడు వెలుపల గూటిలో పెట్టిపోయిన పాలట్లే గడ్డ కట్టుకొనెను. మరురోజుదయము పూజా మందిరమునందలి గంటల మ్రోతచే బహిర్ముఖులై చూడ పరమా శ్చర్యమయ్యెను. బీగము లేనందున గడియారమాగిపోయినది. కాని దేహమునందెట్టి యలసట గాని యనారోగ్యముగాని తోచ లేదు. మహోల్లాసముగానే యుండెను. ఇయ్యది స్వీయ సంస్కా రముగాదనియు, శ్రీ సద్గురు పరమాత్మానుగ్రహమనియు, విశ్వే

శ్రీవారు (కూర్చున్నవారిలో కుడినుండి మూడవవారు)



సమాధి నిష్ఠయందు

[redacted]



శ్రీవారు

శ్వరమహాప్రసాదమేయనియు నిశ్చయించి పరమానందమందిరి. ఈ విషయమును కొందరు తత్త్వవిదులకు తెలుపగా వారు, "చాల మంచిది; అభ్యాసమున నిట్టి యనుభవములు కలుగుచున్నచో ఆత్మస్వరూపస్థితికి మహోపకార మొనర్చును. క్రమేణ స్థిరత గలుగజేయును. మహా పుణ్యవిశేషము. భావిజీవిత శుభోదయచిహ్నము."—అని పరమసంతోషముతో పల్కిరి. నాటినుండి స్వామివారికి బ్రహ్మనిష్ఠ కరతలామలకమయ్యెను. తలంచిన మాత్రమున నట్టి స్థితిలో నుండగల్గుదునని స్థిరానుభవముతో పలుకుచుండెడివారు. కొన్ని కొన్ని రోజులావిధముగ గంభీరసుఖసాగరమున మునిగితేలుచుండిరి. (ఆత్మానందమనుభవించుచుందురు), మౌనమును వహింతురు. ఇదంతయు గురుకృపావిశేషమేయని యానందించుచుండిరి.

ఇట్లు తమ కాశీవాసమున అపూర్వమగు నీకాలమును బ్రహ్మనిష్ఠాభ్యాసముచేతను విద్యావ్యాసంగముచేతను, మహాత్ములతోడి దర్శనస్పర్శన సంభాషణములచేతను గడపుచు ధన్యులైవలసినంత విద్యాతపస్సుల నార్జించి సర్వ ప్రియులైరి. వ్రతము సాంగ మంగళప్రదమయ్యెను.

ఇంతలో నంద్యాల శ్రీ నెరవాటి బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారినుండి శ్రీత్యాగరాజస్వామి యారాధనకు రావలసినదిగా కోరుచు జాబును 40 రూపాయలును వచ్చెను. విషయమును ముందుగానే మహాసన్నిధికి విన్నవించిరి. అదితెలిసి విద్వత్సంఘు విద్యార్థులందరును తరువాతి ఆదివారమునాడు మఠమున శ్రీవారి గౌరవార్థమై విందుజేసి జ్ఞానమందిరమున సభనేర్పాటుజేసిరి. శ్రీ జగద్గురు స్వాముల

వారు పీఠమునలంకరించియుండిరి. మంగళాచరణముతో సభ ప్రారంభమయ్యెను.

అంతవిద్యార్థులొకరొకరును మన శ్రీవారిని గురించి ప్రియ వాక్యములను పలుకుచు వెక్కుధన్యవాదములర్పించుచు తమ గౌరవమును వెలిబుచ్చుచు ఉపన్యసించిరి. అధ్యక్షపీఠమున సింహాసనాసీనులైవిరాజిల్లుచున్న ౧౦౮ శ్రీజగద్గురు విశ్వేశ్వర శివాచార్య స్వాములవారు విద్యయొక్క ఘనతను గూర్చి మాట్లాడుచు మిక్కిలి ప్రేమాదరములతో కన్నడభాషలో, "ఈదిన నమ్మగురుకులద విద్వత్సంఘసదస్యరల్లొబ్బరాద శ్రీశంకరానందగిరిస్వామిగళు నమ్మన్నుబిట్టు తమ్మదేశక్కె హోగుత్తిద్దారెంబుదాగి ఒందుకొరతె. ఇవరుపునఃపునః మహాసన్నిధిగె బందు దర్శిసుత్తిరబేకాగి అప్పణె కొడిసిద్దేవె" అనగా "నేడు మన గురుకుల విద్వత్సంఘ సదస్యులలో నొకరగు శ్రీశంకరానందగిరిస్వాములవారు మమ్ము వీడి తమ దేశమునకు వెళ్ళుచున్నారని కొఱతగానున్నది. వీరు మఱల మఱల మహాసన్నిధికి వచ్చి దర్శించుచుండవలెనని సెలవిచ్చుచున్నాము"—అని శ్రీ జగద్గురుస్థానోచితములగు నమృతవాక్యముల బలుకుచు తమ యమృతహస్తములతోనే మన శ్రీవారి కంఠమును పుష్పహారతో నలంకరింపజేసి యాశీర్వదించిరి. పిమ్మట మన స్వామి భక్తివినయపూర్వక మార్దవవాణితో, "శ్రీ మహాసన్నిధివారు విద్వత్సంఘమువారును పలికిన పొగడ్తలకును, చూపిన గౌరవమునకును భృత్యుడగు నేనర్హుడనుగాను. అన్నివిధముల గౌరవార్హులు పూజార్హులును ౧౦౮ శ్రీ జగద్గురు విశ్వేశ్వరశివాచార్యమహాస్వామి పాదులే. అచంచలభక్తిజ్ఞానవైరాగ్యములు సదా యుండునట్లు మహాసన్నిధివారి యమోఘాశీర్వాద మొక్కటి నాకుండిన చాలునని

శిరసాష్టాంగప్రణామములర్పించువాడను. నా మిత్రవరేణ్యులందరికిని హృత్పూర్వక నమఃశతంబులు. ఓం తత్సత్''—అని నుడివిరి. వెంటనే మహాసంతోషముతో నందరును మహాసన్నిధికి మంగళమాచరించిరి. వేదఘోషతోను జయజయధ్వానములతోను శ్రీవారిని లోపలికి తోడ్కొనిపోయిరి.

కొన్నాళ్ళకే మన శ్రీవారు సన్నిధియాశీర్వాదమంది విద్యార్థులకు కృతజ్ఞతలర్పించి శ్రీవిశ్వేశ్వరుని సందర్శించి కాశీక్షేత్రము నుండి బయలుదేరిరి. "హరిద్వార్ కా కంకర్ సభీ శంకర్" అన్నట్లు రాళ్ళురప్పలుకూడ శంకరులైయుండ సచేతనుల విషయముచెప్పనేల?—అనబడు పవిత్రక్షేత్రమగు హరిద్వారమునకు విచ్చేసిరి. చూడవలసిన విశేషముల దర్శించిరి. ఖనకల్ హరిహరానందాశ్రమమున నొకనాడు నివసించిరి. అచటి సాధువులతో కలసి హృషీకేశము విచ్చేసిరి. అట స్వర్గాశ్రమము, గీతామందిరము, పూజ్యపాద శ్రీశ్రీశ్రీ శివానందసరస్వతీస్వాములవారి ఆనందకుటీర్ దర్శించిరి. ఇట్టి కొన్ని పవిత్రక్షేత్రములను సందర్శించి నేరుగా నంద్యాలశ్రీ త్యాగకుటీరమునకు దయచేసిరి.

ఆనాడు విరోధి పుష్యబహుళ చవితి (తే. 8-1-1950 ఆదివారం) శ్రీవారిని దర్శించి యందరు పరమానందమందిరి. కాశీవాస విశేషములనంతయు విని మహదానంద సాగరమున మున్గిరి. శ్రీ త్యాగరాజస్వామి యారాధన యథారీతిని మహాత్ముల యుపన్యాసములతోను పూజాదులతోను మహావైభవముగా జరిగెను. పూర్ణాహుతి యయ్యెను.

# శ్రీ నిర్వాణాశ్రమవాసము

మన స్వామి పిమ్మట గురుదర్శనార్థమై గంజిగుంటకు విచ్చే సిరి. శ్రీసద్గురువునకు సాష్టాంగవందనములాచరించిరి. అచ్చటి వారికందరికిని పరమానందము గల్గెను. కాశీవిశేషములను క్షేమ సమాచారములను గూర్చియు శ్రీసద్గురువు విచారించి పరమసంతో షంబందిరి. పిమ్మట మన స్వామితో, "స్వామీ! మీరు చూడ వలసిన స్థలములన్నియుఁ జూచితిరి. ఎఱుంగవలసిన వెఱింగితిరి. ఇకమీదట మన మూలస్థానమగు శ్రీనిర్వాణాశ్రమమునకు వెళ్ళి యక్కడనేయుండండి. మన రాగులపాడు శ్రీ పి. వెంకటరెడ్డిగారే ధర్మకర్తలై అన్ని వ్యవస్థల జేయుచున్నారు. కాబట్టి మీరు మన శివారెడ్డి, శివలింగప్ప, నల్లనయ్య, రంగావధూత అందరు కలసి అచ్చటనే నివసించుచు నియమబద్ధముగా ఆత్మనిష్ఠ, శాస్త్రశ్రవ ణము జరుపుకొనుచు ఆశ్రమమును సువ్యవస్థ గావించుచు నిర్వహింపుడు"—అని యాజ్ఞాపించిరి.

అందులకు మన స్వామి శిరసావహించి యంగీకరించి వారి యిచ్చచొప్పున 4–5 దినములచటనే యుండుచు శ్రవణాదుల జేయుచుండిరి. ఒకనాడు గురుదేవుడు మనస్వామికి విధముగ నుపదేశించిరి :—

"స్వామీ! ఆత్మవిషయకమగు ధీవృత్తిగల మీబోటివారు సత్సం గము జేయుచు నొకే చోట ఉండినచో మీవృత్తి సత్వరముగా స్వస్థానమున నిలుకడజెందును. ఒకవేళ ఏదో పనియుండి వృత్తి పొరాడుచున్నను చింత లేదు. ఇదియును చాలమంచిదే"—అనిరి. మరుదినము ప్రసంగవశాత్తుగా నిట్లు నుడివిరి :—

"ఒక సంఘము వృద్ధికావలెనన్నచో దానికి "క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే" అన్నట్లు సాత్వికమగు శక్తి అత్యావశ్యకము. అట్టి శక్తి నార్జించిన పిదప శాంతిస్థాపనమైకై పోరాడవలెను. కాని ఒక్కొకప్పుడు తనచేతులే తనకు వైరమైనట్లు తన్నుతానే మోదుకొన్నటుల సంఘము తనలోతాను ఐకమత్యము లేక కలత జెంది స్వీయగౌరవమును నష్టము జేసికొనుచు, తన బలమును తానే పోగొట్టుకొనుచుండును. ఇట్టియెడ సత్వశక్తి అత్యావశ్యకము. అట్టి శక్తిసంపద్విశిష్టత లేనందుననే సంఘము లట్లగుచుండును. బుద్ధిమంతుడే ప్రకృతిలక్షణమును గ్రహించి తన శాంతిని వీడరాదు."—అని హెచ్చరించిరి. పిమ్మట రెండు మూడు దినములకు శ్రీ సద్గురునాజ్ఞనైగైకొని శ్రీ శివలింగాశ్రమమునకు విచ్చేసిరి. తమ సద్గురునాజ్ఞను అచటి భక్తవుండలికి దెలిపి బ్రహ్మచారులతో సహ నంద్యాలచేరిరి. అక్కడున్న శ్రీశివారెడ్డిగారితో కలసి అందరును శ్రీ నిర్వాణాశ్రమము చేరిరి. నిరంతరబ్రహ్మచింతన, బ్రహ్మనిష్ఠ, శాస్త్రశ్రవణములతో పరమసుఖంబుండిరి. ఆశ్రమ వ్యవహారములను శ్రీ సాధు శివారెడ్డిగారు గాఢవిశ్వాసముతోను ధైర్యముతోను నిర్వహించుచుండిరి. వీరి యాత్మ నిశ్చయము, యమునిగూడ ఎదిరించి యతనిని సకుటుంబ సపరివారముగా తరిమివేయగల పటిమ గలది. ఇట్టి బ్రహ్మబుద్ధిగల ఉత్తమసాధుపుంగవులు వీరు. ఇట్లు సాధుపుంగవులతో కూడి శ్రీవారిస్థలమున ఆనందముగనుండిరి. ప్రస్థానత్రయ భాష్యములను చక్కగా పరిశీలించిరి. పెక్కు ప్రకరణగ్రంథములను పఠించిరి. ఈ యన్నిటియందును గల శ్రుతిసారరూపములగు దాదాపు వేయి శ్లోకములను ఏర్చికూర్చి "శ్రుతిసార"మను పేరిడిరి.

ఈ నిర్వాణాశ్రమమన్ననో నంద్యాల భక్తాదులకు పరమప్రీతి. పైగా శ్రీవారిట నివసించుటచే ఈభక్తులు తఱచుగా ఆశ్రమమం నకు వెళ్ళుచు శ్రీవారిని దర్శించి వారియొద్ద శాస్త్రశ్రవణము గావించుచుండిరి. ఇంతలో శ్రీ శివరాత్రి మహోత్సవము సమీపించెను. ఆపర్వదినములు నాలుగురోజులతో విధ్యుక్తముగా పూజ, పారాయణము, అఖంఢభజన మహాత్ములచే వేదాంతోపన్యాస ములు మున్నగు కార్యక్రమములతో జరుప బడి మహావైభవముగా మంగళమాయెను

ఈ శ్రీవికృతినామ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి (తే. 26-6-50) సోమవారమునాడు శ్రీచాతుర్మాస్యమహావ్రతమును శ్రీవారీ తాప సారణ్య పుణ్యాశ్రమముననే సన్నియమనిష్ఠలతో ప్రారంభించిరి. ఆశ్రమభక్తాదులనేకులు వచ్చి శాస్త్రశ్రవణము గావించి గురుసేవను భగవత్సేవను చేయుచుండిరి. అన్నివిధముల ఆశ్రమము శోభాయ మానమై ఆనందదాయకమై కైలాసమాయుననొప్పియుండెను. మరల శ్రీ శివరాత్రిమహోత్సవము సమీపించెను. పూజ్యపాద శ్రీ సదానందసద్గురుస్వాములవారు గంజిగుంటనుండి విచ్చేసిరి. రాదగిన ఈ శ్రీ ప్రణవానందస్వాములవారి శిష్యకోటియు తక్కిన భక్తబృందమును వెక్కుస్థళములనుండి వచ్చి చేరినవి. ఈ సంవత్సరమే శ్రోత్రియబ్రహ్మనిష్ఠులగు సురపురం శ్రీ శంకరా నంద స్వాములవారును విచ్చేసిరి. ఈ స్వామివారు శ్రీ ఉమామ హేశ్వర గురుపీఠ సంఘమువారందరికిని చిరపరిచితులు. సుహృదా త్ములగు పండితులు. శ్రీ సదానందసద్గురుస్వాములవారికి పరమ ప్రియులు. మన శ్రీవారు గంజిగుంటయందు శ్రీగురుసన్నిధిలో నుండగా ఈ సురపురం స్వాములవారు తఱచుగా వచ్చుచుండిరి.

ఒకమాఱు వీరు శ్రీసదానందస్వాములవారితో మన శ్రీవారింగూర్చి, "స్వామీ! ఈ చిన్నమూర్తి పెద్దవాడగును. వీరి ప్రారబ్ధము శంకులవంటిది. ముందు మంచి అభివృద్ధికి వచ్చును." అని చెప్పుచు ఆశీర్వదించుచుండెడివారు.

ఇట్టి ఉత్తమ మహనీయులందఱు చేరగా శాస్త్రోక్తముగా పూజ భజన మహాత్ముల ఉపన్యాసములు, అన్నదానము మున్నగు కార్య క్రమములతో మంగళప్రదమైన మిక్కిలి వైభవముగా ఉత్సవము సమాప్తియయ్యెను. సురపురం శ్రీశాస్త్రులవారు స్వస్థానమునకు బయలుదేరిరి. శ్రీ సదానంద సద్గురుస్వాములవారు ఆ సంవత్సర మచ్చటనే విశ్రాంతిగా నుండగోరి నిలిచిరి. వారు నిలుచుటచే కొందరుత్తమ భక్తులుకూడ శాస్త్రశ్రవణాపేక్షచే అచ్చటనే ఆగిరి. శ్రీగురు మహాసన్నిధిగల యా పుణ్యాశ్రమమున అందరును వ్రత శీలురై జపతపధ్యానానుష్ఠానములతో శాస్త్రశ్రవణము గావించు చుండిరి. అచ్చటి యనుదినకార్యక్రమమేమన:—

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| బ్రహ్మముహూర్తము | 4 గం. | నుండి | 6 గం. | వఱకు | అనుష్ఠానము. |
| ఉదయము | 6 | ,, | 8 | ,, | సమాధిపూజ, గీతాపారాయణము, |
| ,, | 8 | ,, | 10 | ,, | పాతంజలయోగసూత్రములంగూర్చి శ్రవణము |
| ,, | 10 | ,, | | | భోజనం, విశ్రాంతి, |
| మధ్యాహ్నం | 1 | ,, | 3 | ,, | మౌననిష్ఠ, గ్రంథావలోకనము |

సాయంత్రం 4గం.నుండి 6 గం.వఱకు యోగసూత్రములశ్రవణము

,, 6-30 ,, రాత్రి 8-30 గం.వఱకు అనుష్ఠానము

రాత్రి 8-30 ,, 9 గం. వఱకు భజన

పిమ్మట అల్పాహారము, విశ్రాంతి

మన పూజ్యపాద శ్రీ శంకరానందగిరి స్వాములవారే మృదుమధురశైలితో గంభీరార్థవంతములగు యోగసూత్రములను గూర్చి విపులముగా వ్యాఖ్యానమొనర్చుచు శ్రోతల నానందసాగరమున ముంచుచుండిరి. పూజ్యపాద శ్రీ సద్గురుస్వాములవారు పీఠము నలంకరించి మౌన నిష్ఠతో కేవలముపద్రష్టలైయుండి శిష్యుని బోధనకళాపటిమను ప్రజ్ఞావిశేషమును గాంచుచు మనమున సంతసించుచుండిరి. ఇట్టి బ్రహ్మయజ్ఞమును గుర్వనుగ్రహముచే భక్తులందరు తు-చ తప్పక అఖండముగా మూడు మాసములు నియమముగా జరుపుకొనుచు యోగసూత్రములను సంపూర్ణముగా శ్రవణంబుజేసిరి. ఇక గురుదేవుడన్ననో విశ్రాంతిగా నపుడపుడు భాసించు భావములను అహైతుకప్రేమతో నవ్యాజకరుణతో ఉత్తమవిషయంబుల బోధించుచుండిరి. వానిలో కొన్నింటిని మాత్రము శ్రీవారి పొత్తమునుండి యిట పొందుపఱచెద.

" నాయనా! అజ్ఞానమనగా జ్ఞానోత్పత్తి ప్రతిబంధరూప పాపము. దేవతలజన్మకంటె నరజన్మముత్తమము. ఏలయనగా అజ్ఞాననివృత్త్యుపాయమును సాధించుటకే జన్మమందే సాధ్యము. ఇచ్చట దుఃఖానుభవమున్నది. దేవతలజన్మయందది లేదు. ఈ యుత్తమ మానవజన్మనొందినందులకు దుఃఖనివృత్తిమార్గమును

గమునించవలెను. స్వర్గమందలి సుఖానుభవములు గూడ ఈలోక మందు ఇట్టి మానవజన్మలో నున్నపుడు గావింపబడిన పుణ్యవిశేష ఫలమేగదా! కనుక అట్టి పుణ్యకర్మఫలప్రాప్తియే స్వర్గానుభవము. కాని అదియు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" యన్నట్లు పుణ్యము దీరినపిదప మఱల మర్త్యలోకమును తప్పక గల్గించును. అని త్యమై పతన దోషభూయిష్ఠమైన ఈ క్షణికసుఖంబును ముము క్షువులు గోరరాదు. ఈజన్మయున్నపుడే "న స పునరావర్తతే" అను శ్రుతివాక్యానుసారము మరలమరల జననమరణముల ఆవృత్తి లేని అజ్ఞాన నివృత్తిపూర్వక శాశ్వతానందప్రాప్తిరూప మోక్షము నొందుటకైయే ప్రయత్నించవలెను. ఈజన్మయున్నపుడే జ్ఞానము నొంది మఱల జన్మలులేని స్థితినందవచ్చును. లేదా అజ్ఞానముచే అనంతకోటిజన్మలనైనా పొందునట్లు చేసికొనవచ్చును. కాబట్టి మానవజన్మయొక్క పరమోద్దేశ్యము శాశ్వతకైవల్యప్రాప్తియే గాని జన్మజరామరణదుఃఖప్రాప్తిగాదు. ఐహికాముష్మిక విషయములే వైనను ముముక్షువుల దృష్టికి ప్రియముగా కనబడవు."

మఱొకనాడు:—" అనంతకోటిజన్మ సుకృతపరిపాకమే ముము క్షుజన్మము గాన నిట్టి పరమపుణ్యమయజన్మకు ప్రారబ్ధము లేదు. అనగా అందు చెడ్డయుండదన్నమాట"

(హంసపు) తల అంతఃకరణము, పాదములు ఇంద్రియములు, రెక్కలు ఉచ్ఛ్వాసనిశ్వాసములు, దేహము పంజరము."

"పొట్టయనగా పుట్ట, అందలి ప్రాణస్పందనమే సర్పము, దాని నిరోధమే అనగా ప్రాణము నెదురు చూచుచుండుటయే అద్దాని నాశనము, పరమసుఖానుభవము.—"

ఇట్టి అనేకవిషయములను విశ్రాంతిగా గూర్చుండి సౌమ్యవా

ణితో దెలుపుచుండిరి. ఈ విధమంగు బ్రహ్మయజ్ఞము మిక్కిలి జయప్రదముగా గురుకృపచే జరిగిపోయెను. పిదప పూజ్యపాద శ్రీగురుస్వాములవారు గంజిగుంటకు వెళ్ళిరి. తక్కిన భక్తాదులును తమతమ స్వస్థానములకు జనిరి. మన శ్రీవారు మాత్రము కొంత కాలమచటనేయుండి భక్తులగు శ్రీగోవిందప్పగారి ప్రార్థనలమన్నించి మైసూరుకు ప్రయాణమైరి. నంద్యాలనుండి బండి గుంతకల్లు చేరినది. స్వామివారున్న పెట్టెలో నొక పెద్దమనిషి ఎక్కెను. పెద్ద వేషముతో నుండెను. బండికదలినపిమ్మట ఆవ్యక్తి మనస్వామి వారిని జూచి, "స్వామీ! ఈకాలమున సంన్యాసులంటే ఏపనీ పాటలేక ఇదొక వేషంవేసికొని ఏవేవో మాటలు చెప్పుచు ఊరూరు తిరుగువారేగదా! ఈయెఱ్ఱగుడ్డలు వేసికొని తిరిగితే వీరినుండి లోకానికి గలిగే లాభమేమి?" యని తిరస్కారభావముతోను ఎగ తాళిగాను అడిగిరి. అది విని మనస్వామి సౌమ్యభావమున శాంతము లగు పలుకులతో నిట్లనిరి :—

"అయ్యా! సంన్యాసమంటే సీదృష్టికంత చులకనగా గనబడు చున్నదా? అనుష్ఠానపరులగు యోగ్యసన్యాసుల నెప్పుడైనా దర్శిం చెడి భాగ్యము కలుగలేదేమో! వారి సాంగత్యము మీకబ్బలేదేమో! ఔనుగదా! పాపమా కల్లికంపసంసారమున బడి దేలుచున్న మీ కెట్లు మంచి సంన్యాసుల సాంగత్యమబ్బును? పురసత్తు (విశ్రాంతి) లేదు కాబోలు. అట్లుగాక గృహస్థాశ్రమమందలి అట్టహాసవిషయ సుఖంబుల బాయలేక వానియందత్యధికమగు అభిరుచియున్నందున ఈ విరాగచిహ్నమ్ములైన కావివస్త్రములు మీకన్నులకట్లుగ పడుచున్నవేమో? ఒకవేళ ఎక్కడనైనా చూచి యుండినచో కేవలము వేషధారిసంన్యాసులంజూచి మోసపోయి

యుంటిరేమో! పాపమందుచేతనే సంన్యాసమంటే కాషాయ వస్త్రములంటే అంతగా ఉలికిపడి బెదరుచున్నారు కాబోలు!

కాని నాయనా! ఎప్పటికిని సంన్యాసమంటే అట్లనుకొనరాదు. సంన్యాసమనగా స్వార్థరహితమగు భగవదర్థమైన లోకశివంకరమగు పరహితజీవనము. ఆ గురుతులే ఈ కాషాయాంబరములు గాని ఇయ్యది సోమరులుగా దిరుగు ద్రిమ్మరుల వేషముగాదు. సంన్యాసమంటే అహర్నిశములు ఆత్మలాభమునకై కృషిచేయుచుండుటయే. అట్టి పనిలేక యెప్పుడును ఊరకుండజాలరు. నిర్వక్రమగు నాచారవిచారములతో జీవనమున సద్బోధలొసంగుచు సదా బ్రహ్మనిష్ఠద్వారా లోకమునకు తమ యాత్మశక్తులను పంచిపెట్టుచుండువారు. చూపుచే కొన్నింటిని, మాటలచే కొన్నింటిని, మరి సంకల్పమాత్రముచేతనే కొన్నింటిని సత్పథమునకు ద్రిప్పి పవిత్రములుగ జేయువారు. ఆధ్యాత్మిక బలమొసగి కార్యరంగమున కర్తవ్యకర్మలనాచరింపజేయువారు. భారతీయుల వైరాగ్యధీరోద్యమచిహ్నములే ఈ కాషాయాంబరములు. "కాషాయ దండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" అను పెద్దలవాక్యమును మీరు వినలేదా? భారతీయులకు సంన్యాసమంటే పరమపూజ్యము. అసలు విషయమిట్లుండ సర్వులయెడ శుభాకాంక్షులనదగిన గృహస్థులు పూర్వాపరములు దెలియక సంన్యాసులనిట్లు నిర్లక్ష్యము జేయుట వారి యైహికాముష్మిక శుభఫలంబులకు వైరము తీరని యడ్డు. గృహమేధులెప్పటికిని యత్యాశ్రమమునిట్లు చులకనగా చూడరాదు. "ఆత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః" అనగా శ్రేయస్సు గోరువాడు ఆత్మజ్ఞానిని పూజించవలెను—అని శ్రుతి బలుకుచున్నది."

అను నీ మున్నగు మాటలతో వారందరి మనమొప్ప నీతిజెప్పిరి.

ఈ మాటలు విన్నవెంటనే ఆ పెద్దమనిషి కేమాయెనో ఎట్లు తోచెనో గాని వెంటనే చెంపలు వేసికొనుచు, "తెలియక మాట్లాడి తిని; స్వామీ! నా తప్పు క్షమింపుడు" అని స్వామిపాదముల తాకి నమస్కరించిరి. పిమ్మట నా పెట్టెలోనున్న తక్కినవారును పరమ సంతోషముతో, "స్వామీ! ఆయనను గూర్చి చెప్పిన మాటలు అతనికేగాక మాకుకూడ బుద్ధివచ్చునట్లు చేసినవి. సత్యవిష యము తెల్లమయ్యెను;" అని సగౌరవముగా పలికిరి. అందరును సుఖముగా ప్రయాణముచేసిరి. శ్రీవారు రాత్రి 9 గంటలకు మైసూరు చేరి పాతభక్తులగు శ్రీ గోవిందప్పగారి యింటికి వెళ్ళి యథాప్రకారము కుశలప్రశ్నల పిమ్మట భిక్షను స్వీకరించి విశ్ర మించిరి.

## మైసూరు గీతాప్రచారిణీ సభ

శ్రీవారు భక్తవరులగు శ్రీ గోవిందప్పగారి ఇష్టానుసారముగా వ్రతరూపమున వారి గృహమునందు 8 దినములు శ్రీశంకరగురు చరిత్రను శాస్త్రీయముగా చక్కగా బోధించి వారి బిడ్డకు ఆర్యాంబ యని నామకరణము గావించిరి. పిమ్మట అచ్చట అఖండగీతా ప్రచారము గావించుచున్న పరమహంస శ్రీశ్రీశ్రీ శంకరానంద భారతీస్వాములవారిచే స్థాపింపబడిన శ్రీ గీతాప్రచారిణీ సభకు వెళ్ళిరి. అచటి శ్రీ భారతీస్వాములవారు మన శ్రీవారిని ప్రీతితో గాంచి వసించుటకు ఒక ప్రత్యేకమైన గదినిప్పించిరి. అందు నివ సించుచు తమ నిత్యనియమానుష్ఠానములను చక్కగా జరుపుకొను చుండిరి. ఆ మహాస్వాములవారి సాంగత్యమున ఆధ్యాత్మిక విషయ చర్చలతో హాయిగానుండిరి. సుప్రసిద్ధులగు ఈ భారతీ స్వామి

వారియొద్దకు వెక్కువుంది గొప్పగొప్ప విద్వాంసులు, స్వాముల వార్లు, సాధువులు వచ్చిపోవుచుండిరి. నిరంతరము సత్కాల క్షేపము జరుగుచుండెను. ఇట్టి సాధుసమాగమ పవిత్రక్షేత్రమున మన స్వామివారు రమారమి రెండు మాసములుండిరి.

ఇచ్చట అనుదినము రాత్రి 7 మొ. 8 గంటలవఱకు ప్రవచనము జరుగుచుండును. వందలకొలది శ్రోతలు చేరుచుందురు. శ్రీ భారతీస్వాములవారు తమప్రవచనసమయమున అప్పుడప్పుడు మన శ్రీగిరిస్వాములను ప్రవచించవలసినదిగా చెప్పుచుండెడివారు. వారి ఆజ్ఞానుసారముగా మన శ్రీవారు సభికులెల్ల సంతసిల్లగా గీతనుగూర్చి ప్రబోధించుచుండిరి.

శ్రీ భారతీస్వాములవారు పచారుచేయుచు వీరితో వెక్కు ధార్మికాధ్యాత్మికాది విషయము లెన్నియో తెలుపుచుండిరి. ఇయ్యవి కేవల ముపదేశవాక్యములు. ఒకనాడిట్లనిరి :—

"స్వామీ! అద్వైతము మాటలలో లేదు. అది ఆచరణీయమై భాసిల్లవలెను. హృదయమాస్థితినందినపుడు ఆచరణ తనంతట తానే వచ్చును. శుష్కమగు వేయిమాటలకంటె అర్ద్రమగు ఆచారయుక్తమైన ఒక్కమాట చాలును."

"భక్తిమతము ఉపాయముగా విరుద్ధము లేకుండ అపాయమును దూరము జేయును. జ్ఞానమతము అపాయము నెదిరించి విమర్శించి మరి దాని జాడలే కాన్పించకుండ నశింపజేయును. అయితే ఇది మహాకష్టతరము. దీనికి పెద్దసాధన తీవ్రవివేకవైరాగ్యములుండవలెను."

"స్వామీజీ! లోకమున ఆచార భ్రష్టుల సాంగత్యమెన్నటికిని చేయరాదు. అట్లు చేసిన ఆ కొందరు మనుజులు అద్వైతమును

తమ ఆచారవిచారములతో సమరించుకొను పాకమున (పద్ధతితో) బోధల కల్పింతురు. ఇట్టి మాటలను పదేపదే వినుటచే సాంగత్య బలమున అలవాటై ఒక మొండిధైర్యము వచ్చును. కాని అయ్యది సమయమున పనికిరాదు. జీవితమున శ్రుతిప్రోక్తమగు నిత్యశాంతిని కలుగనీయదు."

"స్వామీజీ! సత్యవస్తువుయొక్క సత్యానుభవము నందిన వ్యక్తి ఎట్టిసమయమునందైనను ప్రసన్నవదనముతో నుండును. ఎంతటి వాదోపవాద ప్రసంగములైనను అతడు తనచిత్తశాంతిని కోల్పోడు. ఒకప్పుడు తానోడిపోయినను సత్యదృష్టితో శాంతముగా నుండును. ఉద్విగ్నుడు కాడు. మనఃకమలము వాడదు. ఇదియే సత్యసందర్శియొక్క ఘనత."

"స్వామీజీ! శాస్త్రప్రవచన సమయమున ప్రవక్త ఏదియో ఆరంభించి ఎచటికో వెళ్ళి ఏదియో చెప్పి ముగించు ప్రసంగములు కూడ కలవు. తానారంభించిన విషయమును మఱచుటయే దీనికి కారణము. కాన వక్తయగువాడు మిక్కిలి జాగరూకుడై యుండ వలెను. అంతియే గాదు. జ్ఞానము వస్త్వధీనము. ఒక్కొక్కప్పుడు శుద్ధమైన చల్లని మనంబుతో, అహంస్ఫూర్తిరహితులై భాషించు నపుడు ప్రయత్నము లేకయే చక్కనిభావములు తోచుచుండును. అట్టిభాషణము మిక్కిలి తేజోవంతములై వినువారి హృదయముల నార్ద్రపఱచును. కాబట్టియే ప్రతికార్యమునుగాని ఉపన్యాసమును గాని ప్రారంభించునపుడు శ్రద్ధతో పరమాత్మను గూర్చి చక్కగా ధ్యానముజేసి నాబుద్ధికి మంగళము శాంతి నిమ్మని ప్రార్థించ వలెను."

"స్వామీజీ! సామాన్యముగా మానవుల నాలుక ఇతరుల

దోషములను గూర్చి పలుకునపుడు చాల పొడుగగును. కాని తనపాప (దోష)ములను గూర్చి చెప్పవలెనన్నచో మిక్కిలి కుంచిత యగును. ఒకరిని మనము నిందించినచో అవతలివారు మనల నిందితురా? లేదా? అను విచారణచే చేయుబూనరు. కాబట్టి మానవులయందు ఇదొక చెడ్డ యలవాటు గలదు.

లోకవార్తానుగమనే జిహ్వైకా సహస్రధా।
ఈశవార్తానుగమనే ద్వాత్రింశద్దంత కీలితా॥

అనగా లౌకికవిషయములను గూర్చి పలుకునపుడు నాలుక ఒకటియే అయిననను వేయిముఖములుగా విజృంభించును. భగవంతుని వార్తలను గూర్చి పలుకవలెనన్నచో ౩౨ పండ్లమధ్య దాగుకొనును. కాన వివేకులు తమనాలుకను పొడిగించు నలవాటును మానవలెను. మౌనముతో ఆత్మనిష్ఠ నభ్యసించవలెను." — అనునీ మొదలగు పెక్కు విషయములను గూర్చి మాటిమాటికి చెప్పచుండెడివారు.

ఇట్లు పరమపూజ్య భారతీస్వాములవారి దివ్యసన్నిధిలో మహానందముతో తమ నియమనిష్ఠలందును గ్రంథవ్యాసంగమునందును నిరతులై యుండిరి. ఇంతలో వెనకచర్ల శ్రీచిదంబరాశ్రమస్థులగు పూజ్యశ్రీ నారప్ప స్వాములవారినుండి "చాతుర్మాస్య మహావ్రతమును సలుప తమ చిదంబరాశ్రమమునకు ఈయేడు తాము తప్పక విచ్చేయవలె" నను ప్రేమపూర్వకమైన లేఖ వచ్చెను. మన శ్రీవారికి పై ఆశ్రమము విషయమై మఱియుపై స్వాముల వారియందును మిక్కిలి ప్రీతి, పూజ్యభావము గలదు. కాన పూజ్యశ్రీ శంకరానంద భారతీస్వాములవారి సెలవుకోరగా వారపుడు ప్రేమసంభరితములగు మృదు మధుర వాక్కులతో అపుడపుడు వచ్చు

చుండుడని మనవి చేసిరి. పిమ్మట భక్తులగు శ్రీగోవిందప్ప గారికి తమ ప్రయాణ విషయమును దెలిపి బయలుదేరి సుఖముగా శ్రీ చిదంబ రాశ్రమము చేరిరి.

## ౨౪. శ్రీ చిదంబరాశ్రమనివాసము

ఈ ఆశ్రమము మహాసిద్ధ సంపన్నులగు బ్రహ్మనిష్ఠాగరిష్ఠుల శ్రీ చిదంబర స్వాములవారి సమాధిగల గొప్పపుణ్యక్షేత్రము. వీరు చరిత్ర ప్రసిద్ధిగల మహనీయులు. ఈ ఆశ్రమ ధర్మకర్తలు శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు. వీరు మిక్కిలి ధర్మాత్ములు. ఇక ఈ ఆశ్రమ జీర్ణోద్ధారమొనర్చి సర్వవిధముల వ్యవస్థాపకులై శ్రీనారప్ప స్వామివారు సదా యిచ్చటనే ఉందురు. వీరు చిదంబరస్వాములవారి సాకార సాక్షాత్కారమొందిన పుణ్యపురుషులు. అవిచ్యుతవృత్తి గల ఆత్మానుభవులు. పరమశ్రద్ధాళులు. మఱియు ధర్మకర్తగారి పెద తండ్రిగారగు శ్రీ చిదంబరరెడ్డిగారి విషయమన్ననో, ఈ నామమునకు తగినట్లు అస్వార్థహృదయముగల పెద్దమనుష్యులు. వీరు పురాణగాథలు, వేదాంతశాస్త్రములు, భాష్యములు అన్నిటి యందును సుపరిచయముగల ధీమంతులు. ఇట్టి సజ్జనాన్వితమగు శ్రీ చిదంబరాశ్రమమున చాతుర్మాస్య వ్రత మాచరించుట మనశ్రీ వారికి మిక్కిలి ఆనందమయ్యెను. (ఈ ఆశ్రమ సిద్ధ పురుషుల గుఱించి శ్రీవారికి తమ గురుదేవులు పెక్కుమారులు తెల్పుచుండె డివారు.)

ఇటకువచ్చిన రెండు మూడు దినములకే అనగా ఖరనామ సంవత్సర ఆషాఢ శుద్ధ ఏకాదశి ఆదివారము (తే. 15-7-1951) నాడు
9

బ్రహ్మముహూర్తమున పినాకినీ గంగాతోయముల జలకమాడి శుచిర్భూతులై అబాధ్యమగు శివసంకల్పముతో శాస్త్రోక్తవిధులతో వ్రతమారంభించిరి. వాక్సంయమముతో శాస్త్రశ్రవణము, బ్రహ్మనిష్ఠ, అష్టోత్తరశతవారగీతాపురశ్చరణ, ఉపనిషద్గీతాభాష్యావలోకనము మున్నగు నియమములతో ప్రశాంత మనస్కులై వ్రతము సలుపుచుండిరి. ఈస్థలమహిమచే నిష్ఠయందును, ప్రత్యక్షముగను మహాపురుషుల అభయాదేశములను గాంచి ధన్యులైరి. భాద్రపద శుద్ధపాడ్యమి (2–8–1951) నాడు అజానుబాహువును జటాధారియు నగు యోగిపుంగవు నొక్కని దర్శించి వందనమాచరింపగా ఆ యోగిపుంగవుడు "సంగము వీడవచ్చు, సంహితానివృత్తియే నీవు" అనుమాటల పలికి ఆశీర్వదించి అంతర్ధానమాయెను.

మరొకనాడు అనగాఆశ్వయుజశుద్ధ పాడ్యమీ మంగళవారము (2–10–1951) మధ్యాహ్నము 1-30 గంటలసమయమున మనస్వామి తలవంచి గ్రంథముచదువుకొనుచుండగా భగవాన్ శ్రీరమణ మహర్షులవారు తలయూచుచు ముందు నిలబడి "అచ్చటనెవరునులేరే! నీలో నీవుండుము" అని పలుకుచు దర్శన మిచ్చి అంతర్ధానమైరి. వెంటనే ఇది మహాశ్చర్యముగ దోచెను. ఈపవిత్ర స్థలమహిమ వలన ఇట్టి భగవానుల మహాప్రసాదము లభించెనని తలంచి ప్రణతు లొనర్చి వైయుపదేశమును వెంటనే తమహృదయముననను పుస్తకముననను వ్రాసియుంచిరి. ఈవిషయములను అచ్చటనున్న తమ ఆప్తులగు శ్రీనారప్పస్వామి శ్రీచిదంబరరెడ్డి వీరలకు దెలిపిరి. అంత వారును శ్రీ చిదంబరస్వామివారు గొప్ప సిద్ధపురుషులనిదెల్పి వారిచరిత్రను వినిపించిరి.

ఇట్టి తపస్సంపన్నుల పదస్పర్శచే పవిత్రమైన ఈ ఉత్తమక్షేత్ర మునందు క్రమాభివృద్ధి నొందుచు ఉత్తమానుభవములతో నిష్ఠ సలుపుకొనుచుండిరి. ప్రతిరోజు ఇచ్చట స్థలీయులు చుట్టుప్రక్కల వారు కలసి గీతాభాష్యశ్రవణముచేయుచుండిరి. శ్రీచిదంబరరెడ్డి గారును కొప్పలగొండనుండి వచ్చి కొన్ని రోజులచటనేయుండి శ్రవణాదుల చేయుచుండిరి. స్వామివారితో వెక్కు భగవద్విషయములనుగూర్చి చర్చించుకొనుచుండిరి.

ప్ర:-స్వామీ ! గీతయందు ౧౧వ అధ్యాయమున భగవంతుడు జూపిన విశ్వరూపము సత్యమేనా ?

ఉ:—నాయనా ! భగవంతుడు సర్వసమర్థుడు గాన అతడేమైన నను చేయగల సామర్థ్యముగలవాడు. విశ్వరూపమును చూపినది పరమ పూజ్యబుద్ధితో సత్యమేయని అంగీకరించిన మంచిదే, లేదా అధిష్ఠాన జ్ఞానముచే అదంతయును మిథ్యయనియు కేవలము చిద్వివర్తమనియు తెలిసికొని జ్ఞానదృష్టిచే తత్త్వార్థమును కనుగొన్నను మంచిదే. గీత అనునది అక్షయమైన కల్పవృక్షము. ఎవరే భావముతో పఠించిన ఆయా భావముతోనే తగిన సమాధా నమునొంది తృప్తినందుచున్నారు.

ప్ర:—స్వామీ ! వ్యాఖ్యానము వ్యాఖ్యానమని తామెక్కువగా చెప్పుచుందురు గదా ! ఆ వ్యాఖ్యానములన్నిటిలో ఏ వ్యాఖ్యానము మంచిది ?

ఉ:—మౌన వ్యాఖ్యానమే ఉత్తమమైనది. దానివలన ప్రకటింప బడు తత్త్వమే పరమార్థము.

ప్ర:—స్వామీ ! తమ స్వరూప నిశ్చయమేమి ?

ఉ:—ఆదిమధ్యాంతములందు స్వభావసిద్ధమైయున్న ముక్త స్వరూపుడే "నేను"—అనుట నానిశ్చయము.

ప్ర:—ఎంతోకాలము శాస్త్రశ్రవణాదుల చేయుచున్నను ఆత్మ నిశ్చయమేర్పడకుండుటకు కారణమేమి ? స్వామీ !

ఉ:—అట్లు చాలకాలమువఱకు చేసిన శ్రవణాదులు తీవ్ర వైరాగ్యము, మోక్షేచ్ఛ, శమాది షట్కసంపత్తి, ఆత్మానాత్మవివేకము వీనితోకూడి చేయలేదనియు, అట్లు శ్రవణముచేసినదానిని మననము చేయలేదనియు అర్థము.

ప్ర:—ఓంకారోపాసన ఎట్లుచేయవలెను ?

ఉ:—ప్రణవార్థము నెఱింగి ఆ యర్థానుసంధానముతో ప్రణవమును ప్రాణమునందుంచి ఉపాసించవలెను.

ప్ర:—ప్రాణమునందుంచుట అనగా అర్థమేమి ?

ఉ:—ప్రణవమును బ్రహ్మబుద్ధితో చూచుచుండుట.

ప్ర:—యజ్ఞమనగా నేమి? దయతో తెల్పవేడెద.

ఉ:—ఈ విషయమును గుఱించి ప్రాణాగ్నిహోత్రోపనిషత్తునందును, మహానారాయణోపనిషత్తునందును చక్కగా వివరింపబడియున్నది. ఈ దేహేంద్రియాదికమునకు సాక్షియగు ఆత్మయే యజమాని, అంతఃకరణమందలి శ్రద్ధయే పత్ని, హృదయమే యూపము, కామమే అందువేయు ఆజ్యము, కోపమే పశువు, తపస్సే అగ్ని, సర్వేంద్రియోపశమమే దక్షిణ........అనగా మొత్తము తాత్పర్యమేమన యజ్ఞమనగా కామాద్యరిషడ్వర్గమును కాల్చి అహంకారమును బలివేసి ఆత్మానుభవమను యజ్ఞశేషమును భుజించుటయే ముక్తినొందుట. ఇది నిజమైన యజ్ఞముయొక్క తత్త్వార్థము.

ప్ర :—స్వామీ! ఆత్మ సాక్షిగానుటచేత సాక్ష్యధర్మములే ౖమెన ఆత్మకాపాదించునా?

ఉ :—అట్లు ఎన్నటికిని లేదు. ఇది నిరపేక్షమైన సాక్షిత్వము గలది; స్వయం ప్రకాశము. గృహమున దీపము వెలుగుచుండ గృహమందలి ధర్మకర్మముల సంబంధము దీపమున కెట్లుంటదో అట్లనే నవద్వారపురమగు ఈ దేహమున అసంగుడై సాక్షిమాత్ర ముగ నీవు సుఖముగ నున్నాడవు.

ఇట్లుండ ఒకనాడు శ్రీ చిదంబరరెడ్డిగారు తమ గ్రామమునకు వెళ్ళుచు "స్వామీ! తమ సన్నిధినుండి ఊరికి వెళ్ళవలె నన్నచో శివలోకమునుండి యమలోకమునకు వెళ్ళునట్లగుచున్నది'' అనిరి. ఆ వెంటనే స్వామివారు, ''అట్లెందుకు నాయనా! యమలోకము నకు వెళ్ళునపుడు మీరు సానందగణేశ్వరులై వెళ్ళండి. అది మీ దృష్టిచే శివలోకమే యగును.'' అని పల్కిరి. అది విని రెడ్డిగారు పరమసంతోషముతో ''అవును స్వామీ! తాము చెప్పిన వాక్యము సత్యము. "దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" అని పలుకుచు అపూర్వానందముతో వెళ్ళిరి.

వ్రత సమాప్తి కాలమునకు కొందరు పెద్దలనుండి యీ క్రింది విధముగ ఉత్తమ సందేశములు వచ్చినవి.

౧. ౧౦౮ శ్రీ జగద్గురు విశ్వారాధ్య మఠము, శ్రీ విశ్వేశ్వర శివా చార్య మహాస్వాములవారి (జంగమవాడి కాశి) నుండి :

"......తమ తపోనుష్ఠానము సాంగమంగళముగా పూర్ణమగు గాక!! జగత్తునకు శాంతికలిగించుగాక! ఆధ్యాత్మిక జీవనమే నిత్యశాంతిని కలిగించుటలో సమర్థమైనదని అనుభవులగు మీకు

ప్రత్యేకముగా వివరించుట అనావశ్యకమైయున్నది........

ఇత్యాశిషః"

౨. మైసూరు గీతాప్రచారిణీ సభాధ్యక్షులగు పూజ్య శ్రీ శ్రీ శ్రీ శంకరానంద భారతీస్వాములవారినుండి :

"........తమరు పూనిన చాతుర్మాస్య వ్రతము నిర్విఘ్నముగా నెరవేరుగాక! యని భగవంతుని ప్రార్థించుటయే గాక ముందు చేయబూనిన అన్ని శుభకార్యములందును పరమాత్మ తోడ్పడుగాక! యని వేడుచున్నాము. పరమాత్మ తమకు వివేకవైరాగ్యాది సాధన సంపదల నొసంగి తత్త్వజ్ఞానముద్వారా సర్వదుఃఖ నివృత్తి పరమానంద ప్రాప్తియగుగాక! యని ప్రార్థించుచున్నాను........"

(సం.) శం. భారతి

౩. గీతావాణి (ఆళ్ళగడ్డ) గౌరవ సంపాదకులగు శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారినుండి :

"........తమ చాతుర్మాస్య మహావ్రతము నిర్విఘ్నముగను శాంతరీతిగను సాగుచుండుట తెలిసి పరమసంతోషమయ్యెను. ఇదేరీతిగ వ్రతము పూర్తియై తత్ఫలము దేశహితమునకై వినియోగింపబడుగాక! యని కోరుచున్నాము........"

(సం) శంకరానంద, ముకాం:—నంద్యాల.

౪. శ్రీశ్రీశ్రీ మహర్షి మలయాళ స్వాములవారి (శ్రీచాతుర్మాస్య మహావ్రతాశ్రమము, గౌతమీ తీరము, సీతంపేట, రాజమహేంద్రవరము) నుండి :

"........మీరును కొందరు భక్తులును అచ్చట చాతుర్మాస్య వ్రతము సల్పుచున్నట్టు విని శ్రీసద్గురుస్వాములువారు చాల సంతసించిరి. ఈలాగున బ్రహ్మనిష్ఠులు, సాధుపురుషులు వ్రతములు

సల్పుచు ధర్మములు బోధించునపుడే లోకము పావనమగును. పూర్వయతీశ్వరులు అలాగున సల్పుటచేతనే లోకము పవిత్రతనొందెను. సర్వేశ్వరుని కృపచే నిప్పుడు అచ్చటచ్చట చాతుర్మాస్య వ్రతమును అనేకులు సల్పుచున్నారు. ఇది లోకాని కెంతో శ్రేయస్కరము...."

(సం.) బి. రాజయ్య, (ఆప్తకార్యదర్శి)

౫. శ్రీప్రయాగక్షేత్రము (అలహాబాదు) పండిత శ్రీ విశ్వనాథ ప్రసాద్ ముఖర్జీ గారినుండి:

"........ తమరు శ్రీచిదంబరాశ్రమమున నొనర్చు ఉత్తమ సంయమ విధానమెంతయు శివప్రదము. అసలు శ్రీచిదంబరాశ్రమము అను నామమునందే విమోహప్రదమగు నొకఘనత ఆత్మ ప్రబోధార్థ గర్భితమై మిక్కిలి సంతసము కల్గించుచున్నది. ఇట్టి పరిశుద్ధవాతావరణమున అచటి భక్తులతో కూడి శాస్త్ర వ్యాసంగముతోను సత్యాత్మనిష్ఠతోను సమయమును సద్వినియోగమొనర్చు విూజన్మ మెంతయు ధన్యము........ఓం స్వస్తి"—

ఇతి, విశ్వనాథ ప్రసాద్ ముఖర్జీ.

పై ముఖర్జీ గారినుండి పవిత్రగంగాజలము వచ్చెను. ఈయది సుప్రసిద్ధులగు సిద్ధపురుషుల స్థానమైనందున తీర్థప్రజలవలె వేలకొలది భక్తులు చేరిరి. శ్రీవారి గురుస్వాములగు శ్రీ సదానందస్వాములవారును శ్రీతాతా వెంకటప్పయును కుందనగుర్తి భక్తులును విచ్చేసిరి. ఏకాదశినాడు యథావిధిగా పూజ, పారాయణ నామభజన మున్నగు కార్యములతో ప్రారంభమయ్యెను. మహాత్ముల మహోపన్యాసములు వైభవముగా జరిగెను. రాత్రి మిక్కిలి వేడుకతో ఊరేగింపు జరిగెను. మరునాడు ద్వాదశి (10-11-51) శనివారంనాడు పూర్ణాహుతి జరిగెను. గొప్పగా అన్న

శాంతి గావింపబడెను. కార్యమంతయు సాంగమంగళప్రదముగా సమాప్తమాయెను.

వ్రతానంతరము ఐదారు రోజులు పూజ్యగురుమహాశయులతోను, ఉత్తమాధికారులగు కొంతమందితోను అచటనే ఉండి శాస్త్రశ్రవణాదులు గావించిరి. పిమ్మట గురుస్వాములవారు గంజిగంటకు వెళ్ళగా మనస్వామివారు నంద్యాలకు పయనమైరి. అచ్చట శ్రీత్యాగకుటీరమున గీతాభాష్యప్రవచనము జరుపుచు మార్గశిరమాసమున శ్రీగీతాజయంతీమహోత్సవమును వైదికవిధానముతో మిక్కిలి వైభవముగ జరిపిరి. పిమ్మట రెండుమాసములవఱకు అచటనే శాస్త్రప్రవచనము గావించిరి. వందలకొలది భక్తులు ప్రతిరోజు చేరుచు ఆనందముగా శ్రవణము చేయుచుండిరి.

అటనుండి రాగులపాడు శ్రీప్రణవాత్మానందాశ్రమమున పుణ్యారాధన మహోత్సవమున పాల్గొని, పిమ్మట నేరుగా మైసూరు శ్రీగీతా ప్రచారిణీ సభకు వెళ్ళిరి. అచ్చట మనస్వామి దాదాపు మూడు మాసములవరకు పూజ్యపాద శ్రీశంకరానందభారతీస్వాములవారి ఉత్తమసాంగత్యమున బ్రహ్మనిష్ఠాభ్యాసముతో గడపిరి. ఈ రోజులలోనే మన శ్రీవారు "శ్రీ శంకరగురు చరిత్ర సంగ్రహము'' అను పేర శ్రీ శంకరాచార్యులవారి చరిత్రను తెలుగుభాషలో రచించి తమ ఆచార్యభక్తిని వెలిబుచ్చిరి. ఈ చరిత్రరచనకు మాధవీయ శంకరవిజయము, శ్రీ శంకరానంద భారతీస్వాములవారి సంక్షిప్త శంకరవిజయము, గురువిలాసతరంగిణి అను మూడు గ్రంథములు మిక్కిలి తోడ్పడినవి. రచన మిక్కిలి అందముగా నుండును. శ్రీ శంకరవిరచితంబగు ప్రశ్నోత్తరీమణి రత్నమాలను

కన్నడమునకు పరివర్తించి, శ్రీ శంకరసన్నిధి నర్పించుకొనిరి. (అది నేడు ప్రకటింపబడియున్నది.)

సంయమశీలురగు శ్రీశంకరానంద భారతీస్వాములవారు మన స్వామివారితో ఎప్పటివలె ఉత్తమధార్మిక విషయములగూర్చి ముచ్చటించుట పరిపాటిగాన ఈ సమయమున చెప్పిన కొన్నిఉపదేశ వాక్యములను (తమ దినచర్యయందు వ్రాసియుంచిన వానిలో కొన్నిటిని) ఇట గనబరచెద.

"స్వామీజీ! సముద్రమున ఒకదానివెనుకనొకటి అలవచ్చు చున్నట్లు ఈజగజ్జీవనమున సుఖదుఃఖములు సహజముగా కావడి కుండలవలె వచ్చుచుండును. అపుడా యలలదాడికి ఓర్చుకొని సముద్రమును దాటుటకు తగిన పడవ కావలసియుండును. అటు లనే జననమరణాత్మకమయిన సంసార సాగరమును దాటుటకై సంత తము ఆత్మానుసంధాన రూపమగు భగవత్ స్వరూప జ్ఞానబలమనె డి పడవ ఆవశ్యకము."

"జ్ఞానబలము లేనిచో ప్రాపంచిక సుఖదుఃఖ భ్రమల బెదరింపు నెదిరింప జాలము."

"జీవనమున ఎదిరించి యుద్ధముచేసి విజయము గడించవల సినవి పాపములను, పాపాసక్తిని."

"లోకమున ఎట్టిమనుష్యుడైనను, ఎట్టిస్థితిలోనున్నను, ఎట్టి వేషభాషా చారములతో మెలగుచున్నను తానుమేరదప్పక తనమర్యా దను కాపాడుకొనుచు విషయములకు లొంగక నిరాడంబరముగ, నిరహంకారముతో మెలగుటయే జీవనము నందొక ఘనత."

"తనమనస్సును స్వాధీనము నందుంచుకొన్న మనుజుని నిశ్చయ మును ముల్లోకములైనను కదల్చజాలవు."

"ధైర్యమనగా కేవలము శారీరకబలముతో ముందుబోయి ఎదిరించుటయేగాదు. తనమనస్సును వ్యామోహపఱచుచు క్షోభపెట్టెడి పదార్థములు తన ఎదుట ఎన్నియుండినను వాటికి లోబడక దృఢమైన నిశ్చలవృత్తితో నుండుటయే నిజమైన ధైర్యము. ఇట్టి ధైర్యము ఆత్మజ్ఞానముచే దప్ప వేరు విధముగా నలవడదు. కనుక స్థిరచిత్తముతో బ్రహ్మాభ్యాస మొనర్చి యట్టిస్థితిని మనుజుడు బొందవలెను."

ఇట్టి పవిత్రాత్ముల సంఘమున శ్రీగీతాప్రచారిణీసభయందు వేసవికాలమంతయు నిచటనే గడిపిరి. పిమ్మట శ్రీచాతుర్మాస్య వ్రతాచరణమునకై శివలింగాశ్రమభక్తుల ప్రార్థనానుసారము కుందనకుర్తి రాదలంచి శ్రీభారతీస్వాముల సెలవుగైకొని ప్రసాదమును స్వీకరించి భక్తులగు శ్రీగోవిందప్పగారితో కలసి ప్రయాణమై గుంతకల్లు చేరిరి.

## ౨౫. "శ్రీశైల జగద్గురుమహాసన్నిధి"

ఆసమయమచటి శ్రీగిరిరాజ సూర్యసింహాసనాధీశ్వరులగు ౧౦౦ శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య శివాచార్యస్వాములవారి ద్వాదశ వార్షికోత్సవసందర్భము. స్టేషన్నులో దిగి వెళ్ళుచుండగా జగద్గురుస్వాములవారి సోదరులును, మనశ్రీవారికి కాశిలోని యుత్తమ మిత్రులును నగు వే॥ పండిత శ్రీగురుసిద్ధస్వామివారు మన శ్రీవారిని గనుగొని పరమానందముతో ప్రేమాలింగనమొనర్చి వార్షికోత్సవ విషయము తెల్పి కుందనకుర్తికి వెళ్ళనీయక శ్రీజగద్గురు మహాసన్నిధికి (గుంతకల్లుమఠమునకు) తోడ్కొని వెళ్ళిరి.

శ్రీవారచట వెళ్ళి భక్తిప్రపత్తులతో మహాసన్నిధికి సాష్టాంగ ప్రణామములాచరించిరి. శ్రీజగద్గురు స్వాములవారు పరమసంతో

షముతో, "తగిన సమయమునకు సన్నిధికి విచ్చేసితిరి. మహాసన్నిధి హృదయమున వీరారు మఱపురాకయున్నారు. శ్రీమల్లినాథుని కృపచే మీరు - సుఖంబుగనున్నారని మాకపుడపుడు తెలియుచున్నది." అని యవ్యాజప్రేమమయ భాషణములతో పలుకగా మన శ్రీవారు భయ భక్తులతో, "శ్రీమన్మహాసన్నిధిచరణకృపాలేశవిశేషమున నేను స్థిరసుఖంబున్నాడ, జీవితశుభమెల్ల భవత్కృపావిశేషమే" అని విన్నవించుచు తమప్రయాణవిషయంబులను నివేదించుకొనిరి.

ఆ వార్షికోత్సవమునకై నానాప్రాంతములనుండి భక్తాదులు పండితులు విచ్చేసియుండిరి. మఠమున స్థలాభావ కారణముచే శ్రీ జగద్గురు స్వాములవారు మన శ్రీవారిని భక్తురాలగు శ్రీమతి మెట్టుపల్లి మల్లమ్మగారి నూతన భవనమున నుండనియమించిరి. ఆసుగుణామతల్లియో సాక్షాత్ గంజిగుంటస్వాములవారి శిష్యురాలు (సతీర్థ్యురాలు). ఆ భక్తురాలి నూతనభవనమున నివసించుచు తమ నిత్యానుష్ఠానములను సల్పుకొనుచు గీతాపారాయణ ప్రవచనాది కార్యక్రమములను జరుపుచు కడవఱకు నిశ్చింతగా ఆ యుత్తమస్థానమునందుండిరి. కొందఱు భక్తాదులు సకాలమునకు వచ్చి శ్రవణము చేయుచుండిరి. కందనకుర్తి భక్తాదులును వచ్చిరి.

శ్రీ జగద్గురు మహాసన్నిధిని మూడురోజు లఖండముగా మహాసభ జరిగెను. వేలకొలది గొప్పగొప్ప పండితులు, పట్టభద్రులు అధికారులు సాధుపుంగవులు మహనీయులు నెందరో చేరియుండిరి. మహోపన్యాసములు గావింపబడెను. పెక్కు స్థలముల నుండి మహాసన్నిధికి దివ్యసందేశములు వచ్చెను. అచ్చట గుమిగూడిన మహనీయులును తమ సందేశముల నర్పించుకొనిరి.

మన శ్రీవారును "భక్తిపుష్పాంజలి" యను పేర నొక సందేశమును చదివి వినిపించి "గురుపదార్థము" అను విషయమైపై కొంత తడవుపన్యసించి శ్రీ శివలింగాశ్రమము తరఫున యథాశక్తి కానుక లర్పించిరి.

అనుదినము శ్రీ జగద్గురుస్వాములవారు చివరనొక గంటసేపుప న్యసించుచుండిరి. వీరి బోధ మృదుమధుర భావాన్వితమై విద్వ త్పూర్ణమై ధారాప్రవాహముగా వెలువడుచున్న అంతర్వాణి యైయుండెను. వారి యమృతవాక్కులలో కొన్నిటినిట బొందు పఱిచెద :—

"గుంతకల్లు ఆంధ్రకర్ణాటకముల సంధిపీఠము. సూర్యసింహాస నము. ఎల్లదేశభాషలకును మతాచారములకును జనాంగముల కును సంధిస్థానము. స్వయంప్రకాశమానుడై పక్షపాతరహితుడై సూర్యభగవానుడెట్లు సర్వులకు సమానముగా ప్రకాశమునొసం గునో అటువలె ఈ శ్రీశైలజగద్గురు సంస్థానము సర్వమాన్యమై ఎల్ల జనులకు చక్కని క్రియాచారవిచారజ్ఞానముల ప్రసాదించు చున్నది."

"దైవబలము తెరచాటుననుండు సూత్రధారునివగిది గోప్యము గానుండుచు అద్భుతకార్యముల జేయించి లోకమునకు మహదాశ్చ ర్యమును గొలుపును. సర్వాధారమగు నా దైవమును గాంచు కన్నులుగలిగి మనము వర్తించవలెను. దానికొఱకే ఈ యద్భుత ప్రదర్శనలు, కార్యకలాపములు........"

"ఈశ్వరానుగ్రహమువలన నున్నతి నొందుచుండు ఏ వ్యక్తిని గూడ దూరీకరించరాదు ; ఏవగించుకొనరాదు. అతని ఉన్నతాభ్యు

దయమును ఎవరును ఆపలేరు. అట్లు అంతరాయములు గల్గింప జూచిన నతనికే యీ దెబ్బలు తగులును."

"ఈ జగమున అజాత శత్రు వనిపించుకొనిన యే మహనీయుడును జనించినట్లుగపడుటలేదు. ఇయ్యది ఈ మాయామయమగు జగద్విధానము. ప్రకృతినియమమిట్లుండ మనుజుడు మాయా కార్యమున భ్రమనొందక దీనిస్వభావమును దెలిసి తన స్వధర్మమును భగవద్బుద్ధితో ఆచరించుచుండిన చాలును. తక్కిన విషయమును శ్రీశైలమల్లినాథుడే చూచుకొనును. అతని కృపయున్నంతవఱకు సురక్షితములై యన్నికార్యములు సఫలములగును. అతని కృపలేనిచో నెవరును రక్షకులు కారు. అట్టిసమర్థులెవరును లేరు. అందుచే దయాఘనుడైన పరమాత్మను స్మరించుచు మన కర్తవ్యకర్మల పాలించుకొనుచుండవలెను."

"భక్తుల సుఖమే మా పీఠముయొక్క సుఖము ఐశ్వర్యము నైయున్నది. మీ యందరి ప్రేమయే ఈ జగద్గురుస్వాములు. మీరందరు మేమైయున్నారు. మేమో! మీ యందరి స్వరూపముననున్నాము. అన్నప్పుడు ఉన్నది ఒక్క పరమార్థవస్తువే యన్నమాట."

"గురుశిష్యుల సంబంధమే హృదయాంతరాళముల నిట్లు ప్రేమచే వేధించుచుండగా, నిక రక్తసంబంధముచే జగత్తు మహామోహాంధకారమున మునుగుచుండుటలో నాశ్చర్యమేమి? లీలామయుడగు పరమాత్మ తన వినోదముకొఱకై ప్రేమలతనొకటిని వ్యక్తివృక్షాంతర్గతమగునట్లు ప్రాకింపజేసి తాను సూత్రధారియై జగన్నాటకరంగమున నిట్లు చలనమొందింపఁజేయుచున్నాడు.

అట్టి చాలకసూత్రధారిప్రజ్ఞనొంది ప్రవర్తించుచుండుటయే మానవుని మానవత్వము.''

''బోధకులయందెంతటి అపూర్వవిషయములున్నను, వినువారియందొకవేళ పాక్షికబుద్ధి యుండినచో పాక్షిక (భేద) దృష్టితోనే అర్థమగును. అక్షయమగు శాంతిసుఖముల నీయజాలవు. సల్లక్షణవంతుడై ప్రత్యగాత్మదృష్టితో పరమాత్మవిషయమును వినుచుండవలెను. ఇది సంప్రదాయము.''

''సద్భక్తుల హృదయకమలములు సూర్యసింహాసన తరుణభాను కిరణావరణమున వికసించి భగవదంకితమగు గాక. శుభం భవతు; శ్రీరస్తు; శివమస్తు.''

ఈ విధముగా ఉత్తమ భక్తిజ్ఞానవైరాగ్యసంభరితంబులగు మాటలతో శ్రోతల మనమొప్ప తన్మయుల గావించుచు వెక్కువిషయంబుల నఖండముగ శ్రీ జగద్గురుస్వాములవారుపన్యసించిరి.

మరుదినము మహాసంభ్రమముగ సంస్థానమర్యాదలతో శ్రీ జగద్గురు స్వాములవారు సుభూషితరజతాందోళికలో సుఖాసీనులైయుండ గ్రామోత్సవము (ఊరేగింపు) జరిగెను. వేలకొలది బీదసాదల కన్నదానము గావింపబడెను. కార్యమంతయు నిర్విఘ్నముగా పరిసమాప్తినొందెను. అటు పిమ్మట మనశ్రీవారు మహాసన్నిధి సెలవు బడసి ఆశీర్వాదములంది శ్రీశివలింగాశ్రమమునకు విచ్చేసిరి.

## ౨౬. ''స్వస్థానవాసము''

తమకత్యంత ప్రీతిపాత్రమైయున్న ఈయాశ్రమమున భక్తులెల్లరు సంతోషముతో నలర శాస్త్రప్రవచనము గావించుచు సన్నియమనిష్ఠలతో శ్రీచాతుర్మాస్యవ్రతమును జయప్రదముగా నడపిరి. ఈ

సమయమునసనే గుంతకల్లు శ్రీజగద్గురు శ్రీశైల సూర్యసింహాసనా ధీశులగు శ్రీజగద్గురు వాగీశపండితారాధ్య శివచార్య మహా స్వాములవారినుండి యీ క్రిందివిధముగా నొక ఆశీర్వాదపత్రము వచ్చెను:—

తే. 9-8-1952

"శ్రీశ్రీశ్రీ శంకరానందగిరిస్వాములవారికి"

శ్రీ శివలింగాశ్రమము, కుందనకుర్తి

శుభాశీర్వాదములు.

"..............మీరు చేయబూనియున్న గీతా ప్రవచనము నిర్విఘ్నముగా జరిగి జనులకు సుఖము గల్గుగాక యని యా శీర్వదించియున్నాము............మీ యాత్మప్రేమ మాయాత్మ యందెల్లప్పుడు నిండియున్నది. మీ కార్యమునందు జయమగుగాక."

ఇత్యాశిషః

..........................................

ఒకనా డుత్తమభక్తులొకరు స్వామిని సవినయముగా నిట్లడిగిరి:—

ప్ర:—భగవద్విశ్వాసమనగా నేమి స్వామీ?

ఉ:—గురువేదవాక్యములయందు విశ్వాసముంచుటయే భగవద్విశ్వాసము. భగవంతుడనగా గురువేదస్వరూపుడే.

ప్ర:—వేదములెన్నివిధములు?

ఉ:—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అని నాలుగు విధములు. మరొకరీతిని మంత్రము, బ్రాహ్మణము, ఆరణ్యకము అని మూడు విధములుగా విభజింప

బడియున్నవి. ఇది కాక మొత్తమువై కర్మకాండ, ఉపాసనా కాండ మరియు జ్ఞానకాండ అనియు విభజింపవచ్చును.

ఇట్లు వ్రతానంతరము భక్తులందరు కలసి అచ్చటికి కొన్ని మైళ్ళదూరమునసున్న శ్రీ సంగమేశ్వరక్షేత్రయాత్రకు వెళ్ళివచ్చి ఆశ్రమమున శాస్త్రవ్యాసంగమును జేయుచు సోదరశిష్యులతో సుఖముగానుండిరి.

## ౨౭. బెంగళూరు—బ్రహ్మవిద్యాశ్రమ వాసము

ఈ విధముగానుండ ఒకనాడు బెంగళూరు బ్రహ్మవిద్యాశ్రమాధ్యక్షులగు పూజ్యపాద శ్రోత్రియబ్రహ్మనిష్ఠ సురపురం శ్రీ శంకర శాస్త్రులవారు, "శాస్త్రపరిచయముగల్గి అనుష్ఠానపరులైన శ్రీ శివ లింగాశ్రమవాసులగు పరమహంస శ్రీ శ్రీ శ్రీ శంకరానందగిరి స్వాములవారిని పిలిపించుకొని వారిద్వారా చక్కగా శాస్త్రశ్రవణము చేయుండి" అని తమ యాశ్రమ కార్యకర్తల కాదేశించగా వారునట్లే మిక్కిలి భక్తివినయములతో మన శ్రీవారికి తగినరీతిని లేఖవ్రాసి బెంగళూరునకు రావలసినదిగా ప్రార్థించిరి. పూజ్యపాద శ్రీ శంకరశాస్త్రులవారి యాజ్ఞతో కూడిన ఆ జాబునుచూచి శిరసా వహించి బెంగళూరు వెళ్ళ నిశ్చయించిరి. ముందుగా తెలియజేసి తే. 14—11—1952వ తేది సాయంకాలము బెంగళూరు చేరిరి. అంతకుముందే వేచియున్న ఆశ్రమమువారు రైలువద్ద శ్రీవారిని దర్శించి మిక్కిలి భక్తిగౌరవపూర్వకముగా తోడ్కొని వెళ్ళిరి. ఆశ్రమవాసులందఱును శ్రీ స్వామివారిని సందర్శించి ప్రేమమయ

సంభాషణములతో పరస్పరసమాచారము లెఱుంగుచు పరమానంద మందిరి. శ్రీవారికి ఈ యాశ్రమము ప్రథమపరిచితము.

ఈ యాశ్రమము సుమారిరువది సంవత్సరములక్రింద శ్రీ॥ బ్ర॥ శ్రీ శ్రీ శ్రీ కబీరనాథస్వాములవారిచే స్థాపింపబడి అనుదిన బ్రహ్మవిచారణతో నలరారుచు సార్థకనామధేయమై నగరమధ్యముననున్న దివ్యభవనము. నాటి మొదలు నేటివఱకును వేదాంత శాస్త్రప్రవచనము రెండుపూటలు జరుపబడుచుండును. వందల కొలది శ్రద్ధాళువులగు శ్రోతలు విచ్చేయుచుందురు. ఇట్లు సర్వ విధముల అనుకూలమగు ఈ స్థానమును గని పరమసంతస మందిరి. కాని శ్రీ స్వామివారు నివసించుటకు ఏకాంతమగు పై కలశముగల గదినేర్పాటుచేసిరి. దీనిని కైలాసగిరియందురు.

మరు రోజునుండియే శ్రీస్వామివారు ఉదయమువేళ వేదాంత పంచదశి, సాయంకాలములయందు శ్రీ శాంకరగీతాభాష్యమును గూర్చి ప్రవచింప నారంభించిరి. మిక్కిలి శ్రద్ధాభక్తులతో ప్రతిరోజు అచ్చట చేరునట్టి గంభీరసభాసాగరమును తిలకించి తన్మయులై పరమోత్సాహముతో ప్రవచించుచుండెడివారు. భక్తాదులు శ్రీస్వామి వారి నతిప్రేమాదరణములతో సేవించుచుండిరి. ఇట్టి గాఢవిశ్వాస యుతమైన వారిప్రేమను మీరి రాలేక తే. 14—11—52 లో బెంగళూరు వెళ్ళిన శ్రీస్వామివారు తే. 23—5—54 వఱకును మిక్కిలి దీర్ఘకాలమీ యాశ్రమమునందే సన్నియమనిష్ఠలతో శాస్త్రప్రవచనాదుల జరుపుచు పరమసుఖముగా నుండిరి.

తామిచ్చటనున్న ఈకాలమున నైష్కర్మ్యసిద్ధి-తృతీయాధ్యాయము, కఠోపనిషచ్ఛాంకర భాష్యము, మాండూక్యోపనిషద్భాష్యము, గీతాభాష్యము-9 అధ్యాయములవఱకును ప్రబోధించిరి.

వెక్కు సత్కర్మలను తామాదర్శప్రాయుల్లై ఆచరించి వెక్కు భక్తులద్వారా ఆచరింపజేసిరి. ఇట్లుండ కొందఱుత్తమ భక్తులప్పుడ ప్పుడీ రీతిగా ప్రశ్నించి తమ సందేహములు బాపుకొనుచుండిరి.

ప్ర:—స్వామి! బ్రహ్మయజ్ఞమనగా నేమి?

ఉ:—మనమిప్పుడు చేయుచున్న వేదాంతవిచారణయే బ్రహ్మ యజ్ఞము. మరియు వేదోపనిషత్తులధ్యయనముచేసి ఆ విషయ ముల చక్కగా తెలిసికొని ఇతరులకు బోధించుటే బ్రహ్మయజ్ఞము. "స్వాధ్యాయ ప్రవచనే చ" సాధ్యాయమనగా తాఁజదువుట, ప్రవచన మనగా ఇతరులకు బోధించుట యని విస్పష్టముగా చెప్పబడినది.

ప్ర:—అయితే అన్ని యజ్ఞములలో గొప్పదెద్ది?

ఉ:—"శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప," "సర్వం కర్మాఖిలంపార్థ జ్ఞానే పరిసమాప్యతే"—అన్నట్లు ఈ జ్ఞానయజ్ఞమే అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. కాబట్టియే తైత్తరీయోపనిషత్తునందు "స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం", "ఏష ఆదేశః। ఏష ఉపదేశః। ఏషా వేదోపనిషత్। ఏతదనుశాసనం। ఏవముపాసితవ్యం।" అనగా "స్వాధ్యాయ ప్రవచనముల గూర్చి ప్రమాదము జెందరాదు, ఇది ఆదేశము, ఇది ఉపదేశము, ఇదియే వేదోపనిషత్సారము, ఇది శాసనము. ఇట్లే ఉపాసించవలెను." అని చెప్పబడియున్నది. బ్రహ్మవిద్యాప్రబోధ మనెడి ఈ దానము అన్ని దానములకంటెను శ్రేష్ఠమైనది. ఒకప్పుడుబ్రహ్మవిద్యాప్రదాతయగు యాజ్ఞవల్క్య నకు దానమీయబోయెను. కాని యావద్బ్రహ్మాండమునే దానముగా నొసంగినను యాజ్ఞవల్క్యులు గావించిన మహాదానముతో తులదూగదని యెఱింగి జనకుడు మహాశ్చర్యమునందెను, జ్ఞాన దానఘనతను కనుగొనెను, భక్తితో నమస్కరించెను."

మరొకరి ప్రశ్న:—స్వామీ ! లోకమున శూద్రుడనువాడున్నాడా ? సర్వమును బ్రహ్మమైయుండ శూద్రత్వమెక్కడిది ?

ఉ:—ఔను; ఒకప్పుడున్నాడనియే చెప్పవలసివచ్చును. వేదవిరుద్ధ మగు జీవితము గడపునపుడాతని కామాట అన్వర్థమే. ఎందుకనగా ఏ వేదములు సర్వము బ్రహ్మరూపమని చెప్పెనో ఆ వేదములే శూద్రు డను మాటను కూడ చెప్పినది. అనగా వేదధర్మవిరహితములైన స్వేచ్ఛాచారవిచార ప్రవర్తక కర్మలను జేయువారందఱును శూద్రులే. ఇక వేదచోదిత ఋజు మార్గ ప్రవర్తకులందఱును బ్రాహ్మణులే. బ్రహ్మస్వరూపులే.

ప్ర:—అయితే అట్లు శూద్రులు బ్రాహ్మణులైన వారెవరైనను కలరా ?

ఉ:—లేకేమి ? రైక్వుడు, సత్యకాముడు, ధర్మవ్యాధుడు మున్నగు వారు ఉపనిషత్ప్రసిద్ధులైయున్నారు. వేయేల ? సూత మహాముని లు శౌనకాది మహామునులగు బ్రాహ్మణులకు తత్త్వమును బోధిం చినట్లు వినుచున్నాము. ఎందరో రాజులు వైశ్యులుకూడ బ్రాహ్మ ణులకు తత్త్వోపదేశమును చేసినట్లు కనబడుచున్నది. అట్టి సత్య శౌచదయాధర్మాది గుణసంపద్విశిష్టత గలవాడై తత్త్వజ్ఞానముతో నీవును బ్రాహ్మణుడు గావచ్చును. వస్తుతః సర్వమును బ్రహ్మమే. కాదనుటెట్లు ? వ్యాపకబ్రహ్మము నెఱుగుటకు తగుదృష్టిగలవారే బ్రహ్మణ్యులు లేదా బ్రాహ్మణులు.

ప్ర:—స్వామీ! ఏకాంతమును తాము విశేషముగా కోరుచుం దురే ! ఆ సుఖమెట్లుండును ?

ఉ:—ఏకాంతమందలి నైర్మల్యసుఖానుభవము నెదుట ఇంద్రాది త్రిలోకసుఖాదులును తృణప్రాయములై రసవిహీనములుగా తోచు

చున్నవి. ఆ పరమతుష్టిని విడచి ఈవల రానీయదు. ఒకవేళ ఇతరుల బలాత్కారముచే వచ్చినను అదేస్మృతి దృష్టిచెదరకుండును. యథోచిత కర్తవ్యకర్మనాచరించి అదేస్థితికి వెళ్ళును. నిజమైన ఏకాంతమనగా స్వాత్మరూప వస్తుదృష్టియే. దానికి బాహ్యసాధన మీ విజనప్రదేశము.

ప్ర:—స్వామీ! పూజలని చేయుదురు గదా! ఈ రాతిని పూజించిన లాభమేమి?

ఉ:—ఆ విగ్రహము మీబుద్ధికి రాయిగా తోచినందున మీ రట్లడుగుచున్నారు. రక్తమాంసాదులతో నిండి నానావికారాన్వితమై అసహ్యమై రోగభూయిష్ఠమైయున్న ఈ దేహేంద్రియములను వ్యామోహబుద్ధిచే సుఖరూపములని సత్యములని భావించిప్రేమించి అభిమానించి సేవించుటకంటె నిర్వికారమగు శిలయందు భగవద్బుద్ధినుంచి భజించుట చాల మంచిదే. రాయియను బుద్ధితో ఎవరును పూజింపరు. భగవద్భావనతో పూజించినచో తన బుద్ధి శుద్ధమై బ్రహ్మానందానుభవమునకు సాధనమగుచున్నది.

ప్ర:—అయితే రక్తమాంసాదియుక్తమై యుండు గురుని దేహమును కూడ పూజింపరాదా?

ఉ:— శివశివా! అప్రశ్నయడుగరాదు. గురుడు జగద్వంద్యుడు అతనికంటె గొప్ప పూజార్హమైన వస్తు వీలోకమున లేదు. "న గురోరధికం న గురోరధికం"—అన్నారు. శిష్యుల అజ్ఞానాంధకారమును తొలగించగల జ్ఞానజ్యోతి వెల్గొందెడు పరమ పుణ్యమయస్థాన మా దేహము. ఇట్టిప్రశ్నయే తగదు.

ప్ర:— స్వామీ! తపస్సు చేయవలెనందురే! ఆ తపస్సనగా నేమి? అది మాకుసాధ్యమా? దయతో తెల్పుడు.

ఉ:—తపస్సనగా ఒకానొక విషయమును గూర్చి చిత్తము చింతించుచు తదాకారమగుట. జగత్తులో తపస్సు చేయని వారెవరును లేరు. ప్రతివాడును ఇట్టి ఏదేనొక తపస్సును చేయుచునే యున్నాడు. కాని అనాత్మవిషయచింతనారూపమైన తపస్సువలన దుఃఖము బంధము గలుగుచున్నది. అట్లనే చిత్తము నిరంతరము భగవద్విషయకచింతన చేయుచు తపించుచు తదాకారమై పరమ శాంతినందుచున్నది. మనస్సు పశమించుచున్నది. భగవద్దర్శన లాభము కలుగుచున్నది. ఈతపస్సు సాత్త్విక రాజసిక తామసికములని మూడు విధములు. గీతలో 17వ అధ్యాయము 14—16 శ్లోకముల యందు ఈత్రివిధతపస్సులను గురించి చక్కగా నిరూపింపబడినది. కాన శ్రద్ధగలిగి గీతను చక్కగాపరిశీలించి విషయమును తెలిసికొనుడు. ప్రయత్నశీలున కసాధ్యమెద్దియు లేదు.

ప్ర:— అనుష్ఠానమనగానేమి స్వామి?

ఉ:— వృత్తిని ఒకే చోటుంచుట. అదియే ఆత్మ, బ్రహ్మము, అదియే నీవు.

ప్ర:—స్వామీ! గురువులు లేకపోయినను వారి ఛాయాచిత్రమును (ఫోటోను) పూజింతురే! ఇది సరియేనా?

ఉ:—చాలమంచిదే! గురువనగా సాక్షాత్ పరంబ్రహ్మము. ఆదిమధ్యాంతరహితమగు పదార్థము. అది పోవునది గాదు, వచ్చునది గాదు. తత్ప్రతీకమగు గురుమహాశయుల భావచిత్రమును పూజించుట శిష్యుల ఆముష్మికసాధన కత్యంతోపయోగకారి. శ్రీ వివేకానందస్వామి యంతటి ఘనుడే సద్గురువగు శ్రీరామకృష్ణుని మహిమ నత్యద్భుతముగా పొగడుచు, "శ్రీ రామకృష్ణ సద్గురువుయొక్క పటముగల ఆ యిల్లు నాకు పవిత్రక్షేత్రము.

వారి చిత్రమును పూజించువారు పరమధన్యులు. వారి సేవచేయు టకు నేను సదా సిద్ధుడను.''—అని యిట్లు గురుభక్తిపరవశులై పలికిరట. కావున నీ గురుని చిత్రమునుంచుకొని వారుపదేశించిన మహామంత్రమును వారొసంగిన దృష్టితో అనుష్ఠించుచు పూజిం చుచుండుము. మేలు కలుగును.

ప్ర :—స్వామీ! ఈ సంసారములోనుండుచు బ్రహ్మవిద్య నభ్యసించవలెనంటే సాధ్యము లేదు. మీవలె అన్నిటిని విడిచి నప్పుడే అది సాధ్యము గదా!

ఉ :—ఔను, ఇట్లెంతకాలమునుండి అనుకొనుచున్నారు? ఇట్లనుకొను మాటలు హృదయపూర్వకములైయుంటే ఈ వేళకు విడిచియుందువు. అట్లొకమారుగా విడిచిపెట్టుటకు నీకు చేతగాదు గాన విశ్వాసముంచి కలిగినదానితో తృప్తిజెందుచు, ఈశ్వరుడు నీ కిచ్చిన సమయమును వృథాచేయక సన్నిష్ఠతో బ్రహ్మాభ్యాసముతో గడపుచు వచ్చినచో క్రమముగా పూర్ణముగా విడిచిపెట్టుటకు సమర్థులగుదురు. దినమునకు మొత్తములో కనీసము 3 గంటల న్నైనా శ్రద్ధగా నిష్ఠచేయుచు వచ్చినచో క్రమముగా అన్నియు నిన్ను వీడిపోవును.

ప్ర :—స్వామీ! ఈ లోకమందలి శబ్దస్పర్శాది విషయము లెంత వలదన్నను చూచినపుడు మరల మనస్సును లాగివేయు చున్నవిగదా! ఏల?

ఉ :—ఔను, కసవును జూచి పశువు పరుగెత్తునట్లు నీ మనస్సు విషయముల జూచి పరుగెత్తుచున్నదంటే మీరు పశుసమానులై యున్నారనుటయే గదా! "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః"-అన్నట్లు నిజమైన వివేకవైరాగ్యములతో విషయరూపతృణమును అసత్య

మని తలంచి మనస్సును మహాదేవునియందుంచినచో ఇకనది తన పశువృత్తిని మానును. అఖండముగా భగవన్నామము జపించుము.

ప్ర :—సమయమున మనస్సు నిలువదు గదా స్వామీ !

ఉ :—అలవాటున్నచో తప్పక స్వాధీనమగును.

ప్ర :—స్వామీ ! నాకు యథామతి శాస్త్రపరిచయము గలదు గాని ఆత్మవిషయకమగు దార్ఢ్యత ఇంతవఱకును కలుగలేదే ! కారణ మేమి ?

ఉ :—నాయనా ! ఆత్మయందు నిలుకడ, దృఢత అనునది పుస్తకముల విద్యగాదు; అది హృదయవిద్య. శాస్త్రములు దానిని చూపు సంకేతములు మాత్రమే. శాస్త్రపరిచయమంది నిన్ను నీవు చక్కగా చిత్తైకాగ్రతతో విచారించుకొనుము. ఆత్మసంభావన యెంనర్చుచుండవలెను. శాస్త్రపరిచయమంది సంస్కరింపబడిన నీ బుద్ధి అంతర్ముఖమై విచారించుచు పోగా ఎంతవఱకు వెళ్ళి ఆపై విమర్శింప (ఊహింప) శక్తిలేక ఆగిపోవునో ఆ చోట అదేస్థితిలో నిలిచి చూడుము. అపుడు తత్త్వము అనుభవమగును. ఈ సంశయములుదయింపవు.

ప్ర :—బుద్ధీ ! ఈ జగత్తు దయాధర్మవిహీనమై అజ్ఞానముతో నిండి ఎంత ఘోరమైయున్నది ! ఇదెట్లు సరిపోవును ?

ఉ :—(స్వామివారు తటాలున) నాయనా ! అట్లనకుము. నేలనున్న రాతిని నెత్తికెత్తుకొన్నట్లు జగద్భర్తయగు విశ్వంభరమూర్తి యుండగా మీకెందులకా కర్తవ్యము ? ఈ యాథార్థ్యము నెఱింగి మీకు మీరు దయాధర్మబుద్ధిగలిగి ఘోరమును వీడి అజ్ఞాన విదూరులై మీ ప్రస్తుత విధానమును మార్చుకొనినచో పిమ్మట

సర్వము సుగమమే యగును. అప్పుడంతయు శివమయముగా శివలీలగా తోచును. తను దృష్టి చక్కగానున్నచో లోకమున మరెచ్చటను దుష్టతనముగపడదు. వస్తుతః నీ స్వరూపదృష్టి యందివి అళీకములు. ఉన్నదొకటే పరమార్థసత్త. అదియే నీవు.

ప్ర:—స్త్రీలకు వేదవిద్యాధికారము లేదని చెప్పెదరే! ఉత్తమ స్త్రీలు లేకపోయినచో పవిత్రభారతావని పరమపవిత్రమైనదని పేరెట్లు వచ్చుచుండెను స్వామీ?

ఉ:—ఔను, మీరు చెప్పినట్లు ఉత్తమస్త్రీలకా యధికారము న్నది. ఉపనిషత్తులయందు వేదములయందును స్త్రీలకు వేద విద్యాధికారమున్నట్లు ప్రమాణములున్నవి. "బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే" అనగా స్త్రీలు వేదవిద్యనభ్యసించుచు బ్రహ్మచర్యవ్రతమాచరించినట్లు తెలియుచున్నది. మైత్రేయి, సులభ, గార్గి మున్నగు స్త్రీలందఱును వేదతత్త్వమునెఱింగినట్లు శ్రుతిప్రసిద్ధులైయున్నారు. కొందరు స్మృతికారులుమాత్రము నిషేధించిన విషయమును గూర్చి పూజ్యపాద మహర్షి మలయాళ స్వాములవారు ప్రత్యేకముగా నొక గ్రంథమునే రచించినారు. దానిని చక్కగా పరిశీలించి పూర్ణసమాధానమందవచ్చును.

ప్ర:—స్వామీ! వేదాంతసిద్ధాంతమున అజాతవాదము, దృష్టి సృష్టివాదము, సృష్టిదృష్టివాదము అని పారిభాషికశబ్దముల జెప్పుదురుగదా! వాని యర్థమేమి? దయతో వివర్శింపుడు.

ఉ:—విద్వదనుభవమున ఏచోట ఒకే పరమార్థసత్త అంగీ కృతమగునో అది అజాతవాదమని చెప్పబడును. ఇక పారమార్థి కము, ప్రాతిభాసికము అనెడి సత్తాద్విత్వము ఎచ్చట అంగీకరింప బడునో దానిని దృష్టిసృష్టివాదమందురు. మరియు పారమా

ర్థికప్రాతిభాసిక వ్యావహారికములనెడి సత్తాత్రయ మెచ్చట అంగీకరింపబడునో అది సృష్టిదృష్టివాదమనబడును.

అజాతవాదమున ఆరోపాపవాదములు గాని వాచ్యలక్ష్యములు గాని అంగీకరింపబడనందున అనగా ఈ కల్పనలే లేనందువలన ఏదియు కలుగలేదు. ఉన్నది అజమగు ఒకే పరమార్థ సత్త.

న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః।
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥

అనగా అట్టి స్థితియందు నిరోధము ఉత్పత్తి బద్ధుడు సాధకుడు ముముక్షువు ముక్తుడు ఏవియు లేవు.—ఇదియే పరమార్థసిద్ధాంతము. దృష్టిసృష్టివాదమనగా స్వప్నకల్పితుడగు చక్రవర్తివలె జీవకల్పితుడగు ఈశుడు తత్ పదమునకు వాచ్యార్థము. అవిద్యావృత్తుడై తెలియబడని బ్రహ్మస్వరూపుడైన జీవుడు త్వంపదమునకు వాచ్యార్థము. ఈ రెండు పదములకును శుద్ధబ్రహ్మమే లక్ష్యార్థము. కాన దృష్టియే సృష్టి. "దృష్టిరేవ సృష్టిః" అని ఈ వాదముయొక్క లక్షణము. పిదప వ్యావహారికమగు సృష్టిదృష్టివాదపక్షమున బింబ ప్రతిబింబవాదము, కార్యకారణోపాధివాదము, అవచ్ఛిన్న అనవచ్ఛిన్నవాదము, అవచ్ఛేదవాదము, ఆభాసవాదము- అని 5 ప్రకారములు గలవు.

(వీని స్వరూప విమర్శను గుఱించి శ్రీవారు సవిస్తరముగా బోధించిరి గాని గ్రంథవిస్తరభీతిచే నే నిచ్చట తెల్పుటలేదు. విచారసాగరము మున్నగు గ్రంథములయందు ఈ విషయము చక్కగా వర్ణింపబడియున్నది. అందు తిలకించవచ్చును.)

శ్రీవారు విజయసంవత్సరచాతుర్మాస్యమహావ్రతమును సదాచారవిచారములతోను, అపక్వాహారనియమముతోను రెండుపూటల

నియమిత సమయమున మాత్రము వేదాంతప్రవచనము సలుపుచు తక్కిన కాలమున మౌననిష్ఠతోను, సద్గ్రంథావలోకనాదినియమముతోను పరమైకాంతికసుఖమనుభవించుచుండిరి. ప్రవచన సమయమున కొందఱుత్తమశ్రోతలు శ్రీవారినప్పుడప్పుడు ఆధ్యాత్మిక విషయములగూర్చి ఇట్లు ప్రశ్నించుచు సందేహముల బాపుకొనుచుండిరి.

ప్ర:—పూజ్యస్వామీ! ఈనాడు కేవలము తత్త్వంపదార్థములనుగూర్చియే బోధింపవేడుచున్నాము.

ఉ:—నాయనలారా! తత్త్వంపదముల అర్థము శక్యార్థము లక్ష్యార్థము అని ద్వివిధము. శక్తివృత్తిచే శబ్దము దేనిని బోధించునో అదియే శక్యార్థము (వాచ్యార్థము) అని అర్థము. శ్రీ రామనాథయ్యర్శేష్మిగా రిక్కడ కెట్లు వచ్చిరి? అని ప్రశ్నించినచో కావేరిపట్నం మీదుగా వచ్చిరని చెప్పుదుము. అయితే కావేరిపట్నం మీదుగా అను ఈ పదమునకు ఆ పట్టణమందలి మిద్దెలపైపై భాగమున వచ్చిరి—అను అర్థము శక్యార్థమనబడును. కాని ఈ శక్యార్థము ఇచట అసంభవము, పొసగదు. కనుక ఈ శక్యార్థమునకు విరుద్ధమైన, కావేరిపట్నం మార్గముగా వచ్చిరనెడి అర్థము గదా తోచును! ఈ యర్థమునకు లక్ష్యార్థమనియు, దీనినే లక్షణావృత్తియనియు చెప్పుదురు. అనగా లక్షణావృత్తితో పదము దేనిని బోధించునో అది లక్ష్యార్థమనబడును. "సింహో దేవదత్తః" అను చోట దేవదత్తుడు సింహమువంటి బలసాహసములు గలవాడని అర్థమే (లక్ష్యార్థమే) గాని, నాలుగు కాళ్ళు, కోరలు, కేసరములు గలిగియున్నవాడను శక్యార్థము అసంభవము. సిద్ధాంతమునందు శక్తిపదార్థము సామర్థ్యవిశేషబోధక

_మైయున్నది. శక్యార్థముయొక్క సంబంధరూపముగా లక్షణా వృత్తియున్నది. మనము తెలియవలసినది ముఖ్యముగా లక్షణా స్వరూపమునే.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే" అనగా దేనినుండి ఈ భూతములు (జగత్తు) పుట్టుచున్నవో అదియే బ్రహ్మమనియు, "జన్మాద్యస్య యతః" అను సూత్రరీతిని జగదుత్పత్తిస్థితి లయములు దేనినుండి యగునో అది బ్రహ్మమని బ్రహ్మము యొక్క తటస్థలక్షణమును తెల్పుచున్నది. ఇక ఈ తత్పదము యొక్క లక్ష్యార్థమును బోధించునట్టి వాక్యములు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను మున్నగునవి. ఇట సత్యమనగా త్రికాలాబాధ్యమైనది. జ్ఞానమనగా చేతనరూపము. అనంతమనగా దేశ కాలవస్తుపరిచ్ఛేదరహితమై, అఖండమైన పరబ్రహ్మమని భావము. బ్రహ్మమునకు సత్యజ్ఞానాది లక్షణములు స్వరూపములై యున్నవి.

ఆ పిదప ఏ జీవపదార్థము జాగ్రదాద్యవస్థలయందు స్థూల సూక్ష్మాది విషయములననుభవించుచున్నదో అదియే త్వంపద వాచ్యార్థము. ఈ యవస్థలు జీవుని తటస్థలక్షణములు కూడనై యున్నవి. ఇక "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత ర్జ్యోతిః పురుషః న హి దృష్టేః ద్రష్టారం పశ్యేత్" అనగా, బుద్ధ్యుపహితమై ప్రాణసమూహమధ్య ప్రకాశవంతమై పూర్ణమై యున్న ఏ సద్వస్తువు నేత్రవృత్తిద్వారా రూపముల చూచుచున్నదో, మరియు నేత్రములచే ఏ పురుషుడు చూడబడజాలడో అట్టి స్వయంప్రకాశ స్వరూపమే త్వంపద లక్ష్యార్థము. (స్వరూప లక్షణము)

ఈ యర్థములుగల తత్—త్వం పదములకు తత్త్వమసి మహా వాక్యముయొక్క శక్యార్థమందు అభేదజ్ఞానము సంభవింపదు. ఎందుకనగా తత్-త్వం పదముల వాచ్యార్థమున జీవబ్రహ్మలిరు వురు పరస్పర విరుద్ధ లక్షణములుగలవారైయున్నారు. బ్రహ్మమో సర్వజ్ఞుడు, సర్వజగత్కర్త; జీవుడన్ననో అల్పజ్ఞుడు, కర్మఫల భోక్త, కర్త. ఇట్టి విరుద్ధలక్షణములుండ వీరిరువురకు ఐక్య మెట్లు సంభవించును? అందుచే భాగత్యాగలక్షణమున తదుభయ చేతనములు నొక్కటియే అను తత్-త్వం పదముల శుద్ధార్థమగు నిర్వికల్పజ్ఞానము (అభేదజ్ఞానము) గలుగును.

ఆ పిమ్మట సమానాధికరణసంబంధము (విశేషణవిశేష్య భావ సంబంధము), ప్రాగ్భావ ప్రధ్వంసాభావ అన్యోన్యాభావములను పెక్కువిషయముల గూర్చియును సవిస్తరముగా పెక్కు దృష్టాంతములతోనే నాటి ఉపన్యాసమును ముగించిరి. మరొకనాటి ఉదయము ఒకరిట్లడిగిరి :—

ప్ర:—అధ్యాససామగ్రులని చెప్పెదరే! అవేవి స్వామీ?

ఉ:—మొదటిది:—సజాతీయవస్తుజ్ఞాన జన్యసంస్కారము. అనగా శుక్తియందు రజతభ్రమ కలుగుటకు ప్రమాతయొక్క, నిజమైన వెండిని చూచియుండిన సంస్కారము.

రెండవది :—అధిష్ఠాన సామాన్యరూప జ్ఞానము, విశేషరూపా జ్ఞానము, శుక్తిసామాన్యరూపత్వాజ్ఞానము. విశేషాంశమగు నీలపృష్ఠత్రికోణాకృతుల అజ్ఞానము.

మూడవది :—కల్పితపదార్థమునకును తదధిష్ఠానమునకును సాదృశ్యలక్షణము. అనగా అట్టి సాదృశ్యముగల శుక్తియందే రజతభ్రమయగును గాని ఘటాదులయందు గలుగదు.

నాల్గవది:—ప్రమాతయందుండు ఆశయను దోషము.

ఐదవది:—ప్రమాణము అనగా నేత్రమునకు వ్యాధి (కామలాది) దోషములుండినపుడు ఎదుటనున్న పదార్థము వేరురూపమున భాసిల్లును. పిమ్మట,

"అధ్యస్తస్య కుతః సత్త్వం అసతస్తు కుతో జనిః।
అజాతస్య కుతో మృత్యుః ప్రారబ్ధమసతః కుతః॥"

అనునట్లు అధ్యాసయెవరికి? ఎచ్చట? ఎట్లు? అధ్యాసయనగా నిజమా? మున్నగు పెక్కు విషయములను గూర్చి శ్రీవారు విపులముగా వాక్రుచ్చిరి.

ఒకనాటి సాయంకాలమున ఒకరు:—

ప్ర:—స్వామీ! మీరు పాదముల తాకించి నమస్కారముల చేయించుకొనరే! అయితే మీకింకను జ్ఞానము కలుగలేదని తోచుచున్నది.

ఉ:—"యం భావం దర్శయేద్యస్య తంభావం సతు పశ్యతి"

అన్న ప్రకారము మీరెట్లు చూచిన మేమట్లే అగపడుదుము. మంచిదే!

మరొకనాటి ఉదయము మరొకరు:—

ప్ర:—పూజ్యస్వామీ! అజ్ఞానమనునది భావపదార్థమా? అభావపదార్థమా?

ఉ:—మీరధ్యాసనొప్పుకొందురా? లేదా?

"ఒప్పుకొందుము"

అట్లైనచో అజ్ఞానము భావపదార్థమే. బ్రహ్మజ్ఞానముచే తొలగిపోవునట్టి ఏ అజ్ఞానమును శక్తియనియు మాయయనియు అవిద్యయనియు పిలుతురో అది భావపదార్థమే. అదియే అధ్యాస మూలము. అట్టి అధ్యాసయే "అహమజ్ఞః" అని కనబడుచు

న్నందున ఆధ్యాసికజీవనానుభవమునుబట్టి (ఆధ్యాసికదృష్టితో) అజ్ఞానము భావపదార్థమని చెప్పవచ్చును. (సర్పజ్ఞానము సర్పము (భ్రమాజ్ఞానము తద్విషయము) ఈ రెండును ఆధ్యాసికములే. కాని అజ్ఞానమనునది అనాది. ఈ అజ్ఞానముయొక్క జ్ఞానము సాక్షిరూపమున నిత్యమైయున్నందువలన ఇదియును అజమే (పుట్టుకలేనిది). అయితే అజ్ఞానమనునది అధిష్ఠానము నందు అనిర్వచనీయమైన భావపదార్థరూపమున విలసిల్లి తత్త్వజ్ఞానముచే నివర్తించునదైయున్నది.

ప్ర:—జీవేశ్వరులను కల్పించినది బ్రహ్మమేనా?

ఉ:—కాదు. జగదుపాదానకారణమగు మాయ పరమాత్మాభాసమును వడసి శుద్ధమాయాప్రతిబింబమున ఈశ్వరుడుగను మలినావిద్యాప్రతిబింబమున జీవునిగను కల్పించెను.

ప్ర:—సృష్టింపబడిన జీవేశ్వరాది భూతములయందు పరమాత్మ ప్రవేశించెనని చెప్పుదురే! సర్వరూపములు తానైయుండగ ప్రవేశించెననుట ఎట్లు స్వామీ?

ఉ:—ఔను; వ్యాపకుడగు తాను ప్రవేశించెననుట సరిగాదు. కాని తాను ప్రతిబింబించెననుటయే ఈ ప్రవేశ తాత్పర్యము.

ప్ర:—స్వామీ! వృత్తివలన ప్రయోజనమేమి?

ఉ:—ఆవరణమును భంగపరచుట ముఖ్యప్రయోజనము. అజ్ఞానావరణముల భగ్నమొనర్చి ఆత్మను అఖండాద్వితీయ బ్రహ్మముగ అనుభవింపజేయుటకు పరమసాధనము.

ప్ర:—స్వామీ! గురుకృప గురుకృప యని విశేషముగా చెప్పుచుందురే! దాని అర్థమేమి?

ఉ:—సమయమునకు ఆత్మవిషయకమగు వృత్తి జ్ఞప్తికి

వచ్చుటయే. ఆ వెంటనే తాపములు చల్లారి ఆత్మశాంతి గల్గును. ఆత్మశాంతియే శ్రీ గురుకృప—ఓం.

శ్రీవారి సమయమున సామవేదాంతర్గతమగు మహోపనిషత్తును హిందీభాషనుండి తెలుగుభాషకనువదించిరి. మరియు "స్వరూపసాక్షాత్కార"మను కన్నడ గ్రంథమును ఆంధ్రభాషలోనికి తర్జుమాచేసిరి.

మరియు ఈ వ్రతసుసమయముననే మన శ్రీవారికి చిరపరిచితులును శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులును, అఖండ సచ్చిదానందస్వరూపులును, అనికేత స్థిరమతులునునగు ౧౦౮ శ్రీ శుద్ధచైతన్యమహాస్వాములవారు బృహద్గ్రంథమగు "శబ్దార్థకల్పతరు" వనెడి సంస్కృతాంధ్ర నిఘంటువుయొక్క రచనాకార్యనిమగ్నులై, తమ శిష్యులగు న్యాయవేదాంతశిరోమణి శ్రీ నారాయణమూర్తిగారితో బెంగళూరునకు విచ్చేసి, తమ ప్రధాన (గృహస్థ) శిష్యులగు విద్వాన్ శ్రీ ఎస్. రాజగుప్తగారి గృహమునందును శ్రీ గీతామందిరమునందును దాదాపు ఆరు మాసములకు పైగా నివసించుచు, అప్పుడప్పుడు బ్రహ్మవిద్యాశ్రమమునకు వచ్చి దర్శనమిచ్చుచు తమ యథార్థపాండిత్యానుభవములతో కూడిన అమృతవాణిచే శ్రోతల నానందింప జేయుచుండిరి. మరియు మన శ్రీవారికి పెక్కు సంస్కృత హిందీ వేదాంతగ్రంథములను ప్రేమతో ప్రసాదించిరి. వీరి మహోపకారము అవిభాజ్యము శాశ్వతంబని శ్రీవారు చెప్పుచుందురు.

ఈ చాతుర్మాస్యమహావ్రత విరమణోత్సవము (కార్తీక శుద్ధ ఏకాదశి తే. 17–11–53) నాడు రుద్రాభిషేకము, సహస్రనామార్చన, విరజాశాంతిహోమము గీతోపనిషద్బ్రహ్మసూత్రాదిపారాయణము

అఖండభజన మున్నగు కార్యక్రమములతోను పెక్కు మహాత్ముల ఉపన్యాసములతోను మరునాడు ద్వాదశికి అన్నసంతర్పణాదులతోను మహా వైభవముగా సమాప్తమయ్యెను.

ఈ సమయమందుననే "తాత్త్వికకవితావిశారద" సాధు శ్రీ సహజానందులవారు మన పూజ్యపాద శ్రీ శంకరానందగిరిస్వాముల వారికి భక్తిపూర్వకముగా ఈ క్రింది పద్యపంచరత్నమాలను సమర్పించిరి:—

సీ॥ ఆబాలబ్రహ్మచర్యాశ్రమపాలన
బ్రహ్మ విద్యాభ్యాస పటిమదనరి
సంగపరిత్యాగ సంన్యాస మొనరించి
కాశినివాసంబు కాంక్షజేసి
జ్ఞానయోగాభ్యాసగరిమ బ్రహ్మానంద
మొంది జిజ్ఞాసులు నొందముక్తి
దగినట్టి శ్రుతియుక్తి తత్త్వార్థ మెఱిగించి
జన్మసార్థకమగు జాడదెలుపు

గీ॥ చవని విహరించు పరమహంసార్యవర్య;
శంకరానందగిరిదేవ! సన్మనమున
ప్రణుతిశతముల జేసెద భవముబాయు
సాధుసంస్తవమగు శాంతిసాధ్యమంచు

సీ॥ కామంబుగెల్చి యోగంబున మదినిల్పి
బ్రహ్మానుభూతిచే బరగువారు
అపరశంకరరూపులాశుకదేవులా
యననొప్పమూర్తులై యలరువారు

శృంగారమోహన సినిమాప్రపంచాన
గెఱిగీచి మాయను గెలిచినారు
బ్రహ్మచర్యంబును వరగ సంన్యాసంబు
బాలించికీర్తిని బడసినారు

గీ|| ఇట్టిమీమూర్తినపుడపుడెంచి మదిని
కన్నవలనొత్తికొని చూతు కాంక్షదీర
నియమశీలనిబద్ధ చిన్నిష్ఠనొప్పు
మీదుచరితంబు జెప్పెద మిగులవేడ్క.

క|| పండితులు శాస్త్రవేత్తలు
దండిగ గలరీ ధరిత్రిదమశమ సహితా
ఖండ బ్రహ్మజ్ఞానులు
నుండుటలపరూప మార్య! యుర్వీస్థలిలో.

గీ|| కోటికొక్కరు మీవలె కోర్కెదీర
నాశ్రమంబుల బాలించి యాత్మశుద్ధి
గాలమున్ బ్రహ్మచింతనఁ గడపువారు
కలియుగంబున నిక్కంబు జ్ఞానరూప!

గీ|| పద్యపంచక రత్నాలభవ్యమాల
నాయెదుట మీరు నిలువంగ నట్టెదలచి
మీకుధరియింపజేసితి కృపనుగొనుమ!
శంకరానందగిరివర! సద్విహార!

ఓం తత్సత్

బెంగళూరు బ్రహ్మవిద్యాశ్రమములో చాతుర్మాస్య
వ్రతాంతమున



శ్రీ వా రు

బెంగళూరులో శ్రీవారు నివసించుచున్న



బ్రహ్మవిద్యాశ్రమము

## ౨౮. శ్రీ త్యాగమూర్తిప్రతిష్ఠ

ఈ వ్రతానంతరము కొన్నిదినములవఱకు సత్కాలక్షేపముతో నుండగ నంద్యాలభక్తుల ప్రార్థనానుసారము, తంతీవార్త మున్నగు బలాత్కారముచే భగవత్కార్యార్థమై మన శ్రీవారు నంద్యాలకు విచ్చేసిరి.

ఇచ్చట శ్రీ త్యాగరాజస్వామియొక్క కుటీరరూపముగానున్న ఈ పుణ్యస్థలము నేడు దివ్యమందిరముగా తయారైనది. అట్టి మందిరమున శ్రీ విజయనామ సం॥ మార్గశిర శుద్ధ పంచమి (తే. 11-12-53) శుక్రవారమునాడు శుభముహూర్తమున శ్రీ త్యాగరాజస్వామియొక్క అమృతశిలా విగ్రహము శ్రీవారి అమృతహస్తములద్వారా వేదోక్తవిధులతో ప్రతిష్ఠింపబడెను. ఆలయము విద్యుద్దీపములచే అలంకరింపబడి మహాశోభాయమానమై వెల్గొందుచు శబ్దవిస్తారకయంత్రముతోకూడి మహావైభవముగా జరిగెను. కార్యక్రమము మూడురోజులేర్పాటు చేయబడియుండెను. ఈ సుసమావేశమునకు గీతావాణీ సంపాదకులును, ఉత్తమ భాగవతోత్తములును, ప్రవక్తలును, విద్యావంతులునగు పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వాములవారు, శ్రీ చిదానందస్వాములవారు, శ్రీ బలభద్రుని హనుమంతరావు పంతులు, శ్రీ సాధుశివారెడ్డిగారు మున్నగు మహనీయులెందరో విచ్చేసియుండిరి. ఈ మహాత్ములచే దివ్యములైన ఆధ్యాత్మికోపన్యాసములు జరిగెను. అన్నదానాదులతో కార్యమంతయు సాంగ మంగళప్రదమయ్యెను. తక్కినవారందరును తమతమ స్థానములకు వెళ్ళిపోయిరి.

# ౨౯. శ్రీ గురునిర్యాణము

ఇంతలో గంజిగుంట ఆశ్రమమునుండి ఒక ఉత్తరము వచ్చెను. చరిత్రనాయకులగు మన శ్రీవారి సద్గురువరేణ్యులగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ సదానందస్వాములవారు కార్తీక బహుళ ఏకాదశి (తే. 1-12-1953) మంగళవారమునాడు మహాసమాధినందినట్లును, విజ్ఞులగు శ్రీ॥ బ్ర॥ సురపురము శ్రీ శంకరానందస్వాములవారిచే శాస్త్రీయముగా మహాసమాధికార్యము జరిగెననియు, ఆ సమయ మున సకాలమునకు తమకు తెల్పుటకు వీలు కాలేదనియు, ముందు మార్గశిర శుద్ధ పూర్ణిమకు గురుమహారాధనాకార్యము పెట్టుకొన్నామనియు, అచటి సర్వభక్తులతో కూడి తాము సకాలము నకు గంజిగుంట విచ్చేయవలెననియు ఆ జాబులో తెలుపబడి యుండెను. ఈ జాబును చూడగనే సూర్యుడస్తమింపగా అంధ కారమావృతమైనట్లు శ్రీవారి హృదయము దుఃఖావృతమైపో యెను. అశ్రుధార లఖండముగ తమంతట తామే ప్రవహింప సాగెను. ఏమిచేయుటకును తోపక నిస్తబ్ధులై భావసమాధినందిరి. అంత నొక గంటసేపునకు తెప్పరిల్లి,

"గురుదేవుడింతవరకు ఒక రూపమున నుండె. ఇప్పుడనంత రూపుడై సర్వమయుడై భాసిల్లుచున్నాడు. అయినను ఆ మహ నీయమూర్తి యొక్క నామరూపములు అవ్యక్తములాయె. గురు స్వరూపము అఖండాద్వితీయమై వెల్గొందుచున్నది."

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥"

ఓం తత్ సత్—అనుచు అచటి భక్తులను హితబోధలచే శాంత పఱచిరి. మఱునటి దినము సాయంకాలము ఉపన్యాసమున ఈ క్రింది విధముగా గురుగీతామూలము నుదహరించుచు భక్త్యావేశ పూరితులై గురుమహోపకారస్మరణ జేసిరి. నాటి ఉపన్యాసము నిదియే :—

"మన్నాథః శ్రీ జగన్నాథో మద్గురుః శ్రీ జగద్గురుః ।
స్వాత్మైవ సర్వభూతాత్మా తస్మై శ్రీ గురవేనమః ॥
పతిహీనా యథా నారీ మాతృహీనో యథా శిశుః ।
గురుహీన స్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥"

అన్నటుల పతిలేని సతి, తల్లిలేని బిడ్డ, గురువులేని మనుజుని జన్మయు నిరర్థకములు. కాన ఆత్మోన్నతినొంద గోరు ముముక్షువుల పాలిట గురువు కన్నతల్లియనవచ్చును. తల్లియొక్క స్తన్యపానము లేనిచో బిడ్డ బలోపేతముగానియట్లు గురుకృపామృత రసపానము లేనిచో శిష్యున కాధ్యాత్మికబలము గలుగజాలదు. ఆత్మ వికసింపదు. హృదయగ్రంథులు వీడవు. నిజసుఖ మబ్బదు. ఉత్తమమగు ఆదర్శజీవన మలవడదు. చివఱకు అజరామరత్వస్థితియు గలుగజాలదు. ఇందువలన అన్నివిధముల ప్రతిప్రాణికిని గురువత్యవసరము.

దుర్లభో విషయత్యాగః దుర్లభం తత్త్వదర్శనం ।
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణా వినా ॥

అనగా గురుకరుణామృతధారలులేనిచో విషయత్యాగము గాని తత్త్వదర్శనముగాని చివఱకు జీవితచరమలక్ష్యమగు సహజావస్థగాని కలుగజాలదు. కనుక గురుడు మొదట తల్లియై ఆధ్యాత్మిక బలమొసంగె.

ఆ పిమ్మట "న గురోః సదృశం పితా" అనునట్లు గురువుతో సమా నుడైన తండ్రిలేడు. కనుకనే "తండ్రిహరిఁ జేరుమనియెడు తండ్రి తండ్రి" అని భాగవతోత్తముండగు ప్రహ్లాదుడనెను. కనుక మొదట తల్లిగానుండి బలమొసంగి పిమ్మట తండ్రిగానుండి చక్కని ఆచారవిచారముల గఱపెను. తండ్రియగువాడు తానాచ రించిన పద్ధతులయందు పుత్రునెట్లు నియమించునో అట్లే గురువు తానాచరించి అనుభవించిన విషయములను శిష్యునకు బోధించి ఆచరింపజేయును. కనుకనే

"ఆచినోతి హి శాస్త్రాణి హ్యాచారే స్థాపయత్యపి।
స్వయమాచరతే యస్మా త్తస్మాదాచార్య ఉచ్యతే॥"

అనగా "శాస్త్రములభ్యసించి తత్ప్రకారమాచరించి ఇతరులను కూడ ఆచరింపజేయువాడే ఆచార్యుడనబడును" అని వక్కాణించి నారు. శిష్యునకు ఆత్మాభ్యుదయ శక్తిద్వారా ధైర్యస్థైర్యసామర్థ్య ములనిచ్చి, సదా తన శిష్యుడు చక్కగా పరిశ్రమించి ఉన్నతాను భవములనొంది ఆత్మధనమును సముపార్జించి దానిని లోకమునకు పంచిపెట్టెడి త్యాగశీలుడు కావలెననియే గురుడు సదా సంకల్పిం చుచు హితమును గోరుచుండును.

"కులం ధనం బలం శాస్త్రం బాంధవాః సోదరా ఇమే।
మరణే నోపయుజ్యంతే గురు రేకో హి తారకః॥"

అనునట్లు ఐహికములగు కులము ధనము బలము శాస్త్రము బంధువులు సోదరులు మున్నగునవేవియును మరణ సమయమున పనికి రావు. కాని "అహేతుక దయాసిన్ధు బంధు రానమతాం సతాం"— అన్న వాక్యానుసారముగా గురువు పరమబంధువై భవబంధములనే

ద్రుంచుచున్నాడు. అనిత్యమగు సంసారవిషయకూపవముల బడి తెన్నుగానక తికమక్కలై యున్న సమయమున, లౌకికవిషయములు అనిత్యములని హేతుదృష్టాంతములతో. తెలియజేసి విషయాసక్తిని విడిపించి వైరాగ్యమును గల్గించు హితైషియగు ముఖ్యబంధువు గురువు. అజ్ఞానాంధకారమున బడి దారి దప్పినప్పుడు జ్ఞానదీపము నొసంగి దారిజూపును. ఆచారరహితులై అసభ్యజీవనముతో చరించువేళ ఆదర్శజీవన విధానముల దెలిపి అవివేకమును దుఃఖమును బాపి దివ్యజీవనము నొసంగును. దుష్టభావములచే దరిద్రులై బాధలనుభవించు తరి తన సన్నిధిమాత్రము చేతనే దరిద్రకల్పనల దూరముజేసి భావసంపదనొసంగి రక్షించును. ఇంతకంటె గొప్ప బంధువెవరు?

"శివక్రోధాద్గురు స్త్రాతా గురుక్రోధాచ్ఛివో న హి।
తస్మాత్సర్వప్రయత్నేన గురోరాజ్ఞాం న లంఘయేత్॥"

అనగా భగవంతుడొకవేళ కోపగించినచో గురుడు రక్షించగలడు. కాని గురుడు కుపితుడైనచో హరుడును రక్షించజాలడు. కనుకనే "న గురోరధికం" అని చెప్పబడెను. పరశివుడు నిరాకారుడు అప్రత్యక్షుడు. గురుదేవుడన్ననో సాకారుడు ప్రత్యక్షుడున్నైన సదాశివుడు. ఇట్టి ప్రత్యక్షపరమేశ్వరుని కన్నులార చూడవచ్చును. చెవులార తనివిదీర ఉపదేశవాక్యముల వినవచ్చును. అతని సన్నిధిని మన మెప్పు నడచుకొనవచ్చును. తృప్తిగా సేవింపవచ్చును. సాకారుడగు మన గురుని మహిమ అపారము. కండ్లుపుండ్లుగాకయుండినచో (సత్యదృష్టితో తిలకించినచో) ఆ మహనీయుని మహిమ గనుగొనగలము. కాన గురుదేవుడాదిదేవుడు.

గురుశబ్దముననే నిజముగా ఒక గరిమగలదు. అన్నిటికంటెను పెద్దదని అర్థము. అట్టి పెద్దపదార్థమేదియన భూమయే (బ్రహ్మమే) గాన గురునికంటె బ్రహ్మము వేరు లేదు. ఇదియే ఆత్మ; ఇదియే పరమాత్మ; ఇదియే మనయందరి స్వరూపము. భక్తితో సదా నిష్ఠ సలుపుటే మన కర్తవ్యమని తలంచి మాతాపితృ బంధుదైవ స్వరూపుడగు ఏ గురుమహానుభావుడు భక్తుల భజనార్థమై "గరుడె తల్లియు తండ్రిదైవము, గురుడె సర్వము గురుడె యాత్మ యనుచు సుస్థిర భక్తి సల్పుచు" అను తత్త్వమును రచించెనో అట్టి నా గురుదేవుడు ఈనాడు అవ్యక్తరూపమున సర్వమయుండై భాసిల్లుచున్నాడు.

"చిత్తయక్షదృఢాక్రాంతిం న శాస్త్రాణి న బాంధవాః ।
శక్నువంతి పరిత్రాతుం గురవో న చ మానవాః ॥

అను వాసిష్ఠవాక్యానుసారముగా కేవలమధ్యాసముచే కల్పింపబడిన చిత్తమనెడి యక్షుని (మహామాయ) బారినుండి శాస్త్రములు గాని బంధువులు గాని మానవులు గాని రక్షింపజాలరు. కాని పరమేశ్వర స్వరూపుడగు గురుడన్నో చిటికమాత్రమున పారద్రోలి జన్మజరా మరణ బంధమూలమగు అధ్యాసికబుద్ధిని నిర్మూలించి పరమ శాంతమగు ముక్తిసుఖంబును గల్గించగలడు. అట్టి నా గురుదేవుడీనాడు అవ్యక్తరూపమున సర్వమయుండై భాసిల్లుచున్నాడు.

బిడ్డ మరొకదాని ఆశ్రయమున పైకి లేచి నిలబడి నడవగలిగినట్లు ఏ గురుమహాశయుని పాదాశ్రయమున ఈ శిష్యుడు నిలబడగలిగెనో, ఇట్టి వీనిని నడపుటకై బ్రహ్మనిష్ఠుడగు ఏ స్వామి తనకవసరము లేకపోయినను బ్రహ్మముహూర్తమున 4 గంటలకు

ఘణఘణ ఘంటలు మ్రోగించి శిష్యుని లేపి నిష్ఠయందుండనియ మించి తమ ఎదుట గూర్చుండ బెట్టుకొనుచుండెనో అట్టి నా గురుస్వరూపము నేడు అవ్యక్తరూపమున సర్వవ్యాపకమై భాసిల్లుచున్నది.

ఏ గురుమహానుభావుడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడై శ్రోత్రియత్వముచే ప్రమాణగత సందేహముల నివర్తింపజేయుచు బ్రహ్మనిష్ఠచే ప్రమేయగత సందేహముల దీర్చుచు, ప్రమేయమగు ఆత్మ బ్రహ్మమేయని శిష్యులకు బోధించి అనుభవింపజేసెనో అట్టి శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడగు నా గురుదేవుడినా డవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

కం॥ గురుముఖమున బడయక దు
ష్కరతపమున జేసి పడయగా బడు విద్యల్,
పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టి సాధులకైనన్.

అను స్మృతివాక్యానుసారము గురుముఖమున రాని విద్య, తద్జ్ఞానమును సాగరజలములు క్షారములై పానయోగ్యములు గాకుండునట్లు అహంకారకామాదిదుర్గుణదాయకములైయుండును. గురుముఖమున సంపాదింపబడిన విద్య మేఘముఖమునుండి వచ్చిన పావనగంగవలె పానయోగ్యములై అహంకారకామాదులు నివర్తింపజేయును. వేయేల! సంప్రదాయసిద్ధముగా గురుకృపాలబ్ధము గాని విద్య సాధువుగాదు. అది జారగర్భమువలె వన్నెకెక్కదు. గురుకృపాలబ్ధమైన విద్య, జ్ఞానము తన్ను తరింపజేసి తన్నాశ్రయించినవారినికూడ తరింపజేయసమర్థములైయుండును. "నావికుడు నావయందు గూర్చున్నవారును అందరు ఎట్లు సుఖ

ముగా ఆవలియొడ్డు జెరుదురో" అను నిట్టి సులభోపమానము లతో బోధించుచుండెనో, అట్టి సుసంపన్నసంప్రదాయసిద్ధగురు డనబడు కర్ణధారుడినాడవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లు చున్నాడు.

గురుడు సంసారమహారోగైకశామకుడు. అందుచేతనే అతనికి భవరోగవైద్యుడని బిరుదము గలదు. లోకమున వాత పిత్తశ్లేష్మా దుల వ్యత్యాసముచే గలిగెడి రోగముల బాపుటకు పెక్కువై ద్యులు గలరు గాని రోగములకెల్ల మూలమనదగిన పెద్ద భవరో గము గలవాని నాడి ఈ వైద్యులకు దొరకదు. వీరి ఔషధము లచట పనికి రావు. కాన "భిషజే భవరోగిణామ్" అనగా భవరోగము నకు వైద్యుడు గురుడు. ఔషధము గురుపాదరసము. అట్టి గురు పాదరసమునొసగి భవబంధముల బాపిన నా గురుపరమాత్మ నేడ వ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

"అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా ।
కదాచిదపి నో కుర్యాత్ అద్వైతం గురుసన్నిధౌ ॥"

అన్నట్లు హృత్తాపనివారకము, భవసాగరతారకమునగు శ్రీ గురుచరణసాన్నిధ్యముచే బడసిన మహోపకారము మరువ రానిది. ఆ ఋణము తీర్పరానిది. కనుక సదా భక్తిభావ మున వర్తించుచు గురుని పూజించవలెను. అద్వైతమును సర్వకాలసర్వావస్థలయందు సర్వమునందును భావించుచుం డినను కేవలము గురుసన్నిధియందు మాత్రము తగదు. తత్త్వజ్ఞానమునకై మనమాతని శరణుజొచ్చి వారి కృపచే తత్త్వ మును ఎఱింగినను గురుసన్నిధిని కృతజ్ఞులై పరమపూజ్యబుద్ధిచే

వర్తించుచుండవలెను. ఈ దేహమున్నంతవఱకు గురుఋణము తీరదు. అవిభాజ్యమగు అతని కరుణామయదృష్టిపాతములు మఱి పునకు రావు.

"చెందుమద్వైతమ్ము చిత్తమం దెపుడు
చెందకద్వైతమ్ము చేష్టయం దెపుడు।
బొందు మద్వైతమ్ము ముల్లోకములను
'గూడ దద్వైతమ్ము గురునిలో నెపుడు ॥"

అనునట్లు అట్టి పరమపూజ్యుడగు నా గురుదేవు డీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః।
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వల్పండితవృత్తయః॥

అనగా చూపుచే చేపయు, ధ్యానముచే తాబేలును, స్పర్శచే పక్షియు తమతమ బిడ్డలను పోషించునట్లు (తృప్తిపఱచునట్లు), తత్త్వజ్ఞానియగు గురుడు కూడ చూపుచే కొందరిని, తలంచి కొందరిని, స్పర్శచే కొందరిని ముక్తుల జేయును. ఇంతియేగాక సూర్యచంద్రాగ్న్యాది మండలముల చేతను నశింప శక్యము గాని నా హృదయాంధకారమును తత్త్వమసీత్యాది మహావాక్యప్రబోధయనెడి వెలుగుచే బాపిన చిజ్జ్యోతి గురుదేవుడు. మరియు వేదములకు తెలియరాని, యోగులకందని, తపస్సులకు దొరకని ఆ పరతత్త్వమును అనాయాసముగా నా కరగత మొనర్చిన మహాసమర్థుడు శ్రీగురుదేవుడని ఏస్వామి పరమప్రేమతో శ్రీ సర్పభూషణ శివయోగుల పాటల బాడుచు భక్తులకు దెలుపుచుండెనో అట్టి నా గురుదేవుడీనాడు అవ్యక్తరూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

భాగవతమున పోతనామాత్యుడు భగవంతుని సంసేవించిన (కమలాక్షునర్చించు కరములు కరములు ఇత్యాది) దేహేంద్రియములే యోగ్యములని చెప్పిన పగిది శ్రీ గురుపరమాత్మను దర్శించిన కన్నులే కన్నులు, అతని వచనములు విన్న చెవులే చెవులు, అమ్మహనీయమూర్తిని స్తుతించిన జిహ్వయే జిహ్వ, అతనిని సేవించిన కరములే కరములు, ఆతడొసంగిన మహామంత్రమును తత్త్వమును అనుసంధాన మొనర్చిన మనస్సే మనస్సు, ఆ పరమ పూజ్యుని పాదములపై నుంచి నతులొనర్చిన శిరమే శిరము. అట్టి భక్తజన వంద్యుడై సదా సంసేవ్యుడనదగిన నా గురుదేవుడినాడు అవ్యక్త రూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు

"కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ ।
గురుర్విశ్వేశ్వరః సాక్షాత్ తారకం బ్రహ్మనిశ్చయమ్ ॥"

అనగా గురుడు నివసించు స్థానమే కాశీ క్షేత్రము; అతని చరణోదకమే పవిత్రగంగ; అతడే సాక్షాద్విశ్వేశ్వరుడు; బ్రహ్మాత్మబుద్ధియే తారకము. కనుక గురుమహాత్ముడు అడుగు లిడిన స్థలములు పుణ్యక్షేత్రములే. అతడు తాకిన వస్తువు పరమ పవిత్రమే. అతని దృష్టిప్రసారమొందిన ప్రాణులెల్ల ధన్యములే. సూర్యకిరణములంతటా వ్యాపించియుండినను తలుపులు తెరువబడియుంచిన గృహమున మాత్రమే కిరణములు ప్రసరించునట్లు, గురుకటాక్షకిరణములు అంతట వ్యాపించియున్నను, శ్రద్ధాభక్తి ప్రపత్తులతో, నీతినియమ సదాచారసన్నిష్ఠలతో కూడి ఎవని మనోద్వారకవాటము తెరువబడియుండునో అట్టి ఉత్తమ భక్తుల హృదయములందెల్ల గురుకృపాకటాక్షవీక్షణ కిరణప్రసారము కలుగ

గలదు. తోడనే అజ్ఞానాంధకారము భగ్నమై అఖండసుఖమనెడి జ్యోతి వెల్గొందును. గురుకృపయనునది ధర్మమేఘమువంటిది. అదనుజేసి పెట్టబడిన భూములందీ వర్షధారలు అక్షయ ఫలముల నందించు నను నిట్టి ఉపమానోపమేయములతో సదా శిష్యకోటికి దెలుపుచుండిన అనుపముడగు నా గురుదేవుడీనాడు అవ్యక్త రూపమున సర్వమయుడై భాసిల్లుచున్నాడు.

"ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా ॥"

అనునట్లు సర్వము గురుడే. అన్ని ధ్యానములకంటెను గురుధ్యానమే శ్రేష్ఠము. అన్ని పూజలకంటెను శ్రీగురుపాదపూజయే అధికము. సర్వమంత్రములకంటెను గురువాక్యమే శ్రేష్ఠము. శ్రీ గురుకృపయే ముక్తికి మూలము.

అనునీ మన్నగు అనేకవిషయములను పై మఱచి పరవశులై మాట్లాడి శ్రీసద్గురు కృపా మహిమను దలచి దలచి సొమ్మసిలి సభికులను ఆ నందాశ్రుధారల ముంచి తేల్చిరి. పావుగంట నేవం దరును అంజలిబద్ధులై శాంతముగా మౌనము వహించి గురునెద దలంచి శ్రద్ధాంజలి యొసంగి ఇట్లు మంగళమును పాడిరి:—

శంకరాభరణము — ఆటతాళము

మంగళం శ్రీ సదానందార్య। ప్రజ్ఞాన ధుర్య।
సంగరహితాత్మైక్యధీచర్య। సద్గురు వర్య ॥ప॥
మంగళాంగ। కృపాంగ। దురితవిభంగ। త్రిగుణాసంగ
పరమప్రసంగ। ఆత్మసుసంగ బుధనుత। మంగళం భక్తాంతరంగ ॥అను॥

వాసనాత్రైనాశక। సదయ। నిర్మలహృదయ। దోషతిమిర హరాయ। తత్త్వమయ। పరచింతనాయ॥ పోషితాఖిల సుజనగణ।

భవపాశనాశ| సుయోగ నిద్రావేశ| నిరతనిమీలితాక్ష|శాశ్వతానంద ప్రకాశ || ||౧||

తలవనష్టా దశశతాబ్దములలో| మఱి డెబ్బదైదౌ| శాలివాహన శకమునందునను|లలివిజయ కార్తిక బహుళ ఏకాదశీ తిథి యందుర్ణ|| విలసితంబుగ భౌమవారం బలవడగ ని| ర్వాణ మొందియు| మలరహిత బహ్మాంబవై కడు| వెలయు సచ్చిత్సుఖ స్వరూప|| ||౨||

మోదయుత గంజిగుంట నివాస| సదమల వికాస| భేదరహిత విరక్తసువిలాస| ప్రజ్ఞానభాసా|| ఆదిసంవిద్బోధచే శ్రీ| సాధు శంక రానందగిరి వరు |సాదరంబున బ్రోచితివి శ్రీ పాదనారాయణ కవినుత || ||౩||

ఓమ్ తత్ సత్

"మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే|
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళం||"

ఓం శాంతిః శాంతిః శాంతిః

## ౩౦. గురు మహారాధన

ఆనంతరము మార్గశిర శుద్ధ పూర్ణిమ (తే 20-12-1953) ఆది వారమునాటికి శ్రీవారు భక్తాదులతో గంజిగుంటకు విచ్చేసిరి. శ్రీ ఉమామహేశ్వర గురుపీఠసంప్రదాయ భక్తులెల్లరు చేరిరి. శ్రీ వారు తమ చేతులార మహాసమాధికి కాశీ గంగాభిషేకాదులచే విధ్యుక్తముగా పూజ గావించిరి. యావచ్ఛిష్యమండలియు గురు పరంపరాస్తోత్రపాఠములతో మంత్రపుష్పము మంగళహారతుల సమ ర్పించిరి. జయజయ ఘోషములతో సభ ప్రారంభమయ్యెను.

ప్రశాంతముగ శాస్త్రప్రవచనముల జరిపిరి. ఈ సమయమున శ్రీవారు "శ్రద్ధను" గురించి గంటన్నరసేపు ఇట్లు అమోఘముగా ఉపన్యసించిరి. దాని సారమిది :—

"..........గీతాకారులు జ్ఞానసాధనము శ్రద్ధయే యని నొక్కి వక్కాణించుచు "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అను ఈ అష్టాక్షర మహామంత్రము నుపదేశించిరి. ఈ వాక్యమున శ్రద్ధావాన్ అని చెప్పిరి గాని ధనవాన్—పుత్రవాన్—కీర్తివాన్—అని చెప్పలేదు. ఈ ఐహికవిషయ సమ్మిశ్రితంబులగు భావములచే జ్ఞానమలవడునని ఎవరును చెప్పలేదు. కేవలము "శ్రద్ధావాన్" అనియే పలికిరి. ఉపనిషత్తునందును "శ్రద్ధాభక్తిధ్యాన యోగాదవైహి" అనియే చెప్ప బడినది. శ్రద్ధయే జీవనసౌరభము. అది దైవదత్తమగు మానవ జన్మయందలి అపూర్వమగు పెన్నిధి. ఇక అశ్రద్ధయో రాక్షసరూప మగు జన్మపిశాచము.

ఇట్టి పరమోత్తమంబగు శ్రద్ధను గురువేదాంత శాస్త్రముల యందుంచదగినదని పెద్దలు పలికిరి. అట్లుగాక ఈ శ్రద్ధను అన్య స్థానములయందుంచినచో అది అపవిత్రమై కామరాగాదుల రూప మున పరిణమించి చివరకు వ్యామోహకూపమున బడవైచి జీవితమున తీరరాని అష్టకష్టముల పాలు చేయును. కాన మన శ్రద్ధను గురుశాస్త్రములయందుంచినచో అది భక్తియనిపించుకొని ముక్తిరూపంబగు అక్షయఫలంబొసగి జన్మను ధన్యముగావించును.

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥"

అను శంకరవాక్యానుసారము ఆ శ్రద్ధ పరాభక్తియైబరగి పరంధా

మమగు బ్రహ్మాత్మనా సంస్థితిరూపకైవల్యంబొనగూర్చుటలో ఇంచుకంతయైనను సందియము లేదు.

పవిత్రమగు శివలింగమునొకటి తెచ్చి అపవిత్రంబగు దిబ్బగుంట యందుంచుట తగునా? తగదు. పవిత్రంబగు ఆలయమునందుం చినచో శోభావంతమై భక్తుల ఇష్టార్థము లీడేర్చు పరశివాలయం బనిపించుకొనును. అదే విధముగా మానుషజన్మలో లభ్యంబగు భక్తిలేదా శ్రద్ధ అను ఈ శివలింగమును గురుశాస్త్రములయందు ప్రతిష్ఠించి పూజించి సేవించిన జన్మసాఫల్యంబగుననియు చిర శాంతి సుఖంబులబ్బుననియు బుధులు పలికిరి. ఈనాటి మన అనుభవమున ఇయ్యది పరమసత్యంబేయని తెలియుచున్నది. కావున ఆ ముక్తిసాధనంబగు శ్రద్ధను ఐహిక విషయవ్రాతముల యందుంచినచో అది రోతయై కొరమాలిన్నదై పోవును. అందుచే ఆ ఉత్తమప్రాణపదకమనదగు శ్రద్ధనుద్ధరించి గురుశాస్త్రముల యందు ప్రతిష్ఠింపజేసి తాము మార్గదర్శియై గంతవ్యస్థానమును దెలిపి స్వస్థులై వసించుచున్న మన పూజ్య గురువర్యుల పుణ్యా రాధన మహోత్సవము గాన వారిచే ఉజ్జీవింపబడిన మనము మన శ్రద్ధాభక్తులను కృతజ్ఞతాపూర్వకముగా శ్రీవారి చరణోపాంతమున నివేదించుకొనుచు గురుని సేవింతము...........

...........తత్త్వవిదులగు మహాత్ముల ప్రాణములు ఉత్క్రమ ణము నొందవు గాన మహనీయుల నిర్యాణమును పుణ్యారాధన యందురు. వారి జననమును జయంతియందురు. తదితరులది పుట్టినదినము చచ్చినదినము—అందురు పుట్టుచావులు లేని పుణ్యమూర్తి గురుడు........పుట్టి చచ్చువాడు గురుడు గాడు. ఇందులకు హర్షవిషాదములనొందు శిష్యుడు శిష్యుడు గాడు–ఓం.

పిదప మరొక విషయము—"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని ఇంతమాత్రమే గాక గీతాచార్యులు ఈ శ్రద్ధను గురించి "తత్పరః సంయతేన్ద్రియః"—అని మరి రెండు విశేషణముల దెలిపియున్నాడు. ఈ విషయములను ముముక్షువులు అత్యంతోపాదేయముగా గ్రహింపదగినవి. శ్రద్ధ ఏదో ఒకకాలమున ఉన్నంతమాత్రమున నే చాలదు. కేవలమారంభశూరత్వమే గాక కడవరకు ఆ శ్రద్ధ ఎడ తెగక చెక్కుచెదరక అఖండముగా ఉండుట ఉత్తమము. ఆ శ్రద్ధకు జీవితమంకితమై పోవలెను. అదే గతి అదే స్థితి. ఎట్లన మనము భుజించిన ఆహారము అట్లనే ఉండక కొంత కొంత భాగము రక్తముగను మాంసముగను మేధస్సుగను ఇట్లు మారి దేహగతమై తత్స్వరూపమేయై ఉండునట్లు తత్పదలక్ష్యమగు గురుడు బ్రహ్మమే—అను స్మృతిరూపమున స్థితిజేయు అవిభాజ్యంబగు శ్రద్ధయే తత్పరత్వమనబడును. "కార్యం వా సాధయామి దేహం వా పాతయామి" అనునట్లు ఆత్మానుభవమగు పర్యంతము విడువక తీవ్రప్రతిజ్ఞతో తత్త్వనిష్ఠగలిగి యుండవలెను.

పిమ్మట "సంయతేన్ద్రియః" అనగా మనమొక (బ్రహ్మనిష్ఠాది) కార్యము చేయునపుడు గలిగెడి నానావిధ విఘ్నములను, "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్" అన్నట్లు ఇంద్రియములను విషయముల బారికి చిక్కనీయక అనగా తన ఇంద్రియములను జయించి జితకాముడై ధీరుడైయుండుటయే. దానిచే మాత్రమే ఆత్మసాక్షాత్కారము కాగలదు. అట్లు లేనిచో, రావణుని పాతాళ హోమమున తన అజితేంద్రియత్వమే తన అచలమగు శ్రద్ధను పాడుచేసి తన యజ్ఞమును భ్రష్టపఱచి చివఱకు తన నాశహేతు వైనట్లు జితేంద్రియత్వము లేనివాని శ్రద్ధయు సర్వనాశహేతువు

కాగలదు. ఎట్టకేలకు శ్రద్ధయనునది పైవిశేషణములతో గూడి యున్నప్పుడే పూర్ణఫల మిచ్చును.

వేయి మాటలేల! శ్రీ విద్యారణ్యమునీంద్రుల గురువగు శ్రీ శంకరానందయతివరేణ్యులవారు తమ గీతాతాత్పర్యబోధినియందు ఈ శ్రద్ధావాన్ అనుటకు ఇట్లు నిర్వచించిరి,

"సర్వం ఖల్విదం బ్రహ్మ", "సర్వం హ్యేతద్బ్రహ్మ", "బ్రహ్మైవేదం సర్వం" ఇత్యాది శ్రుతిశతైః; "సోహం చ త్వం స చ సర్వమేతత్," "భూతాని విష్ణు ర్భువనాని విష్ణుః", "వాసుదేవః సర్వం" ఇత్యాది స్మృతిసహస్రైరిదం సర్వం బ్రహ్మైవ బ్రహ్మవివర్తత్వాత్ మరుజలవదిత్యాది యుక్తికోటిభిశ్చ నిర్ధారితేఽర్థేసర్వస్య బ్రహ్మమాత్రత్వే శ్రద్ధావాన్ శ్రద్ధానామ విపరీతభావనారాహిత్యేన ఉక్తార్థానువృత్తబుద్ధివృత్తివిశేషస్తద్వానేవ సన్ యో ముముక్షుర్బ్రహ్మవిద్యతిర్మద్గతేన శ్రుతం దృష్టం స్పృష్టం మతం విజ్ఞాతంచ సర్వం బ్రహ్మైవేతి విపరీత ప్రత్యయ రాహిత్యేన పూర్వోక్త శ్రుతిస్మృతియుక్తిభిర్నిర్ధారితే సచ్చిదానందైకరసే మయ్యద్వితీయేపరే బ్రహ్మణి గతేన బహిరన్తః సర్వత్ర, మత్సత్తానువర్తినా అన్తరాత్మనా చేతసా నిరుక్తలక్షణం మాం భజతే సర్వమిదమహం చ బ్రహ్మైవేతి స్వం జగచ్చ సర్వం బ్రహ్మైవ పశ్యతి। ఆహారవిహార శయనాసనాదిషుసర్వాస్వవస్థాసు చ వృత్త్యన్తరరహితతయా సర్వదా మామేవ పరమాత్మానంస్వాత్మనా యోఽనుసంధత్త ఇత్యర్థః॥"

అనగా "ఇదియంతయు బ్రహ్మమే" యని తెల్పు పెక్కుశ్రుతులచేతను; "నేనును నీవును ఇదియంతయు నతడే", "సకల భూతములు సకలలోకములు విష్ణువే", "అంతయు వాసుదేవుడే" అను మొదలగు స్మృతులచేతను; బ్రహ్మవివర్తమే యగుటచే నిదియంతయు మరుజలమువలె బ్రహ్మమే—అను మొదలగు అసంఖ్యాకములైన యుక్తులచేతను; నిర్ధారణ చేయబడిన అర్థము సర్వము బ్రహ్మమాత్రమేయైయుండ శ్రద్ధగలవాడు

(శ్రద్ధయనగా వ్యతిరేక భావనలేకుండ వెనుకజెప్పిన అర్థమునే అను సరించియుండు బుద్ధివృత్తివిశేషము. అది గలవాడై) ముముక్షువగు బ్రహ్మవేత్తయైన యే యతియైతే మద్గతమైన :—విననది, చూచినది, తాకినది, తలంచినది, ఎఱింగినది—ఇదియంతయు బ్రహ్మమేనని, వ్యతిరేకభావన లేకుండ వెనుకజెప్పిన శ్రుతిస్మృతి యుక్తులచే నిర్ధారితమైన సచ్చిదానందైకరసమగు అద్వితీయ పరబ్రహ్మమైన నాయందు లోపల వెలుపల అంతటను నాయొక్క సత్తనే అనువర్తించియుండు అంతరాత్మ (మనస్సు)తో ముందు జెప్పిన లక్షణములు గల నన్ను భజించుచున్నాడో; "ఇదియంతయు నేనును బ్రహ్మమే" అని తన్ను జగత్తును అంతటిని బ్రహ్మమునుగానే చూచుచున్నాడో; ఆహార విహారశయనాసనాదులయందు సర్వావస్థలలోను అన్యవృత్తిలేకుండురీతిని నిరంతరము పరమాత్మ నగు నన్నే స్వస్వరూపముగా ఎవ్వడనుసంధానము జేయుచున్నాడో అతడే శ్రద్ధావంతుడు. అట్టి స్థితియే శ్రద్ధయనబడుచున్నది.

అట్టి శ్రద్ధయొక్క పరమార్థమును ఏ పూజ్యమహాశయుని బోధచే నెఱింగి తచ్చరణముల నాశ్రయించితిమో, అతి బలీయుడగు రావణుని బలపరాక్రమమునకు నైతము కదలక మెదలక ఆదిమధ్యాంతములయందు వ్యాపించి అచలప్రతిష్ఠితమైన ఆత్మలింగమువోలె, మనశ్శ్రద్ధాభక్తులను గురుశాస్త్రములయందు ప్రతిష్ఠింపజేసి ఎవరిచేతను బాపరాని అబాధ్యంబగు సత్యతత్త్వమున మనలను ఏ మహానుభావుడు ప్రబోధగలిగించి ధన్యుల గావించెనో అట్టి పరమశ్రద్ధార్హంబును, పూజార్హంబును, గౌరవార్హంబునునగు శ్రీ గురుపరమాత్మకు వందనములర్పించువాడను ........ఓం తత్ సత్— అని గంభీరముగా ఉపన్యసించిరి.

ఇదేసమయమున భక్తులొకరడుగగా శ్రీవారు వేదములను గురించి యిట్లు వక్కాణించిరి :—

"నాయనా! వేదము రెండురూపములు. ఒకటి మంత్రరూపము. రెండవది బ్రాహ్మణరూపము. అందు మంత్రరూపవేదము ఋగ్యజుస్సామాథర్వణములను భేదముచే చతుర్విధము. బ్రాహ్మణరూప వేదమనగా :—ఇతిహాసము, పురాణము, విద్య, ఉపనిషత్తు, శ్లోకము, సూత్రము, వ్యాఖ్యానము, అనువాఖ్యానము—అని ఎనిమిది విధములు. అందు—

1. జనకాదుల కథాప్రసంగ బోధకవేదవచనము ఇతిహాసము.

2. జగదుత్పత్తిస్థితిలయకారణుడు మాయవిశిష్టపరమాత్మయని బోధించునదియు; పౌతిమాష్యాది ఋషులవంశములను చెప్పునదియు; విరాట్టుయొక్కయు, తత్పుత్రుడగు స్వాయంభువమను సృష్టియందు గలిగిన వర్ణచతుష్టయమును, వాని భిన్న భిన్న కర్మలబోధించు వేదవచనము పురాణము.

3. బ్రహ్మాది దేవతలయొక్క ఉపాసనాపద్ధతులను బోధించునది విద్య.

4. వస్తువుయొక్క సత్యాసత్యస్వరూపవిమర్శతో బ్రహ్మాసంబంధమగు రహస్యనామముల (తత్త్వమును) బోధించునది ఉపనిషత్తు.

5. బాహ్మణ భాగమంత్రములను చెప్పు వేదవచనము శ్లోకము.

6. "ఆత్మానముపాసీత" ఇత్యాది వాక్యములచే సంక్షిప్తముగా ఆత్మతత్త్వములను చెప్పునట్టి వేదము సూత్రము. (సూత్రమున అల్పాక్షరయుతము).

7. మంత్రార్థమును బోధించు బ్రాహ్మణరూపవేదము వ్యాఖ్యానము.

8. సూత్రార్థములను మంత్రార్థసహితములుగా వివరించు వేదము అనువ్యాఖ్యానము.

విద అనగా జ్ఞానము. అట్టి జ్ఞానమును తెల్పునదియే వేదము. అనగా వేదము జ్ఞానస్వరూపము. జ్ఞానము భగవత్స్వరూపము. భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసములే వేదములు. అట్టి వేదవాక్యములయందలి ఆదరబుద్ధియే భగవద్బుద్ధి. తదవిశ్వాసమే భగవదనాదరము—అను మున్నగు పెక్కు విషయములందెల్పిరి.

పిమ్మట అన్నశాంతి మున్నగువానితో కార్యము సంపూర్ణమయ్యెను. కాని అప్పుడచట చేరియున్న గురుభక్తులందఱును శ్రీమన్మహాసమాధిపై అమృతశిలను స్థాపించి, అందు నర్మదాబాణము కాశీ శివలింగప్రతిష్ఠ జేయించవలెనని మాట్లాడుకొనిరి. ఆ వెను వెంటనే రెండువేల రూపాయలకు పైగా వాగ్దానముచేసి పట్టీలు వ్రాసి వెంటనే బెంగళూరులో శిలను తయారుచేయించుటకై ముందుగా కొంత ధనమును శ్రీవారికి సమర్పించుకొనిరి. పిమ్మట అందఱును తమతమ స్థానములకు వెళ్ళిపోయిరి.

## ౩౧. శ్రీ కబీరనాథస్వామి పుణ్యారాధన

శ్రీ స్వామివారు మరునాడే అచటినుండి బయలుదేరి బెంగళూరు బ్రహ్మవిద్యాశ్రమమునకు వెళ్ళిరి. ఈ శిలల విషయమైపై విచారించి చివఱకు నచ్చిన ఒక గొప్ప కార్ఖానాలో శిలను తయారు చేయుటకు ఉత్తరువిచ్చిరి. మామూలుగా ఆశ్రమమున శాస్త్ర ప్రవచనాది నిత్యకార్యక్రమములను నియమముగా జరుపుకొనుచు సుఖముగానుండిరి. కొంత కాలమునకే అయ్యాశ్రమ స్థాపనాచార్యులగు శ్రీ|| బ్ర|| శ్రీ కబీరనాథస్వామివారి పుణ్యారాధన మహో

త్సవము సమాపించెను. అధ్యక్షస్వాములగు సురపురం శ్రీ శంకర శాస్త్రులవారు, పూజ్యపాదులగు ఆళ్ళగడ్డ శ్రీ శంకరానందస్వాముల వారు, శ్రీరామకృష్ణానందస్వాములవారు, శ్రీ కేశవతీర్థస్వాముల వారు మున్నగు పెక్కుమంది మహాత్ములు విచ్చేసియుండిరి. సకాల మున సప్తాహమహోత్సవ కార్యక్రమము ప్రారంభమై రెండు పూటల మహాత్ముల ఉపన్యాసములతోను, పూజాన్నదానములతోను మహావైభవముగా సమాప్తినొందెను.

## ౩౨. శ్రీ మలయాళమహర్షి సందర్శనము

ఇట్లు కొంతకాలము గడచెను. ప్రస్తుతము ఆంధ్రదేశమున ఆదర్శమైన ఆశ్రమమన్నచో శ్రీ వ్యాసాశ్రమము. ఇట్టి పుణ్యా శ్రమము పెక్కుమంది సాధువులకును విద్యార్థులకును ఆశ్రయ మైయున్నది. దాని వైశిష్ట్యమును వర్ణింపనలవిగాదు. దీనిని సర్వలోకహితైషులు, పరోపకారపరాయణులు, సంసార మహారో గైకశామకులు, గీతాది బహుగ్రంథరచయితలును, యుగపురుషు లును, ఋషిసంప్రదాయ ప్రవర్తకులును, ముముక్షువులగు నరనారీ జనోద్ధారకులును, కరుణాస్వరూపులును, అసంగానంద యతివర్యు లను అన్వర్థనామముచే విలసిల్లువారునునగు పూజ్యపాద మహర్షి మలయాళస్వాములవారు స్థాపించిరి. వారు భక్తుల ప్రార్థనాను సారము పెక్కుగ్రామముల సంచరించుచు, బెంగళూరు దండు శ్రీ గీతాప్రచారమండలివారి కోరిక నీడేర్ప తే॥ 29—4—54వ తేదిని బెంగళూరునకు విచ్చేసిరి. కొన్ని రోజులు గీతామందిరమునను విశ్వేశ్వరపురమందలి శాంతినివాసమునందును నివసించుచు సభల జరుపుచు బెంగళూరులోగల పెక్కు ఆశ్రమములకు విచ్చేయుచు

పావనమొనర్చుచు తమ యమృతవాణిచే నందరిని సంతృప్తిపటి చిరి.

ఈ సమయమున మన చరిత్రనాయకులగు శ్రీ స్వామివారు ప్రతిదినము శ్రీ మహర్షిసన్నిధికి వెళ్ళుచు వారి బోధల వినుచుం డిరి. మహర్షిగారిని తమ బ్రహ్మవిద్యాశ్రమమునకు పిలిపించవలె నని తలంపుగలిగెను. మహర్షిగారికి చిరపరిచితులగు తమయా ప్తులు శ్రీ పండిత రాజగుప్తగారితో కలసి సన్నిధికి వెళ్ళి తమ యభిప్రాయమును సవినయముగా తెలియజేసిరి. అందుల కమ్మ హాత్ములు చల్లని చూపులతో శాంతిమయవాక్కులతో, "మంచిది, పూర్వము శ్రీరామచంద్రుడు అడవిలో పరివ్రజించు సమయ మున, అచ్చటచ్చటగల పుణ్యాశ్రమములకు వెళ్ళుచు అందలి పవిత్ర వాతావరణములను పరిశీలించి సంతసించుచుండెనట. అటువలె మీా ఆశ్రమమునకు రేపు ఉదయము 9 గంటలకు వచ్చెద"మని సెలవిచ్చిరి. అంత మహాభాగ్యమని తలంచి ప్రణామ ములాచరించి మన స్వామి తమ ఆశ్రమమునకు విచ్చేసి తగునే ర్పాట్లు గావించిరి.

నిజముగా మహర్షిగారి వాక్కు పవిత్రము, సార్థకము. శ్రీ రామచంద్రమూర్తి లోకశాంతికొఱకై పరివ్రజించుచు రావణాది రాక్షసులను దునుమాడి పవిత్రమొనర్చెనో, అట్లనే పూజ్య శ్రీ మలయాళమహర్షిగారు భక్తుల కామరాగాదిశత్రువులను చంపి శాశ్వతశాంతిని గల్గించుటకై పరివ్రజించుచు సాక్షాత్ రామచంద్ర మూర్తియై అనునట్లు శ్రీ బ్రహ్మవిద్యాశ్రమమునకు విచ్చేసిరి. ఆశ్రమ నిర్వాహకులు శ్రీ మహర్షిగారిని మిక్కిలి వైభవోపేత ముగా మర్యాదతో తోడ్కొనివచ్చి తగువిధముల సత్కరించిరి.

ద్రాక్షాపాకమనదగు శ్రీవారి బోధల విని పరమానందమందిరి. ఆశ్రమ దివ్యభవనమును భక్తుల భక్తి ప్రపత్తులను గని మహర్షి గారు అమందానందమందిరి.

తే॥ 3—5—54వ తేదిని ఆప్త మిత్రులును పరమ సజ్జనులునగు శ్రీ రాజగుప్తగారితో గలసి మన శ్రీవారు గీతా మందిరమున మహర్షిసన్నిధికి వెళ్ళి ఏకాంతముగా దర్శించిరి. అప్పుడు శ్రీ మలయాళయతీంద్రులవారు అమిత కౌతుకప్రేమతో ఇట్లుపదేశించిరి, "మిమ్ము జూచిన మాకు పరమసంతోషము. సంతతము బ్రహ్మ నిష్ఠ సలుపుచుండండి. పాతంజలయోగసూత్రముల చక్కగా అధ్యయన మొనర్చుడు. సూత్రములు కంఠస్థము గావించినచో మిక్కిలి మంచిది. మీ ఆచారవిచారములు ఆదర్శములు. ఇం కను అభివృద్ధిగాంచుడు. లోకమున కొన్ని విషయములు తనకు తెలియకనే వచ్చి దాపరించును. మొదట మహాభక్తియా యని తోచును. ఆ పిదప భక్తిపోయి వ్యామోహరూపమున పరిణమించి ఎదుట నిలుచును. భయంకరమై దుఃఖదాయకమై మోసగిం చును. అట్టివానియెడ ప్రమత్తతలేక ఒళ్ళంతయు కళ్ళుగలిగి చూచుకొనుచుండవలెను. ఒకప్పుడు వానిచే చలింపని స్థితి మీయందున్నను ప్రమత్తతతో నుండరాదు. అప్రమత్తులై ఆత్మా రాములై మీయందు మీరుండవలెను.

"అశనే వసనే చైవ శయనే భవనే తథా।
బుద్ధిర్యస్య న లిప్యేత ముక్తోఽసౌ న చ సంశయః"

అనునట్లు అశనవసనశయనభవనములయందు ఎంతమాత్రము ఆసక్తిలేక అంతట ఆత్మనిష్ఠయందే ఉండవలెను. మీరు పుణ్యా

త్మ్రలు ధన్యాత్మ్రలు. ఓం తత్ సత్''—అని చెప్పివుుగించిరి.

ఇతియేగాక మన శ్రీవారియెడ మిక్కిలి వాత్సల్యముగలవారై మహర్షిగారు తమ "యథార్థభారతి" అను వేదాంతమాసపత్రికను పరమకరుణతో ఆశ్రమమునకు పంపెదమని సెలవొసంగిరి. అవ్యాజప్రేమాంబునిధులగు శ్రీమహర్షిపూజ్యపాదులు బెంగళూరునుండి బయలుదేరి వెళ్ళునపుడు "శ్రీ మలయాళయతీంద్రగీత" అను గ్రంథమును ఆశీఃపురస్సరముగా శ్రీవారికి ప్రసాదించిరి.

## ౩౩. శిలాస్థాపన—శివలింగప్రతిష్ఠ

ఆ పిదప కొన్నిదినములకే సమాధిశిలలు తయారయ్యెను. వానిని గంజిగుంటకు సాగించుకొని వెళ్ళుటకై భక్తుడగు శివలింగ బ్రహ్మచారి బెంగళూరునకు వచ్చెను. పిమ్మట శిలలను సాగించుటకై తగిన ఏర్పాట్లు చేసి తే. 23-5-54వ తేదిని పూజ్యస్వామివారు ప్రయాణమై గంజిగుంటకు (అక్కడ తగిన ఏర్పాట్లు చేయుటకై) విచ్చేసిరి. నాటి రాత్రియే శివలింగప్ప శిలలను లారీద్వారా సాగించుకొని ఉదయము 10 గంటలకు గంజిగుంటకు వచ్చెను. ఈ సందర్భమున బ్రహ్మవిద్యాశ్రమముయొక్క కొందఱుత్తమ భక్తులు గావించిన గొప్ప సహాయము చిరస్మరణీయము. దాదాపు 180 మణుగుల బరువుగల ఆ శిలలను గర్భాలయమున స్వస్థానమందు చేర్చుట మిక్కిలి దుస్తరమయ్యెను. తగిన పరికరము లేవియును ఇచటలేవు. కాని శ్రీ గురుపరమాత్మ దొడ్డవాడు కాన,

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం।
యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్॥"

అన్నట్లు, తగిన శక్తిచాలని అచ్చటనున్న ఆ కొందరికే శక్తినొసంగి వారిద్వారా ఆ శిలలను ఉపాయమున నిరపాయముగ తన స్వస్థానమున చేర్చుకొనియె, మఠమును మిక్కిలి శోభిల్లఁజేసె. అతడు కర్తుమకర్తుమన్యథాకర్తుం సర్వశక్తిసంపన్నుడు గదా! ఇట్టి గురుపరమాత్మ భక్తుల యండనుండ భయమేమి? తన కార్యముల తానే నిరాయాసముగ చేయించుకొనును. అతనిని నమ్మినవారి కెట్టి విఘ్నములు రావు.

సాధుసింహ శ్రీ శివారెడ్డిగారు శ్రీవారు నచ్చటనేయుండి శ్రీశివలింగప్రతిష్ఠా మహోత్సవమునకు వలసిన తగిన ఏర్పాట్లు గావించుచు, శ్రీ జయవత్సర జ్యేష్ఠపూర్ణిమ (తే. 16-6-54) బుధవారము నాడు ప్రతిష్ఠామహోత్సవముని నిర్ణయించిరి. పత్రికల ముద్రింపించి అందరికిని పంపిరి. కార్యక్రమమున కాహ్వానితులగు శ్రీ॥ బ్ర॥ శ్రీ శంకరశాస్త్రులవారు, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు మున్నగు పెక్కు మహాత్ములు, సాధువులు, భక్తులు, శ్రీ ఉమామహేశ్వరపీఠముయొక్క శిష్యమండలియు సకాలమున విచ్చేసిరి. ఈ పూజ్యమహాత్ముల అమృతహస్తములద్వారా నిర్ణీతబ్రహ్మముహూర్తమున వైదిక విధానములతో సక్రమముగా మహాసమాధిపై శివలింగప్రతిష్ఠ గావింపబడెను. ఈ వైదికకార్యక్రమములన్నియు బెంగళూరు బ్రహ్మశ్రీ విద్వాన్ ఎన్. రాజగుప్త గారిచేతను, వజ్రకరూరు వే॥ మూ॥ కె. ఎం. గాది లింగశాస్త్రిగారి చేతను యథావిధిగా నిర్వహింపబడెను.

వెంటనే జయజయధ్వానములతో అఖండశివపంచాక్షరీ మహామంత్రస్మరణతో ప్రారంభమై మరుదినమువఱకు జరిగెను. రెండురోజులును భగవద్గీతాపారాయణము, శ్రీరుద్రాభిషేకము,

గురుపీఠ సమారోహణ శుభసమయమున



శ్రీ వారు

తహస్రనామార్చన, సర్వోపచారపూజాదులు సకాలమున జరిగెను. పౌర్ణమినాడుదయము పూజ్యమహాత్ములగు శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారు, శ్రీ శంకరశాస్త్రిగారు శ్రీ శంకరానందగిరిస్వామివారును అమోఘములగు వేదాంతోపన్యాసముల గావించిరి. సాయంత్రము శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు అనుభూతిపంచకమును గురించియు, శ్రీ స్వరూపానందగారు, శ్రీ గాదిలింగశాస్త్రిగారు, శ్రీ శంకరశాస్త్రులవారును, వేదాంతతత్త్వము గురుమహిమలను గురించి యుపన్యసించిరి. మరురోజుదయముకూడ శ్రీ వీరప్ప గారు, శ్రీ శివారెడ్డిగారు, శ్రీ చిదంబరరెడ్డిగారును నైష్కర్మ్యసిద్ధి మున్నగు విషయములను గురించియు, విద్వాన్ శ్రీ రాజగుప్త గారు త్రివిధ తపస్సును గురించియు ఉపన్యసించిరి. పిమ్మట శ్రీ శంకరానందగిరిస్వాములవారు, శ్రీ శంకరశాస్త్రులవారును గురుపూజా విశేషములను గూర్చి చక్కగా ప్రబోధించిరి. వందల కొలది భక్తాదులు చేరియుండిరి.

## ३४. గురుపీఠ సమారోహణము

పవిత్రమైన ఆ పౌర్ణమినాడు మహనీయుల సన్నిధానమున ఉపన్యాసానంతరము బ్రహ్మనిష్ఠులగు పూజ్య శ్రీ శంకరశాస్త్రిస్వాములవారు మన చరిత్రనాయకులగు శ్రీ శంకరానందగిరిస్వాముల వారితో,

"స్వామీ! ఇంతవఱకు తమ గురువులుండిరి. ఇక తమరు అన్ని విధముల యోగ్యమైన తపోనిష్ఠాశక్తిసంపద్విశిష్టులగు యతివర్యులు. కావున సాంప్రదాయానుసారముగా నేడు కొందఱు

భక్తులకు సాంప్రదాయిక మహామంత్రమును ఉపదేశించి గురుపీఠ మునధిష్ఠించవలెనని మా సదిచ్ఛ''—

అని పలికి స్వామిని గాఢాలింగనమొనర్చుకొనిరి. పూజ్యపాద శ్రీ శుద్ధచైతన్యస్వాములవారును,

''స్వామీ! ఇందులకు తమరంగీకరించియే తీరవలెను. తమ యందా గురుత్వమున్నది. నిజముగా శ్రీ శంకరానందగిరి గురువ రులే తమరు. ఓం తత్సత్''—అని పలికిరి.

వెంటనే అచటనున్న తక్కినవారును పై మాటలే చెప్పనారం భించిరి. అపుడు మన స్వామివారు వినమితభావమున,

'' ఇంత పెద్దపనియా!''—అనిరి. అంతలోనే స్వాములు మున్నగువారందఱును,

''ఔను, పెద్దవారికి పెద్దపనియే!''—అని శాసించిరి.

ఇట్లు అనుల్లంఘనీయములైన మహాత్ముల వాక్యములను విని, ''ఇది శ్రీగురునాజ్ఞ''—అని దలంచి, ''కార్యకర్త గురుడే'' అనినిశ్చయించి, ఓం తత్సదనుచు, మహాత్ములకు సాష్టాంగదండప్రణామములాచరించి, మఠమున మహాసమాధికి ప్రదక్షిణ నమస్కారముల గావించి, పూజాది ద్రవ్యములచే అలంకరింపబడి యున్న పీఠమునధిష్ఠించి, శ్రీమదుమామహేశ్వర గురుపరంపరా స్తోత్రమును జేసి శాస్త్రోక్తమగు విధులతో గురుసంప్రదాయముగా వచ్చిన శ్రీ మహామంత్రమును కొందఱుత్తమభక్తులకు ఉప దేశించిరి. ఇదే సుముహూర్తమున భక్తుడగు ఎం. సి. కదిరెప్ప అను నాకు మంత్రపూతముగ బ్రహ్మచర్యాశ్రమ దీక్షనొసంగి ''శ్రీ తత్త్వానంద బ్రహ్మచారి'' అను నామమును ప్రసాదించిరి.

## ౩౫. ప్రియావాస నివాసము

ఇట్లు కార్యానంతరము ఆ గంజిగుంటయందలి ఆశ్రమమున మహాసమాధిపూజా వగైరా కార్యములను నిర్వహించుటకై తగిన ఏర్పాట్లు గావించిరి. అనుదినము శ్రీ సదానంద సద్గురుస్వాముల వారి శిష్యులగు కె. వీరప్ప అను సద్గుణవంతులు శాస్త్రప్రవచనము చేయులాగునను, తక్కిన సర్వవ్యవస్థలను శ్రీ వెంకటప్ప, కె. నాగప్ప మున్నగు భక్తాదులు నిర్వహించుకొనునట్లును ఏర్పాటు చేసిరి.

పిమ్మట తమ సంప్రదాయ ముఖ్యస్థలమగు ఉమెళ్ళ సమీపమున రాగులపాడు అను గ్రామమున గల శ్రీ ప్రణవాత్మానందాశ్రమమునకు నాటి సాయంకాలమే మహాత్ములందరితో కలసి వెళ్ళిరి.

మిక్కిలి మనోహరమును సువిశాలమును అగు ఆ పవిత్రస్థానమును గని అందరును పరమసంతసమందిరి. ఈ ఆశ్రమస్థాపనాచార్యులగు శ్రీశ్రీశ్రీ ఆత్మానందసద్గురుస్వాములవారు శ్రీమదుమామహేశ్వర గురుపీఠపరంపరలో ఒక ప్రధానపురుషులు. శ్రీ జనకునిభంగి వీరు అపరోక్షజ్ఞానదార్ఢ్యముగలవారు. స్థితప్రజ్ఞులు. శ్రీ ప్రణవానందస్వాములవారి శిష్యులు. వీరును శ్రీ సదానందస్వాములవారును సతీర్థ్యులు. ఏకైకసాంప్రదాయ ప్రవర్తకులు. పరమాప్తులు. నాటి రాత్రియంతయు అచటనే యుండి మరునాడుదయము (తే. 18-6-54) బయలుదేరి సుఖముగా తమకు మిక్కిలి ప్రియమైన శ్రీ శివలింగాశ్రమమును చేరిరి. అచటి పావనవాతావరణయుతమగు ఏకాంతవాసమును

ఓం అమలాయనమః। ఓం జ్ఞానదేశికాయనమః। ఓం తత్త్వమ
స్యాది వాక్యార్థలక్ష్యాయనమః। ఓం నిష్కళాయనమః। ఓం తార
కాయనమః। ఓంతత్త్వబోధకాయనమః। ఓం నిత్యశుద్ధాయనమః
ఓం నిత్యముక్తాయనమః। ఓం జ్ఞానలింగాయనమః। ఓం
స్వయంప్రకాశాయనమః। ఓం జన్మజరామృత్యునివారకాయనమః।
ఓం నిర్లేపాయనమః। ఓం అద్భుతచారిత్రాయనమః। ఓం అద్వై
త్రేనమః। ఓం ఊర్ధ్వరేతసేనమః। ఓం సదసత్ రహితాయ
నమః। ఓం సాధుగమ్యాయనమః। ఓం సర్వాత్మనేనమః। ఓం
శాంతాయనమః। ఓం అనన్తశక్తయేనమః। ఓం నిష్ప్రపంచాయ
నమః। ఓం ఈశ్వరాణామధీశాయనమః। ఓం వేదాంతవేద్యాయ
నమః। ఓం షడూర్మివర్జితాయనమః। ఓం షడ్భావరహితాయ
నమః। ఓం అమృతాయనమః। ఓం అంతర్యామినేనమః। ఓం
అపరిచ్ఛేద్యాయనమః। ఓం క్షమిణేనమః। ఓం కూటస్థాయనమః।
ఓం కైవల్యదాయకాయనమః। ఓం కపటవర్జితాయనమః। ఓం
కాలాతీతాయనమః। ఓం అవస్థాత్రయసాక్షిణేనమః। ఓం అప్రమే
యాయనమః। ఓం అద్వయాయనమః। ఓం అవ్యక్తాయనమః।
ఓం కూటాయనమః। ఓం గ్రంథిత్రయవిమోక్షణాయనమః। ఓం
చిన్మాత్రాయనమః। ఓం జ్ఞానగమ్యాయనమః। ఓం బ్రహ్మానందా
యనమః। ఓం భవాబ్ధితారణాయనమః। ఓం పరాత్పరాయనమః
ఓం తత్త్వార్థాయనమః। ఓం దుష్టదూరాయనమః। ఓం దురా
చారనాశనాయనమః। ఓం అభాస్వరాయనమః। ఓం విధివిష్ణు
శివాకృతయేనమః। ఓం అజహల్లక్షణ విలక్షణాయనమః। ఓం
అజడాయనమః। ఓం అపారసంసారార్ధవిఘట్టనాయనమః। ఓం
అమన్యవేనమః। ఓం అమోఘవైభవాయనమః। ఓం అభయంక
రాయనమః। ఓం వరదాయనమః। ఓం ముక్తిరూపాయనమః।
ఓం శాశ్వతాయనమః। ఓం అఖండమహిమాంభోధయేనమః।

ఓం అఖండబోధాయనమః। ఓం మనోవాచామగోచరాయనమః। ఓం పరిపూర్ణాత్మనేనమః। ఓం బాహ్యాంతరస్థితాయనమః। ఓం భక్తిశ్రద్ధాధ్యానగమ్యాయనమః। ఓం నిరహంకృతయేనమః। ఓం నిర్వికారాయనమః। ఓం నిర్వైరాయనమః। ఓం లక్ష్యాలక్ష్యవర్జితాయనమః। ఓం నిర్వికల్పాయనమః। ఓం అవ్యయాయనమః। ఓం అనంతరూపాయనమః। ఓం అనుత్తమాయనమః। ఓం దక్షిణాభిముఖాయనమః। ఓం అద్భుతాయనమః। ఓం అలింగాయనమః। ఓం నిఃసంగాయనమః। ఓం నిర్వాణసుఖదాయనమః। ఓం నిగమాతీతాయనమః। ఓం నిత్యాయనమః। ఓం ధర్మవతాం వరాయ నమః। ఓం శ్రీగురుమూర్తయేనమః।

శ్రీ గుర్వష్టోత్తర శతనామావళిః సమాప్తా.

---

## మంగళము

హిందూస్తాన ముఖారి — ఆటతాళము

(రచనః—తత్త్వానంద)

మంగళం శ్రీ శంకరానందగిరిగురువర! మంగళం।
మంగళం శ్రీ ఆత్మబోధక। మంగళం జయ సద్గురో! ప.

ఆందముగ నాత్మప్రబోధను। అందజేతువు జనులకుఁ।
అందు నిందును నెందు జూచిన। నందెయుండిన గురువరా ॥౧॥
నిరతముఁ బోధించుచుండియు। నిర్వికారతఁ జెందియుఁ।
నిర్వికల్పసమాధి యందున। మరిగియుండిన హే ప్రభో ॥౨॥
మందమతిగల పరమభక్తుల। కందరికి గుటి తెల్పియు।
బంధనంబుల ద్రుంచితివి ఆ। నందరూప! దయానిధే ॥౩॥
రత్నగిరియందున్న జనులకు। తత్త్వమును బోధించియు।

సత్యనిష్ఠను బొందఁజేసిన। నిత్యనిర్గుణ! హే ప్రభో! ॥౪॥
ధరణి తత్త్వానందనుత! నిను। మరువకను స్మరియించెదఁ।
సరగుననను బ్రహ్మాత్మసంస్థితి। నిరతమొసగుమయ సద్గురో ॥౫॥
మంగళం శ్రీశంకరానందగిరిగురువర మంగళం।



## మంగళము

(రచన :- సాధు శ్రీ సహజానందులవారు)

కేదారగౌళి — ఆటతాళం

మంగళం మంగళం। సద్గురుదేవా। మంగళం మంగళం ॥ప॥

మంగళం శ్రీశంకరానందగిరివర। సంగరహితభవ బ్రహ్మాకారా ॥
లింగాంగైక్యభావ। శృంగారజ్ఞానము। క్త్యంగన సంమోహా।
నాంగ కృపాంగా ॥౧॥

కాశీనివాసంబు। గావించి గీర్వాణ। భాషనభ్యాసంబు। గావించియు।
జేసి సద్గురుసేవ। సంన్యాసమొనరించి। వాసిగ యోగుల।
జూచిన మీకు ॥౨॥

శీతాతపంబుల। సాతిశయప్రీతి। గా తాల్మినోరిచి। భూతలిని ॥
ప్రీతి తపోధన। మార్జించి యమిత। ప్రఖ్యాతి గాంచిన।
బ్రహ్మవేదివి మీకు ॥౩॥

పరతత్త్వమెప్పుడు। మఱువక జనులకు। పరమప్రీతిని
బోధ। జేయుచును ॥
సరగున సంసార। వారాశి దాటింప। వర కర్ణధారుడ!
పరమగురో ॥౪॥

కుందనగిరి శిఖర। మందలి భక్తుల। కందముగా బ్రహ్మా।
నందమొంద।
సందేహమును బాపి। సద్బోధగావించు।
చుందువెపుడు సహజా। నంద సంస్తుత్య ॥౫॥

